
క్షణ మాత్రంలో...
ఐటెక్స్
కాజల్ సుప్రీం
మీ కళ్ళ అందాన్ని ఇనుమడించే
కాజల్ సుప్రీం. ఆధునిక వనితల
కళ్ళను చక్కగా అలంకరించ
డానికి, ఆరోగ్య సూత్రాలనను
సరించి తయారుచేయబడిన
కాజల్ సుప్రీం మీ చేతిలో
సులభంగా ఇమిడేది.
అరవింద్ లాబొరేటరీస్
కళ్ళను సంరక్షించే శ్రేష్ఠ
వస్తువుల తయారీలో
దాదాపు 50 సంవత్సరా
లకు పైగా అనుభవం వున్నవారు.
KAJAL SUPREME
గరిష్ట వెల (MRP)
రూ. 6.00
(స్థానిక పన్నులు అదనం)
అరవింద్ లాబొరేటరీస్ మదరాసు 600 033.
Imageads 2788 Tel



# 'చిరుదివ్వెలు'పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన వింజమూరి విజయశాంభవిగారి నవల 'చిరుదివ్వెలు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## సజీవ చిత్రణ

**(ప్రథమ బహుమతి రూ.100/-పొందిన సమీక్ష)**

**ఒ**క మగవాడి అహంభావానికి, స్వార్థానికి బలైపోయి కూడా ధైర్యంగా, లోకంతో ఒంటరిగా తలపడి, జీవితాన్ని నిలుపుకొన్న స్త్రీమూర్తిగాథ 'చిరుదివ్వెలు'లో సీతపాత్ర చిత్రీకరణ సజీవంగా ఉండి, ఆమె మహిళాలోకానికి ఆదర్శమై నిలిచింది. జీవితంలో ఎదురైన చేదుఅనుభవాలు, ఆమె వాటిని ఎదుర్కొన్నవైనం, చదువుతుంటే దిగ్భ్రాంతులమవుతాము.

అయితే ప్రధానపాత్ర, ఇతివృత్తం ఎంతగొప్పగావున్నా ఇతర పాత్రల చిత్రీకరణలో అక్కడక్కడా లోపాలు కన్పించక మానవు. సీత తనచుట్టూ ఉన్న లోకాన్నంతా మాటిమాటికీ అమాయకులుగానూ, స్వార్థపరులుగానూ తలపోయడం, తను అందరిలోకి ప్రత్యేకమైనదాన్నని భావించడం ఈ పాత్ర గొప్పదనాన్ని కాస్త తగ్గించింది. "ఇంత ఔదార్యంతో ఈ ప్రపంచంలో బతకడం కష్టమక్కా" అని సుధ అంటే- "నేను బతుకుతున్నాను గదమ్మా" అనడం వంటి మాటలు సీత తనకు చాలా ఔదార్యం, క్షమాగుణం ఉన్నాయని పనికట్టుకుని చాటుకొంటున్నట్లున్నాయి. అలాగే ఆమె నాగరాజు, వినోద్, చిన్నా మొదలైన రౌడీలను తన మంచితనంతో ఒక్కసారిగా మార్చివేయడం సినిమాట్రిక్‌గా ఉంది.

శ్రీకాంత్ తను ప్రేమించిన యువతికోసం సర్వస్వమూ వదులుకొని, అతి సామాన్యంగా బతుకుతూ, రెండేళ్లపాటు భార్యతో అన్యోన్యమైన సహజీవనం గడిపినవాడుగదా! మరి భార్య ప్రమేయం లేకుండా జరిగిన ఒక సంఘటనకుగాను ఆమెను వదలివెళ్లిపోవడమేగాక, చివరికి పక్కా విలన్‌గా మారినట్టు చూపడం బాగాలేదు. మొత్తానికి ఈ పాత్రలో కన్పించిన ద్వంద్వ వ్యక్తిత్వం పాఠకులకు నచ్చకపోవచ్చు.

సీత కొడుకు 'అజిత్' తొమ్మిదేళ్ల పసివాడు. సీత 'వాడికి తన గురించి ఏమీ దాయకుండా అన్నీ ముందే తెలియజేయాలనుకోవడం' బాగుంది కానీ ప్రతి విషయం అవసరానికి మించి వాడిముందే మాట్లాడుకోవడం అతిగా అనిపించింది. పైగా "నేను ఆయనతో వెళ్లిపోతే నీకు మళ్లీ తమ్ముడో చెల్లెలో పుట్టరుగదమ్మా" వంటి మాటలు పసివాడి చేత అనిపించడం బాగాలేదు.

మొత్తంమీద నవలలో రచయిత్రి స్త్రీ సమస్యలపట్ల చూపించిన అవగాహన, స్త్రీలకు "ఎన్నికష్టాలు, సమస్యలు ఎదురైనా తట్టుకొని ఎటికెదురీది ధైర్యంగా ముందుకుపొమ్మని" ప్రభోదించే సందేశం మెచ్చుకోదగినదీ, మరచిపోలేనిదీ!

—కె. పద్మావతి, గూడూరు

## మార్గదర్శకం

**(ద్వితీయ బహుమతి రూ.75/-పొందిన సమీక్ష)**

**విం**జమూరి విజయశాంభవిగారి 'చిరుదివ్వెలు' నవల స్త్రీలకు మార్గదర్శకంగా ఉంది. శ్రీకాంత్ పాత్రను ఉత్తముడిగాను, ఇతరులుమెచ్చేవిధంగా ఉండే ప్రత్యేక లక్షణాలను ఆదిలో

ముఖచిత్రం భాస్కర్

ఆపాదించి కథాగమనంలో చివరికి మరీ క్రూరుడిగా చిత్రించడం కేవలం సీతపాత్రకు పాఠకులనుండి మరింత సానుభూతి చేకూర్చే ప్రయత్నమే అనిపించింది. శ్రీకాంత్‌ను చివరికి చెడ్డవాడిగా చిత్రీకరించాలంటే ముందు పాఠకుల మనసులలో అంత మంచి ముద్రపడి ఉండకూడదు. లక్షల ఆస్తిని, కట్నాన్ని, అందమైన అమ్మాయినీ వదలుకుని ప్రేమించిన అమ్మాయికోసం సర్వమూ త్యాగంచేసి రెండేళ్ళపాటు భార్యతో అన్యోన్యంగా కాపురం చేసిన వ్యక్తి భార్య శీలాన్ని కోల్పోయిందని, నిండు గర్భిణిని వదిలివెళ్ళిపోవడం అసహజంగా ఉంది.

అలాగే సీత ఎదుర్కొన్న సంఘటనలు నాగరాజు, వినోద్, చిన్నా మంచివాళ్ళుగా మారిపోవడం నిజజీవితంలో అయితే ఎలా ఉంటాయోగాని, కథలో మాత్రం సినిమా టిక్‌గా బాగుంది. దీని ఆధారంగా యువతులు కాలపరిస్థితులు ఆలోచించకుండా రౌడీలమధ్యకు సాహసించి వెళ్తే అందరికీ సీతకు లభించిన గౌరవాభిమానాలు లభించకపోవచ్చు.

సీత తండ్రి స్వభావం చిన్ననాటినుండీ ఆయన ఎదుర్కొన్న సంఘటనలనుబట్టి సహజంగా ఉంది. సీత పిన్ని పాత్రకూడా ఉన్నతంగా కన్పించింది.

విపత్కరపరిస్థితులెదురైనపుడు సీత ధైర్యంతో ముందడుగు వేసి, కష్టాలను ఎదుర్కొన్న విధానం మార్గదర్శకంగా ఉంది.

—యస్. సులోచన బాపట్ల

## ముగింపు పేలవం

**(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)**

సీత పాత్ర ద్వారా 'చిరుదివ్వెలు' నవలలో ఏదో సందేశమివ్వాలనుకున్న రచయిత్రి చివరికి విఫలమయ్యారనే చెప్పవచ్చు. వినోద్‌ద్వారా భంగపడిన తనను శ్రీకాంత్ కాదన్నపుడూ, మృగంలాంటి నాగరాజును మంచివాణ్ణి చేసినపుడు కూడా ధీరత్వం ప్రదర్శించిన సీత అర్థరాత్రి ఊరుదాటి వెళ్ళిపోవడం పాఠకులను ఆశ్చర్యపరుస్తుంది. ఆ ఊరి జనం భరించరాని మాటలన్నపుడు కూడా మొక్కవోని ధైర్యంతో ముందుకు సాగిన సీత చేత రచయిత్రి చివరికి పలాయనవాదాన్ని ఆశ్రయింపచేయడం బాధ కలిగించే విషయం

ఈ ఊరేనా ప్రపంచం, ఎచటా మాత్రం లేదా- అని అజిత్ తల్లికి జ్ఞానోపదేశం చేయడం, అప్పటిదాకా పతివ్రతారాలిలా ప్రవర్తించిన సీత ఒక్కసారిగా పరిస్థితులకు భయపడటం ఒక మంచి నవలకు సరైన ముగింపు కాదనిపిస్తోంది. ఊరు విడిచి వెళ్ళిపోయిన తల్లీకొడుకుల్ని చిరుదివ్వెలంటూ సుధ చేత చెప్పించడం- అసలు సుధ పాత్ర రూపకల్పనే 'సీత స్తోత్రపఠనాని' కన్పిస్తుంది.

ఒక వినోద్‌ని, మరో నాగరాజుని తనదైన దారిలోకి తెచ్చుకున్న సీతకు, అంతరించిన అమ్మలక్కలు అంటున్న మాటలను ఎంతో నిబ్బరంతో ఎదిరించిన సీతకు, శ్రీకాంత్‌ని ఎదిరించడం పెద్దకష్టం కాదు. అప్పుడు అజిత్ కోసం రక్తపాతం జరగడం ఇష్టంలేదని సీత పాత్ర ద్వారా చెప్పించేందుకు రచయిత్రి ప్రయత్నిస్తే అది ఖచ్చితంగా బలహీనమైన సమర్థింపు అవుతుంది కానీ వాస్తవంగా ఉండదు. ఒకవేళ బాబుని ఎత్తుకెళ్ళేందుకు శ్రీకాంత్ పథకం వేసినా వినోద్, నాగరాజు వంటివారు అండగా ఉన్నారుగదా, రక్షించడానికి! అలాంటి పరిస్థితుల్లో ఒక్కసారిగా సీత ఊరువిడిచి వెళ్ళడం పిరికితనమే తప్ప బయటి ప్రపంచపు సవాళ్ళు ఎదుర్కోవడానికి చిరుదివ్వెలా వెలుగుతూ దూసుకెళ్ళినట్లవదు. చివర ఈ ఒక్క పొరపాటును అధిగమించినట్లయితే ఖచ్చితంగా ఈ నవల చిరకాలం పాఠకుల హృదయాల్లో నిలిచిపోయుండేది.

—ఎ. వాసుదేవన్, విజయవాడ

## పరిపక్వత

(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)

సమాజం ఒంటరి స్త్రీని ఎన్ని కష్టాలుపెడుతుందో, ఆమె ఎన్ని ఇబ్బందులు ఎదుర్కోవాలో రచయిత్రి ఈ నవలలో మరొక్కసారి హృద్యంగా చెప్పారు.

మొదట ఎంతో ఉదాత్తంగా చిత్రీకరించిన శ్రీకాంత్ పాత్ర రాను రాను నికృష్టంగా మారుతుంది. అతను ఎలా మారిందీ సీత ఆలోచనల్లోనే చదివి గ్రహిస్తాం. దుర్మార్గులైన నాగ

రాజు, వినోద్ మారగలిగారుగాని మంచివాడ యిన శ్రీకాంత్ అంత క్రూరంగా సీత పట్ల ప్రవర్తిస్తాడని వూహించడం కష్టం. తండ్రిని అర్థం చేసుకొని ప్రవర్తిస్తున్న సవతితల్లి "ఆలో చనాసరళి" సీతను ప్రభావితం చేయడంవల్ల అందరినీ సానుభూతితో అర్థం చేసుకొనే ఈ పాత్ర మహోన్నతంగా మలచబడింది. "వీ ళ్లెందుకు నన్ను వెలివేశారు?" అనుకోకుండా "వీళ్లెందుకు ఇలా ప్రవర్తిస్తున్నారు?" అని ఆలోచించి, వాళ్ల అమాయకత్వానికి నవ్వు కొంటుంది. ఇలా వుండబట్టే ఆమెను వెలివే సినవాళ్ల మధ్య పది సంవత్సరాలు నెట్టుకొ స్తుంది. నడిరోడ్డున సీతను అవమానించబో యిన నాగరాజు మారిన సన్నివేశాన్ని ఇంకా బాగా చిత్రీకరించి వుంటే పాఠకుల హృదయా న్ని మరింతగా ఆకట్టుకొనేది.

"మనిషి మనిషికి తోడు మంచి మనిషికి తోడు" అన్నట్టు సీత తన్నవమానించినవాడు హాస్పటల్‌లో వున్నాడని తెల్సి ఆదుకోజూ డటం ఉదాత్తంగా ఉంది.

మానవత్వం ఇంకా మంటకలవలేదు అన్న ట్లుగా సమాజంలో అక్కడ కన్పించే సహృద యులు సుధ, అవ్వ, గోపాలరావు.

శ్రీకాంత్ సీతను అజిత్ విషయమై నిర్బంధించినప్పుడు "ప్రపంచం ఈ వూళ్లోనే వుందా?" అని అడిగిన అజిత్ మానసిక పరిపక్వత కళ్లకు కట్టినట్టు కన్పిస్తుంది.

బావి నుంచి మొదలైన కథ కావాలని "బావి దగ్గర ఆపాలి' అన్నట్టు ముగించారేమో రచయిత్రి. ఏమైనా "శీలం" పాతివ్రత్యం వంటి పాతభావాల నుంచి సంస్కరించబడిన సీత పాత్ర గొప్పగా మల్చబడిన ఖ్యాతి శ్రీమతి వింజమూరి విజయశాంభవిదే.

—సి.హెచ్.జె. నరసింహారావు, రామగుండం

## మనోవిశ్లేషణలోముందడుగు

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

'అనాదిగా పురుషుని దౌష్ట్యానికి బలవుతూన్న స్త్రీ తన సమస్యలను తానే పరిష్కరించుకోవాలి తప్ప ఇతరులపై ఆధారపడరాదు' అనే ధర్మా

న్ని "చిరుదివ్వెలు" నవల తెలియజేస్తుంది. తరానికీ తరానికీ పరిస్థితులు మారినా సమస్య మాత్రం ఒక్కటే, అదే - స్త్రీమనుగడ! "మనం పయనించే తోవలో పూలూ- ముళ్ళూ ఉంటాయి. పూలను ప్రేమతో ఏరుకుంటే- ముళ్ళను జాలితో పక్కకునెట్టు" అనే ధోరణిలో సాగింది.

"ప్రతి మనిషీ తనకు తానుగా దుర్మార్గుడు కాడనీ; పెంపకాలు, పరిస్థితులు ఆ మనిషి ప్రవర్తనకు కారణాల"ని గ్రహించిన పిన్ని పెంపకంలో పెరిగిన సీత తాను చదువుకున్న దిగాబట్టి ఇంకాస్త ముందుకెళ్ళింది. అంతే...!

శ్రీకాంత్, హరీంద్ర తప్ప మిగతావాళ్ళు పశ్చా త్తాపంతో పునీతులయితే... శ్రీకాంత్ నేటి సాధా రణ భర్తలకు ప్రతీకగా, శాడిస్ట్‌గా మిగిలిపో యాడు. హరీంద్ర నేటి నాగరికత ముసుగేసుకొ న్న మృగమే- సందేహంలేదు. అవ్వ, సుధ, మామయ్య పాత్రలు కథకు వన్నెతెచ్చాయి. అజిత్ మాటలు వయస్సుకి మించివున్నా ము ద్దుగానే ఉన్నాయి. రచయిత్రి సీతపాత్ర ద్వారా సమాజానికి సందేశం ఇవ్వదలచుకొ న్నా... "శ్రీకాంత్- మనల్ని తెలుసుకోలేని ఊరె ళ్లిపోదాం..." అనే అజిత్ మాటలనుబట్టి, సీత శ్రీకాంత్‌కి భయపడిపారిపోయినట్లే అయింది. అయితే సీత మనోవిశ్లేషణతో పాఠకుడు ఏకీభ విస్తే ఆ తల్లీకొడుకుల నిష్క్రమణ సబబనే అనిపిస్తుంది. అయితే సీతను "అదేదో చు క్కల లోకంలో నుండి ఊడిపడ్డ మాణిక్యం"లా చిత్రించడం, నేటి సాంఘిక పరిస్థితులకు సరిపడదేమో?!

ఏది ఏమైనా రచయిత్రి రచనా వైదుష్యం, శిల్పం— పాత్రల మనో విశ్లేషణ అభినంద నీయం. —బి. రామమూర్తి., తాడ్లరాంపూర్

## 'చిరుదివ్వె'

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

"చిరుదివ్వెలు" నవలలో మొత్తంమీద ప్ర శంసించదగిన విషయం పాత్రచిత్రణ. సీత సవతి తల్లి లలితపాత్ర మొదలుకొని అవ్వపా త్ర వరకు దేనికదే సాటిగా హృద్యంగా తీర్చిది ద్దిన రచయిత్రి నేర్పు శతధా శ్లాఘనీయం.

సీత పాత్ర గురించి చెప్పవలసిన పనిలే

దు. అమోఘమైన వ్యక్తిత్వం, సమాజాన్ని ఆ సమాజంలోని చిత్రవిచిత్రమైన మనస్తత్వాల్ని అవగాహన చేసుకున్నతీరు, రాగద్వేషాలకు అతీతమైన యోగినిలా చిరునవ్వుతోనే సమస్యలనీ, కష్టాలనీ, నిందలను భరించినతీరు బాగుంది.

అయితే ముగింపు విషయంలోనే రచయిత్రి ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి రాలేకపోయారనిపిస్తుంది.

శ్రీకాంత్ తనని వదలివాయిన్నప్పుడే ఒక యోగినిలా జీవించటానికి అలవాటుపడిన సీత, పశ్చాత్తాపంతో తనని పెళ్ళిచేసుకోవటానికి వచ్చిన వినోద్‌ని, సానుభూతితో ఆదుకుంటానన్న గోపాలరావుని ఆఖరికి తన భర్తని కూడా తిరస్కరించిన సీత రౌడీలకు, ఊరివారి నిందలకు వెలివేయటానికి కూడా జంకక ఆ ఊరువదలని సీత—

కొడుకుని భర్తకు అప్పగించవల్సి వస్తుందని అర్థరాత్రిపూట రహస్యంగా ఊరొదిలిపారిపోవటం ఎంతవరకు ఔచిత్యంగా ఉంది?

తల్లిగా సీతకు అజిత్‌మీదగల మమకారాన్ని ఎవరూ కాదనలేరు. అజిత్‌కోసమే ఆమె బతికింది, వాడిని చిన్నతనంనుంచీ తను కావాలనుకున్న పద్ధతిలో పెంచింది. భర్తకు బిడ్డను ఇవ్వను అంటే ఆమెను సమర్థించి అండగా నిలబడేవారులేకపోలేదు. అవసరమైతే లాయర్ని పోలీసులను ఏర్పాటు చేస్తానని కూడా గోపాలరావు చెప్పనేచెప్పాడు.

మరి సీత పిరికిదానిలా పారిపోవటం ఏమిటి? శ్రీకాంత్ వినోద్‌కంటే, నాగరాజుకంటే పెద్దరౌడీకాడు. ఒకప్పుడు ఆ రౌడీలకు, ఊరివాళ్ళకు భయపడలేదు సీత. ఇప్పుడు కేవలం భర్తకు, అదే ఊరివాళ్ళకు భయపడటం ఏమిటి? కొడుకు మీద భర్తకుగల హక్కుకి భయపడిందా?

ఎలా చూసినా ఇది అసంతృప్తికరమైన ముగింపు.

ఏమైనా ఈమధ్యవచ్చిన 'చతుర' నవలలన్నింటిలోకి ఈ నవల ''చిరుదివ్వె'' అనకతప్పదు.

—లక్ష్మి తుర్లపాటి. విప్పలచెలక

# చతుర

సంపుటి : 12 సెప్టెంబర్ 1989 సంచిక : 8

తన అందం చూసి సమ్మోహితుడై ఏ అందాల రాకుమారుడో రెక్కల గుర్రంమీద వచ్చి చేయి అందిస్తాడనీ, తనను ఆ గుర్రంమీ దెక్కించుకొని ఏవో చుక్కల లోకాలకు తీసుకు వెళ్తాడనీ, తాను అంత అందగత్తెననీ ఆమె విశ్వాసం! నిజమే! మరి అలాంటి అపురూవ సౌందర్యవతి తప్పనిసరై ఓ గుమాస్తాని పెళ్ళిచేసుకోవాల్సివస్తే...?

"పదకొండువందల జీతమంటే తక్కువేం కాదు, ఆమాత్రం కూడా లేనివాళ్లు మనదేశంలో ఎంతోమంది ఉన్నారు. ఆశకు అంతంలేకపోతే ఎంతఉన్నా తక్కువే అనిపిస్తుంది. అందినదానికి తృప్తిపడుతూనే మరింత ఎత్తుకి ఎదగడానికి ప్రయత్నించాలి. అసంతృప్తితో నిరాశతో బాధపడితే పరిస్థితి మరింత దిగజారు తుందే తప్ప మెరుగవదు" అంటూ ఓదార్చింది ఓ స్నేహితురాలు.

"అదీ ఒక ఉద్యోగమేనా? ఆ ముష్టిజీతం సిటీలో ఇంటద్దెకే సరిపోతుంది" అంటూ ఈసడించింది మరో స్నేహితురాలు.



విభిన్న మనస్తత్వాలున్న ఆ ముగ్గురు అమ్మాయిలూ తమకు ఎదురయిన అనుభవాలకు ఎలా స్పందించారో, ఏవిధంగా తమ జీవితభాగస్వాములనూ, జీవితాలనూ మలచుకొన్నారో ఆసక్తికరంగా వర్ణించే సింహప్రసాద్ నవల "ఆమె చెక్కిన శిల్పం" ఈనెల 'చతుర' సమగ్ర నవల.

స్వప్న!

అబ్బ! ఎంత బావుంది పేరు!

పేరేకాదు ఆ పేరుగల అమ్మాయి కూడా అంత బాగానూ వుంటుంది.

పద్ధెనిమిదేళ్ళ కన్నెపిల్ల స్వప్న.

ఆ వయస్సు అమ్మాయిలకుండే అంద చందాలన్నీ ఆమెలో సహజంగా సమపాళ్ళలో అమరివున్నాయి. ఆమె సన్నగా కాస్త పొడవుగా వుంటుంది. కోలమొహం. చక్రాల్లాంటి కళ్ళు. ఆ కళ్ళల్లో సుందరస్వప్నాల తాలూకు మిలమిలలు. సన్నజాజి పువ్వులాంటి నాసిక. ఎర్రటి పెదాలు. పుష్టిగా వున్న చెక్కిళ్ళు.

ఆమెలో అందమైన ఒంపులు ఉన్నాయి. నడకలో వయ్యారాలున్నాయి. మేనిరంగులో కాంతిపుంజాలున్నాయి. కళ్ళల్లో తారల తళుకులున్నాయి. ఆమె పొడుగాటి జడలో అల్లరి పెట్టే ఆకర్షణవుంది.

చెవులకి రింగులు, మెడలో ఒంటిపేటగొలుసు. ఒంటిమీద సామాన్యమైన చీర.

అయితేనేం ఆమెలో ఓ అందం, ఓ ఆకర్షణ ఓ ప్రత్యేత, ఓ పరిపూర్ణత పోటీపడుతూంటాయ్.

ఆమెని చూసినకుర్రాళ్ళు-"ఈ అమ్మాయి తమని ప్రేమిస్తే ఎంత బావుణ్నోకదా!" అని కళ్ళు తెరచే కలలుకంటూ వుంటారు.

"ఈ అందాల భరిణెకోసం ఏ మన్మథుడు పూజలుచేస్తున్నాడో!" అనుకుంటారు నడివయస్సు దాటిన ఆడవాళ్ళు.

ఆమె కూడా అలాగే అనుకుంటుంది.

తన అందంచూసి సమ్మోహితుడై ఏ అందాల రాకుమారుడో రెక్కలగుర్రం మీద వచ్చి చేయిఅందిస్తాడనీ ఆ గుర్రంమీదెక్కించుకుని ఏవో చుక్కలలోకాలకి తీసుకువెళ్తాడనీ ఆమె విశ్వాసం. ఆమెకొచ్చే కలలు కూడా అలాటివే. ఆమె కోరుకునే స్వప్నాలూ, స్వర్గాలూ కూడా అవే!

స్వప్నం జీవితంకాదని ఆమెకెవరూ చెప్పలేదు.

అందమైన అమ్మాయిల జీవితాలు స్వప్నాల్లా తీయగా హాయిగా వుంటాయని ఆమె చదివే నవలలూ, చూసే సినిమాలూ చెప్పాయి- చెబుతున్నాయి.

ఆ అభిప్రాయాలామెలో బలంగా నాటుకుపోయాయి. వాళ్ళు పూర్తిగా మనస్పూర్తిగా యదార్థమే చెబుతున్నారని నమ్మింది. తన అదృష్టానికెంతో మురిసిపోయింది.

ఇప్పుడామె అణువణువులోనూ అవే అభిప్రాయాలు మొలకెత్తి మహావృక్షాలై ఫలపుష్పాలతో విలసిల్లుతున్నాయ్!

అంచేత పైకి సాదాసీదాగా కన్పించినా అన్పించినా ఆమె వూహాలువేరు! ఆలోచనలు వేరు! అనలామె లోకమే వేరు!

ఆ లోకానికామె మహారాజ్ఞి! నియంత!

తను కలల్లో దర్శించేవిధంగానే తన జీవితాన్ని మహోన్నతంగా తీర్చిదిద్దుకోగలనని ఆమె ప్రగాఢ విశ్వాసం.

అలాంటి స్వప్న మండల కార్యాలయంలో పనిచేస్తోన్న ఓ పెద్దగుమస్తాగారి మూడో కూతురు. ఫస్టు బియస్సీ చదువుతోంది.

★ ★ ★

"నాకీ పెళ్ళివద్దు. నేను ఛస్తే చేసుకోనీ పెళ్లి" గదిలోకెళ్తూనే మంచంమీద అడ్డంగాపడి ఏడ్చేస్తూ అంది స్వప్న.

ఆమె వెనకే వచ్చిన ఆమె అక్క బ్రాన్పడిపోయిందామాటలకి.

అవతల అమ్మాయీ కట్నమూ నచ్చగా పెళ్లివారు ముహూర్తాల గురించి ముచ్చటించుకొంటున్నారు...!

"ష్- నెమ్మది-ఎవరైనా వింటే నవ్విపోతారు" కసురుకుంది అలివేణి.

"నవ్వితే నవ్వనీ! నాకేం? నేనీపెళ్లి చేసుకోనుగాక చేసుకోను"

"పెళ్లి చూపులప్పుడు బాగానే వున్నావు. పెళ్లి ఖాయమనేఅనుకొంటోంటే ఈ గొడవేమిటే? అంతగా ఇష్టంలేకపోతే ముందే నాన్నకి చెప్పెయ్యకపోయావా"

"............"

"అసలిందులో నచ్చకపోవడానికే ముందే-అబ్బాయి నచ్చలేదా?"

"అది కాదు-వుద్యోగం......" నసిగింది.

నవ్విందామె "భలేదానివే-నాతో అంటే అన్నావుగాని ఇంకెవర్తోనూ అనకు! లక్షణంగా హైదరాబాదులో టైపిస్టు వుద్యోగం చేస్తోంటే..."

"టిక్కుటిక్కుమని నొక్కుతూ కూర్చునే మనిషా నా మొగుడు! తలచుకుంటేనే ఒళ్ళు జలదరిస్తోంది!"

"ఏమిటే నీ మిడిసిపాటూ! నీ అందంచూసి ఎడంచేత్తో ఎర్రనంతకాలు చేసే ఆఫీసరొస్తాడనుకున్నావా?"

"వూఁ- వస్తాడు చూస్తుండు"

అలివేణి ఆశ్చర్యానికవధుల్లేకపోయాయ్. ఆమెది అమాయకత్వమనుకోవాలో 'మూర్ఖత్వ మనుకోవాలో అర్థంకాలేదు.

"పిచ్చిదానా! ఈనాటి పెళ్లికొడుకులక్కావాల్సింది అందమైన అమ్మాయికాదు అందాన్ని మించిన కట్నం. పిచ్చిపిచ్చి వూహల్తో వూరేగక నేలమీద నడవటం నేర్చుకో. నాన్న పరిస్థితి అర్థంచేసుకో. ఆ మాటకొస్తే మీ బావలిద్దరికన్నా ఈ సంబంధం పెద్దదే..."

"మీకూ నాకూ పోలికేంటి!" నిరసనగా అంది తనో మహారాణి అయినట్లు ఫీలవుతూ.

"నువ్వు మా అందరికన్నా అందమైనదానివే. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఒప్పుకుంటాను. కానీ నాన్న ఇచ్చే కట్నానికొచ్చే ఆఫీసరెవరు చెప్పు?"

జవాబు తోచక మౌనం వహించేసింది స్వప్న

"అందుకే ఆడదానికి తొందరపాటు పనికిరాదన్నారు. నిలకడ మీద ఆలోచిస్తే అంతా నీకే అర్థమవుతుంది. చదువుకున్నదానివి. వూరికే వుద్రేకపడి అల్లరవ్వడం నీకూ, నాన్నకీ కూడా మంచిదికాదు" సన్నగా మందలించి వెళ్ళిపోయింది అలివేణి.

అప్సరసలు ఈర్ష్యపడేంత అందచందాలు వరంగా పొందిన తనని కట్నం లేకుండా పెళ్ళాడే గొప్పవాళ్ళు కరువయ్యారా?!

చేదునిజాల్ని జీర్ణించుకోలేక మధనపడసాగింది.

సరిగ్గా అప్పుడు ఆమె మనో ఆకాశంలో ఓ మెరుపు మెరిసింది. ఆ మెరుపు వెలుగులో ఓ చక్కని యువకుడు నవ్వుతూ కన్పించాడు.

పులక్కిపడింది.

అతడు రాజశేఖర్!

అంత చక్కని పేరుగల ఆ చిన్నవాడు స్వకులస్తుడూ, అవివాహితుడూ లెక్చరర్గా వుద్యోగం చేస్తున్నవాడూనూ - అంతేకాదు. తనంటే ఎంతో అభిమానమున్నవాడు కూడానూ.

ఓసారేమన్నాడు?

బోటనీ రికార్డు చూపించడానికెళ్ళిందప్పుడు. డిపార్ట్మెంట్లో ఒక్కడే వున్నాడు. తనని ఎంతో ఆరాధనగా అభినందనగా చూస్తూ- "మిమ్మల్ని చూసినప్పట్నుంచీ కవిత్వం రాయాలని ప్రయత్నిస్తున్నానండీ" అన్నాడు.

ఎంత పొరబాటు చేసింది!

అతడూ తన స్వప్నసుందరుడూ ఒకరేనని గుర్తించలేకపోయిందిన్నాళ్ళూ! ఇప్పుడాలోచిస్తోంటే అన్పిస్తోంది తనకి తెలీకుండానే తనతణ్ణి ప్రేమిస్తున్నట్టు!

అతడి దగ్గిర పెళ్లి విషయం ఎత్తితే...?

ఎగిరి గంతేసి ఒప్పుకోడూ?!

అమ్మానాన్నా...? లెట్ దెమ్ గో టు డాగ్స్. తనకి తన సౌఖ్యం, తన బతుకూ ముఖ్యం!

ఒక నిశ్చయానికొచ్చింది. మనస్సు తేలికపడింది. రాజశేఖర్ తన భర్త కాబోతున్నాడన్న వూహకి వుక్కిరిబిక్కిరవుతూ వూహల్లో మునిగిపోయింది.

ముహూర్తం నిశ్చయించుకుని పెళ్లివారు వెళ్ళిపోయారు. ఆ వార్త చెల్లెలి చెవిలో వేద్దామనొచ్చిన అలివేణి స్వప్నని చూసి ముసిముసిగా నవ్వుకుంది.

"పిచ్చిపిల్ల! అప్పుడే కాబోయే శ్రీవారితో డ్యూయెట్ పాడేస్తోంది! ఆడపిల్లలు గాలిమార్పుకే మారిపోతారని గేలిచేస్తూంటారిందుకే కాబోలు!"

చప్పుడు చెయ్యకుండా వెనుదిరిగిందో లేదో స్వప్న స్నేహితురాళ్ళు గలగలా కబుర్లు చెప్పుకుంటూ వస్తూండటం కంటబడింది.

ఆవాళ స్వప్నకి పెళ్లిచూపులని అందరికీ తెలుసు. విశేషాలు తెలుసుకుందామనీ పెళ్లి

నిశ్చయమయితే అభినందిద్దామనీ వచ్చారు సరాసరి కాలేజీనుంచి.

స్వప్న తడబడుతూ ఆహ్వానించింది.

ఆమె అలంకరణ చూసి- "ఇదేం వేషమే గంగిరెద్దులా. ఈ కాలంలో కూడా ఇలా ముస్తాబు చెయ్యాలా మగాళ్ళనాకర్షించడానికి? ఐ హేట్ దీజ్ ఫార్మాలిటీస్" అంది బెల్‌బాటమ్ పాంటూ, కూలింగ్ గ్లాసెస్నూ ధరించిన రాణి.

"నాగరికంగా మనం ఎంతగా ముందడుగు వేస్తున్నా పెళ్ళనేప్పటికి ఆడవాళ్ళిలా సాంప్రదాయంకంగానే వుండాలని వాంఛిస్తున్నారంతా. కొంచెం నాజూగ్గా డ్రెస్ చేసుకుంటే చాలు పేర్లుపెడుతున్నారు. కొందరైతే ఏకంగా బెదరిపోతున్నారు" అంది శోభ.

"అలా అని మనం దిగజారిపోవాలా? పెళ్లి కాకపోతే పోయిందిగాని నేనైతే ఛస్తే అందుకొప్పుకోను"

రాణి మాటలకి పార్వతి అంది- "నీది కడుపు నిండిన బేరంలే! ఇంతకీ నువ్వు వాళ్ళకి నచ్చినట్లేనా స్వప్నా?"

"నచ్చటమే కాదమ్మాయ్ పెళ్లి కుదిరింది- ముహూర్తం నిశ్చయించారు కూడా" టీ కప్పులందిస్తూ పరమానందంగా అంది శాంతమ్మ.

తల్లిమాటలకి కుంచించుకుపోయి అక్కవంక కొరకొరా చూసింది స్వప్న.

విస్తుబోవటం అలివేణి వంతయ్యింది.

"కంగ్రాట్యులేషన్స్" అభినందించారంతా.

పేలవంగా నవ్వింది స్వప్న. వాళ్ళెక్కడ అతగాడి వుద్యోగం గురించడుగుతారోనని గాభరా పడసాగింది.

"నీకాబోయే శ్రీవారెలా వుంటారే స్వప్నా? అమీర్‌ఖాన్లా వుంటాడా మిథున్‌చక్రవర్తిలా వుంటాడా?" రాణి అడిగింది.

"సినిమా నటులకి డూప్లికేటుగా వుండటం గొప్ప విషయమా?" సూటిగా అంది అరుణ.

"నిన్నేం అడగలేదు కామ్రేడ్" వ్యంగ్యంగా అంది రాణి! ప్రతిదానికీ రీజనింగ్ తీస్తూ ప్రతీదీ సామాన్యుడి దృష్టి నుంచి చూడాలంటుందని అలా కామ్రేడ్ అంటూ గేలిచేస్తూంటుంది అరుణని.

"తప్పుని తప్పు అని చెప్పడానికి బొట్టుపెట్టి అడగాల్సిన అవసరంలేదు. మేకప్‌వల్ల కెమేరా వనితనంవల్ల తెరమీద హీరోలు అందంగా కన్పించొచ్చు. అంతమాత్రాన నిజజీవితంలోనూ అలాగే వుంటారనీ, హీరోల్లానే ప్రవర్తిస్తారనీ అనుకోవడం, ఆరాధించడం ఆరోగ్యలక్షణం కాదు. ఒకరిలా వుండాలనుకోవడం ఒకర్ని అనుకరించడం అభిలషణీయం కాదు"

అరుణని తీవ్రంగా చూస్తూ రాణి ఏదో అనబోయింది- "అబ్బా! ఇక్కడా పోట్లాటే!" అని పార్వతి నుదురుపట్టుకోవడంతో ఆ సంగతి వదిలేసింది.

"వాళ్ళగొడవ ఎప్పుడూ వుండేదే-గాని అతగాడెలావుంటాడే? నీకు నచ్చాడా?"

ఉత్సాహరహితంగా తలూపింది స్వప్న.

"అయితే ఇంక అతడో మన్మథుడని చెబుతావు కాబోలు!" పార్వతి మాటలకంతా నవ్వేశారు.

"అతడికేమైనా వుద్యోగమా లేక చదువుకుంటున్నారా?"

అరుణ ప్రశ్నకి తత్తరపడింది. "వుద్యోగమే లేగాని ఇవాళేవేం క్లాసులు జరిగాయే?"

"వెధవ కాలేజీ పోనిద్దూ. మీ శ్రీవారి గురించి చెప్పవే తల్లీ మేమేం ఆయన్ని కొరుక్కుతినెయ్యంలే"

"చెప్పడానికేముందే - ఏదో కార్పొరేషన్లో వుద్యోగంట - హైదరాబాదులో" అంది స్వప్న.

"హైదరాబాదులోనా? అయితే ఇంకేం రోజూ టాంక్‌బండ్ షికార్లేనన్నమాట" అంది శోభ సంబరంగా. ఆ అమ్మాయికి హైదరాబాదంటే ఓ చిన్నసైజు స్వర్గం!

"ఏం వుద్యోగమే? జీతం ఎంతట?"

"నాకావివరాలు తెలీవే" అని స్వప్న తప్పించుకుంది.

అక్కడే వుండి ఆమెని గమనిస్తోన్న అలివేణి అంది చెల్లెల్ని ఓరగా చూస్తూ- "టైపిస్టు ఉద్యోగమండీ. నెలకి పదకొండొందలదాకా చేతికొస్తుందిట. కొంచెం ఆస్తిపాస్తులు కూడా వున్నాయిలెండి. అబ్బాయి మా స్వప్నకి ఈడూ

జోడూనూ. అంతకంటే ఏ ఆడపిల్లయినా ఏంకో రుకుంటుంది చెప్పండి?''

అన్యాపదేశంగా అక్క తననుద్దేశించే అన్న దని గ్రహించేసింది స్వప్న. మొఖం ఎర్రగా చేసుకుని మింగేసేలా చూసిందామెని.

''టైపిస్టా?! ఓ మై గుడ్నెస్!'' తలపట్టు కుంది రాణి.

''ఏం... అది పుద్యోగం కాదా?'' అరుణ అంది చురుగ్గా చూస్తూ.

''నీకు ప్యూను పుద్యోగం కూడా గొప్పగానే కన్పిస్తుందిలే తల్లీ. లేకపోతే అదీ ఓ పుద్యో గమే? ఆ జీతం సిటీలో ఇంటద్దెకే సరిపో తుంది!''

రాణి ఈసడింపుకి మరీ కృంగిపోయింది స్వప్న.

అవున్నిజమే...ఆ గొర్రె తోక జీతంతో ఏదో ఇంత ఉడకేసుకుని తిని ఏదో బతికేస్తున్నాం అనుకోడానికి తప్ప ఎందుకూ చాలదు. జీతాని కీ జీవితానికీ విడదీయని లంకెపడగా గుడుగు డుకుంచం ఆడుకోవాల్సిందే ముక్కుతూ మూ ల్గుతూ గానుగెద్దులా... ఒక సరదా, ఒక షోకు, ఒక షికారు, ఒక విందు, ఒక విలాసం, ఒక ముద్దు ఒక ముచ్చట అనేవి లేకుండా విసు క్కుంటూ తిట్టుకుంటూ చీదరించుకుంటూ ఒకర్నొకరు అసహ్యించుకుంటూ పిల్లల్ని కంటూ అనుక్షణం సమస్యల సుడిగుండాల్లో చిక్కుకుంటూ అవసరాల చుట్టూ చక్కెర్లు కొడుతూ శ్లేష్మంలో పడ్డ ఈగలా...

ఓహ్! ఘోరం!

ఆమె ఒళ్ళు జలదరించింది.

తనతణ్ణి చేసుకోవడమంటే తన బంగారు కలల్ని సమాధి చెయ్యడానికి గొయ్యితవ్వుకోవ డమే!

కన్నీళ్ళు ముంచుకొచ్చాయి స్వప్నకి. ఆమె వాటిని దాచుకోడానికెంత ప్రయత్నించినా స్నే హితురాళ్ళ దృష్టిలో పడనేపడ్డాయ్.

అనవసరంగా నొప్పించామేమోనని నొచ్చు కున్నారు అరుణా, పార్వతీ, శోభానూ. ఉన్నమా టన్నానుగాని కల్పించి చెప్పలేదుకదా అను కుంది రాణి.

''బంగారు చెంచానోట్లో పెట్టుకుని పుట్టినదా నివి. నీకా జీతం అల్పంగానే కన్పించొచ్చు. కాని ఆ మాత్రం కూడా దొరకని వాళ్ళి దేశంలో కోటానుకోట్లున్నారని మర్చిపోకు రాణి. అయినా పదకొండొందలంటే తక్కువెందుకయ్యింది? ఆ మాత్రపు జీతంతో ఎందరు హాయిగా బతక టంలేదు? ఆశకి అంతుండాలి. అది లేనప్పు డు ఎంతున్నా తక్కువే అన్పిస్తుంది. అందిన దానికి తృప్తిపడుతూనే మరిన్నిటిని అందుకో డానికి అందుబాట్లోకి తెచ్చుకోడానికి ప్రయ త్నించాలి. మరిన్ని ఎత్తులకి ఎదగడానికి కృషి చెయ్యాలి. అలాగాక అయ్యో ఇది చాలదే అని అసంతృప్తితో నిరాశతో బాధపడితే పరిస్థితి మరింత దిగజారుతుంది తప్ప మెరుగవదు'' అరుణ అంది ఆవేశంగా.

''అయ్యిందా కామ్రేడ్ నీవుపన్యాసం?'' ఉక్రో షంగా అంది రాణి.

''ఇది ఉపన్యాసం కాదు-రాణి జీవితస త్యం!''

''నీ సత్యాలకో నమస్కారంగాని మమ్మ ల్నిలా వదిలెయ్''

''నీకిది తేలిగ్గా హాస్యంగా అన్పించొచ్చుగాని నీ మాటల ప్రభావం స్వప్న మీద ఎంతుంటుందో ఆలోచించు''

''నీమాటా నామాటా గ్రుడ్డిగా నమ్మెయ్యడా నికి స్వప్నేం చదువులేని మొద్దుకాదు''

''చదువుకున్నవాళ్ళే పైపై మెరుగులు చూసి తేలిగ్గా బోల్తాపడతారు''

''ఇక సరిపెట్టండేబాబూ ఎవరైనా వింటే బావుండదు'' పార్వతి కలగజేసుకోవడంతో రాణి, అరుణా తగ్గారు.

''ఎంతో అనుభవమున్నవారిలా చాలాబాగా చెప్పేరు. ఉన్నదాంతోనే తృప్తిపడి ఉన్నదాన్నే ఉన్నతంగా తీర్చిదిద్దుకోవాలి గాని లేనిదాని కోసం వగచి ఉన్నది పాడుజేసుకోవడం ఎండ మావుల వెంట పరుగులు పెట్టడం ఎవరికీ మంచిది కాదు'' అరుణని అభినందిస్తూ అంది అలివేణి.

''చాలా బాగా చెప్పేరు-మీవారేంజేస్తుంటా రు?''

''కాలేజీలో లాబ్ అసిస్టెంట్''

"డిగ్రీ పాసయ్యాడండి మరే ఉద్యోగమూ రాకపోతేనూ..." కప్పులు తీసుకెళ్తూ అంది శాంతమ్మ.

"దానికేమండి. అందులో తప్పేం వుంది? హీనంగా చూడకు దేన్నీ అన్నారు శ్రీశ్రీ. ప్రతి వస్తువుకీ ఓ విలువా, ఓ ప్రయోజనం వుందని ఆయన భావం. అలాగే ప్రతి పనికీ విలువా ప్రత్యేకతా వున్నాయి. పెద్ద యంత్రం పని చెయ్యడానికి చిన్ననట్టు కూడా అవసరమే కదా. అంచేత డిగ్నిటీ ఆఫ్ లేబర్ అంటే మన పని మీద మనకి గౌరవం వుండాలి. అప్పుడే ఇతరులు కూడా గౌరవిస్తారు"

అరుణ మాటలకి విసుగ్గా మొఖం పెట్టి "ఈ సుత్తిదెబ్బలకి తలపోటొస్తోందిగానీ పోదాం పదండి" అంది రాణి లేస్తూ.

అరుణ కూడా వెళ్ళడాని కుద్యుక్తురాలవుతూ అంది స్వప్నతో- "అతను ప్రస్తుతం టైపిస్టే కావొచ్చు. కానీఎప్పటికి అలాగే వుండిపోరుకదా? డోంట్ ఫీల్‌షై. మీవారు నీతిగా నిజాయితీగా ఉద్యోగం చేస్తున్నంతవరకూ ఆ ఉద్యోగం గురించి చెప్పుకోవడానికీ ఆ సంపాదనని చూచి గర్వించడానికీ నువ్వు సిగ్గుపడక్కర్లేదు. అంతే కాదు నీ సహకారం, ప్రోత్సాహం వుంటే ఆయన మరిన్ని ఎత్తులకి ఎదగొచ్చు. పెద్ద ఆఫీసరు కావొచ్చు. పుడుతూనే ఎవరూ పెద్దవారుకాదు. దేనికైనా ప్రయత్నం, ఓర్పు, నేర్పు, కృషి, పట్టుదల వుండాలి. అవి వుంటే సాధ్యం కానిదంటూ వుండదీ ప్రపంచంలో"

మౌనంగా వింది స్వప్న.

స్నేహితురాళ్ళెళ్ళిపోయినా ఆమె అలాగే కూర్చుండిపోయింది. ఆమెకంతా గజిబిజిగా అయోమయంగా వుంది

"మీ స్నేహితురాలు చాలా తెలివయిందే" అలివేణి అంది.

కన్నున లేచించి స్వప్న- "ఆ వేదాంతం నేనూ చెప్పగలను. కాని టైపిస్టుని కట్టుకుని అఘోరించాల్సింది నేనుగాని అరుణకాదు. తనూ అటువంటివాణ్ని కట్టుకోమను- అప్పుడు తిక్కకుదిరి తిన్నగా మాట్లాడుతుంది"

"ష్... నెమ్మదిగా మాట్లాడవే అమ్మా నాన్న వింటారు"

"వింటేవిననీ... నాకేం భయం. నాకీ పెళ్ళి ఇష్టంలేదని మొఖంమీద చెప్పేస్తాను."

"ఏవిటే కేకలేసుకుంటున్నారూ" శాంతమ్మ అంది హాల్లోంచి.

"ఏంలేదమ్మా వూరికినే..."

విసురుగా మొఖం తిప్పేసుకుంది స్వప్న.

తన గురించి వీళ్ళేదో అనుకుంటున్నారు! రాజశేఖర్ని పెళ్లిచేసుకుని వీళ్ళకో పాఠం చెప్పకపోతే తన పేరు స్వప్నేకాదు.

* * *

'లక్ష్మీనిలయం'లో అడుగు పెడుతూనే చెప్పుల్నో పక్కకీ, పుస్తకాల్నో పక్కకీ విసిరేసి సోఫాలో కూలబడింది రాణి.

"ఇంతాలస్యం అయ్యిందేం బేబీ" ఏదో ఫైలు చూసుకుంటున్న ఆమె తండ్రి రాజారావు అడిగారు.

"నా ఫ్రెండ్ స్వప్నకి పెళ్లి చూపులైతేనూ వాళ్ళింటికెళ్ళొచ్చాం డాడీ"

"పెళ్లిచూపులెవరికే" అంటూ వచ్చింది భానుమతి.

"స్వప్నకి"

"బావుంది— పెళ్లికుదిరినట్లేనా?"

"కుదిరినట్లలే ఓ బోడి సంబంధం"

"అవేం మాటలే" భానుమతి అంది మందలింపుగా.

"ఇవాళ బేబి మూడ్ బావున్నట్టులేదు" రాజారావు నవ్వేరు.

"నా ఇంకో ఫ్రండ్ అరుణలేదూ? దానికి నేనంటే చచ్చేంత జెలసీ డాడీ- నేను ఎడ్డెం అంటే తను తెడ్డెం అంటుంది!" రిపోర్టు చేసింది తండ్రికి.

"అరుణంటే ఆ నల్లటమ్మాయా?" తల్లి అడిగింది.

"ఆతేభ్యం మొహమే. నీకింకా గుర్తురాలేదా డాడీ? నేను కామ్రేడ్ అని ఏడిపిస్తూంటానూ ఆ అమ్మాయి"

"ఓహో- ఆ అమ్మాయా. గుర్తొచ్చిందిలే. ఇంతకీ ఇవాళేమన్నదేమిటి?" పైపు వెలిగించుకుంటూ అడిగారు.

"నువ్వు కాబోయే భర్త టైపిస్టు డాడీ. ఉద్యోగం ఎక్కడ చేస్తున్నాడో? హైదరాబాదులో. జీతం వెయ్యో ఎంతోను. ఇంత బ్రతుకూ బ్రతికి ఇంతేసినాల వచ్చేనట్టు టైపిస్టుని కట్టుకోవాల్సిన కర్మేమిటే అన్నాను- ఆ జీతం ఇంటద్దెకే చాలదన్నాను- తప్పా డాడీ!"

"నువ్వన్నది పాయింటే మరి"

"మీ వత్తాసు బాగుంది. వాళ్ళనాన్న అంతకంటే పెద్ద ఉద్యోగస్థుణ్ని తేలేనప్పుడు తెచ్చిన వాణ్ని కట్టుకోక తప్పుతుందా ఆడపిల్లకి?" భానుమతి అంది.

"నీవన్నీ అమ్మమ్మ కబుర్లు మమ్మీ. పెళ్లికాక పోతేపోయిందిగాని ఓ గుమస్తాని కట్టుకుని ఏడ్వాల్సిన కర్మేమిటంటున్నాను. దాని అందాన్ని చూసిన ఏ మగాడైనా ఇట్టే ఎగరేసుకుపోతాడు— కదూ డాడీ?"

"అమ్మాయిని మీ అన్నయ్యకిచ్చి చేద్దామా?" నవ్వుతూ అడిగింది భానుమతి.

తండ్రి కూడా చిరునవ్వుతో చూశారు.

"అవేం మాటలు మమ్మీ. వాళ్ళెంతస్తు ఎక్కడ మనెంతస్తు ఎక్కడ? వాళ్ళు తలెత్తి చూసినా కనిపించనంత ఎత్తులో ఉన్నాం మనం. వాళ్ళకీ మనకీ వియ్యమా? నాన్సెన్స్"

"అందుకే వాళ్ళ అంతస్థుకి తగ్గ సంబంధం వాళ్లు చూసుకున్నారు. మధ్యలో నీబాధా, సానుభూతీ ఎందుకు?"

"మరీ దారుణంగా మాట్లాడుతున్నావు మమ్మీ. నీకన్నా అరుణే నయం" మొహం కందగడ్డ చేసుకుంది రాణి

"ఏమన్నదేమిటి?"

"చాలా తెలివిగా మాట్లాడింది డాడీ. టైపిస్టు టైపిస్టుగానే ఉండిపోడట. అమాంతం పెద్ద ఆఫీసరైపోవచ్చుంట. ఒకవేళలా అవ్వకపోతే ఆడవాళ్ళు మేజిక్‌తో అతణ్ని గొప్పవాడిగా చేసిపారెయ్యొచ్చుంట. పెద్ద లెక్చరిచ్చింది ఫూల్‌ఫెలో! ఒక్కరూ చప్పట్లు కొట్టలేదు మరి!"

"మాడు బేబీ ఆ అమ్మాయి చెప్పిందాంట్లో నిజం లేకపోలేదు. ఎవరూ పుడుతూనే గొప్పవారుగా పుట్టరు. అందుకు ఎన్నైనా ఉదాహరణలు చెప్పొచ్చు. మాజీ ముఖ్యమంత్రి అంజయ్య ఒకప్పుడు ఆరణాల కూలీ. ఒకనాటి కాంగ్రెస్ అధ్యక్షుడు కామరాజ్ కొబ్బరికాయల కొట్లో గుమస్తాగా చేశాడు. కాంగ్రెస్ నాయకుడు కమలాపతిత్రిపాఠీ ఒకప్పుడు ప్రూఫ్‌రీడర్‌గా పనిచేశాడు. అమెరికా మాజీ అధ్యక్షుడు రీగన్ నటుడు కాకపూర్వం హెటల్లో క్లీనర్‌గా పనిచేశాట్ట. బల్గేరియా మాజీ ప్రధాని డిమిట్రావ్ ప్రెస్సులో కంపోజిటర్‌గా జీవితం ప్రారంభించాడు. మన ముఖ్యమంత్రి ఎన్టీఆర్ ఒకప్పుడు సబ్‌రిజిస్ట్రార్. వీళ్ళ జీవితాలు చెప్పేదేమిటంటే కృషీ పట్టుదలావుంటే పరిస్థితులు అనుకూలిస్తే సామాన్యుడే మాన్యుడై అందరి మన్ననలూ అందుకుంటాడు. బైదిబై- శ్రీరామ్ లెటర్రాశాడు— వెళ్ళి చదువుకో" ఒకవరందిస్తూ అన్నారు రాజారావు.

అమృతపు సోనల్లా విన్పించాయా మాటలు రాణికి.

గబుక్కున కవరందుకుని మేడమీది తన గదిలోకి పరుగుతీసింది. మంచంమీద బోర్లా పడుకుని కాళ్ళూవూపుతూ ఉత్తరం చదవడంలో నిమగ్నమైపోయింది.

శ్రీరామ్ రాణికి కాబోయే భర్త. దూరపు బంధువైన అతడ్ని మెడిసిన్లో ఉన్నత విద్య కోసం అమెరికా పంపించారు రాజారావు. అతడి చదువు పూర్తికాగానే వాళ్ళిద్దరికీ పెళ్లి చెయ్యాలని పెద్దల సంకల్పం. పిల్లల ఆకాంక్ష.

శ్రీరామ్‌కి రాణి అంటే అమితమైన ప్రేమ. ఆరాధన. ఆమె అతడి దృష్టిలో ఆకాశంలో మెరిసే తార— స్వప్నాల సితార.

వారానికొక్క ఉత్తరమైనా రాయకపోతే అతడికి పిచ్చెత్తినట్టుగా అన్పిస్తుంది. అందుకే సమాధానం వచ్చినా రాకపోయినా సీరియల్లా రాసేస్తూంటాడు.

ఆమెకతడి దగ్గర్నుంచి ప్రేమలేఖలందుకోవటం ఇష్టం. తిరిగి అలా రాయటం అంతగా నచ్చదు. ఒకరకమైన సుపీరియారిటీ కాంప్లెక్స్ ఆమె ప్రతి అడుగునీ పర్యవేక్షిస్తూంటుంది మరి!

'నా హృదయరాణీ కలలవెన్నెలీ' అన్న సంబోధనతో ప్రారంభమైన ఆ ఉత్తరంలో ప్రతి వస్తువులోనూ ఆమె రూపం ఎలా కన్పిస్తున్నదీ, కలల్లో కన్పించి ఎలా కవ్విస్తున్నదీ ఆమె


మల్లెల జల్లు అందుకోండి
అంటున్నారు ''రామాయణం'' దీపిక
MCA/MJS/59 Tel
ఇటలీ ఖండ పరిజ్ఞానముతో, భారతదేశపు అత్యంతాధునిక కర్మాగారములో తయారు చేయబడిన పరిమళ భరితమైన సబ్బు మల్లెలనగరము నుండి వెలువడినది. ఈ సంస్థ ఈ శతాబ్దము మొదలు నుండి వెలువడుచున్న నాణ్యత కల సబ్బులను తయారు చేయవడిగా ఉత్కృష్టమైన చరిత్ర కలది.
మల్లెల జల్లు అందుకోండి,
మైసూరు జాస్మిన్ తో
MYSORE
JASMINE
SOAP
PINK
JASMINE
FROM THE HOUSE OF MYSORE SOAP
MAX. PRICE:
Rs. 3.87
LT. EXTRA
Net Weight 100 gms

కౌగిలిలో కరగాలని తనెంతగా ఆరాటపడుతు న్నదీ ఆమెని తనెంత గాఢంగా ప్రేమిస్తున్నదీ వివరించి వర్ణించి 'సదా నీ ప్రేమ భిక్షనర్థించే నీ శ్రీరామ్' అని ముగించాడు.

చదవటం పూర్తిచేసి ఉత్తరాన్ని ముద్దుపె ట్టుకుంది.

"మైడియర్ స్వీట్ బోయ్! స్వప్నపెళ్లి అయి పోతోంది. మనం కూడా త్వరగా పెళ్లి చేసేను కుని ఏ కాశ్మీరో హనీమూన్ వెళ్ళిపోతే బావు ణ్ణోయ్- మరి నువ్వెప్పుడు తిరిగొస్తావ్? నీ చదువెప్పుడు పూర్తవుతుంది? నేనీ విరహం భరించలేను రామ్- ప్లీజ్ కమ్ బాక్... కమ్క్వి క్లీ..."

అని అతడి ఫొటోతో చెప్పి దాన్ని గుండెలకి హత్తుకుంది.

ఫొటోలోని రామ్ కొంటెగా నవ్వుతూ గుండెలో గిలిగింతలుపెడుతూ వీణతీగల్ని శృతి చేస్తు న్నట్లు అనుభూతి చెందుతూ పరవశించిపో యింది రాణి.

★ ★ ★

రాధమ్మ మిషనుమీద బట్టలు కుడు తోంటే— "వదినగారూ" అంటూ వచ్చిందో నడివయసావిడ.

"మీరా రండి— జాకెట్టు కుట్టేశాను. అరుణ రాగానే కాజాలూ, బొత్తాములూ కుట్టించి పంపిస్తాను"

"అరుణింకా కాలేజీనుండి రాలేదా? చీకటి పడింది కూడానూ" బుగ్గలునొక్కుకుంది జగ దాంబ.

"ఎవరో స్నేహితురాలింటికెళ్ళొస్తానంది..."

"ఏమోనమ్మా. నీరుపల్లమెరుగు నిజందేవు డెరుగు అన్నారు..."

ఆమె చురుగ్గా చూసేసరికి కంగారుప డిందావిడ.

"మా ఆయనెప్పుడూ మిమ్మల్నే పొగుడు తుంటారు వదినగారూ. 'మగదిక్కులేకపో యినా మిషనుకుట్టీ, బొమ్మలుచేసీ సంసారాన్ని గుట్టుగా నడుపుతూనే అమ్మాయిని కాలేజీలో చదివిస్తున్నారామె' అంటారు"

"దాని అదృష్టం బాగుండి స్కాలర్షిప్ రాబట్టిగాని ఆ చదువులు, మారెక్కలకి మించి నవి కావు"

"కాదుమరీ— అమ్మాయికేదైనా సంబంధా లు చూస్తున్నారా వదినగారూ"

"ఒంటరి ఆడాదాన్ని. మీకు తెలీందేవుంది జగదాంబగారూ"

ఆ మాటలంటోంటే ఆమె కంఠం వణి కింది. కళ్ళల్లో నన్నని కన్నీటిపొర కదిలింది.

"మేమంతాలేమూ- అవునుగాని వదినగా రూ కట్నం ఏ మాత్రం ఇస్తారూ?"

"పొట్టగడవటమే గగనంగావుంది. ఇంకా కట్నాలెక్కడ పొయ్యగలను? మరా భగవంతు డేం చెయ్యనున్నాడో ఏమో!"

"హుఁ... డబ్బులేనోళ్ళు డుబ్బుకి కొరగారు. కట్నంలేకపోతే ముష్టివెధవ కూడా మూడుము ళ్ళు వేయడు. అయినా ఒకళ్ళ గొడవనాకెందు కులేమ్మా- అరుణ రాగానే జాకెట్టు పంపించు" అంటూ వెళ్ళిపోయిందావిడ.

రాధమ్మ దృష్టి గోడమీద వేలాడుతున్న ఆమె భర్త ఫొటోమీదపడింది.

కన్నీళ్ళు చిప్పిల్లాయ్.

మిషన్ చక్రం ఆగింది.

ఆయనే వుంటే తనీరోజునిలా రెక్కలుము క్కలు చేసుకోవాల్సివచ్చేదా? అరుణ పెళ్ళి ఓ సమస్యఅయ్యేదా?

ఊహు-

కాని.. ఆయనలేరు! తనే మూర్ఖత్వంతో లేకుండాచేసింది!

ఆయన తననెంత ప్రేమగాచూసేవారు. ఉన్నంతలో తనని సుఖపెట్టాలనే ప్రయ త్నించారు పాపం. తనాయన మంచితనం అర్థంచేసుకోలేకపోయింది. ప్రతిదానికీ పుట్టింటివారితో పోల్చి గేలిచేసేది. హీనంగా చూసేది. అయినదానికీ కానిదానికీ దెప్పిపొడి చేది.

అయినా ఆయన దేవుడు లాంటివాడు గనుక అన్నీ సహించారు. ఆ సహనం తనని మూర్ఖురాలిగా మార్చింది. అయనమెతకతనం తననోటిని పెద్దదిచేసింది!

ఆయన్ని కుక్కినపేనులాచూసింది. ఎప్పు

డూ ఏదోటిలేదని పాటగాపాడేది. అంతాగ య్యాళి అంటున్నారని అందరిమీదా విరుచు కువడేది.

ఇల్లు నరక సదృశమైనా ఓర్పుతో సహిస్తూ వచ్చారాయన.

అరుణ పుట్టినప్పుడు బంగారునగ చే యించలేదని పెద్దరాద్ధాంతం చేసింది. పెళ్ళ యినప్పట్నుంచీ తనకేమేంపెట్టలేదో పెద్దలి స్టు చదివింది. దెప్పింది. ఎందుకూ పనికిరాని చచ్చుదద్దమ్మని తిట్టి అందరిముందూ అవ మానించింది.

ఆయన సహనం నశించి సంసారమంటే విరక్తికలిగి తననీ బిడ్డనీ నట్టేట్లోవదిలేసి వెళ్ళి పోయారు. ఇన్నాళ్ళు పీక్కుతిన్నందుకు మీక ర్మమీరనుభవించండని చెప్పకచెబుతూ వెళ్ళి పోయారు.

సన్యాసుల్లో కలిసివుంటారన్నారు కొందరు. కాశీలో చూశామన్నారు కొందరు. అదేంకాదు ఆత్మహత్య చేసుకుంటారన్నారింకొందరు.

ఏమైతేనేం ఆయనింతవరకూ తిరిగిరాలే దు. ఆయన వునికి గురించి ఒక్కముక్కా తెలియరాలేదు.

కిందవడినడుం విరగొట్టుకున్నాక తెలి సింది తను కూర్చున్న కొమ్మనే నరుక్కున్నట్టు.

అయిన వాళ్ళు ఆదరించకపోతే పొట్టచేత బట్టుకుని వూరూరుతిరిగింది. అష్టకష్టాలువ డింది. ఓ సేవాశ్రయంలో మిషన్‌కుట్టడం నేర్చుకుంది. అదే ఇప్పుడు జీవనాధారమ య్యింది.

కన్నీళ్ళు ధారలుగా కారసాగాయి ఆమె కళ్ళనుంచి.

అప్పుడే వచ్చిన అరుణ "ఇదేమిటమ్మా చీకట్లో కూర్చున్నావ్?" అంటూ లైటువేసింది.

"దీవంఉండగా ఇల్లు చక్కబెట్టుకోలేకపో యినదాన్నికదా!" గబగబా కన్నీళ్ళు తుడిచే సుకుంటూ అంది.

"మాటిమాటికీ గతాన్నెందుకు గుర్తుచేసు కుంటావమ్మా?" బాధగా అడిగింది.

"నేను గుర్తుచేసుకోవడంలేదు. అదే నా వెంటపడుతోంది. దానినీడ నీభవిష్యత్తుమీద పడబోతోందే అని నాబాధ. ఈ గొడవకేంగాని కాంతం పిన్నిగారి బట్టలిచ్చేసిరా... కాజాలవీ కుట్టాలి..."

"అన్నీ కుడతానుగాని నువ్వింక మిషను మీంచిలే" అంటూ లేపేసింది తల్లిని.

"మాతల్లే! నేనంటే ఎంతఇదే! ఆ మూడు ముళ్ళూ కూడా పడితే...." గొణుక్కుంది.

"దానిగురించి ఎక్కువగా ఆలోచించి మన స్సు పాడుజేసుకోకు. నేను ఇప్పుడే వచ్చేస్తాను"

కుట్టిన బట్టలు తీసుకొని బయటికినడి చింది అరుణ.

అప్పటికే చీకటిపడి అరగంట అవు తోందేమో అన్ని ఇళ్ళల్లోనూ వెలుగుచిందులే స్తోంది. కాని ఆ రోడ్డు మాత్రం చీకటి కౌగిల్లో చిక్కుకొనుంది. మున్సిపాలిటీవారి వీధిదీపాలు నిద్రపోతున్నాయి మరి.

సెంటర్లో ఉన్న కిళ్ళీబడ్డీని సమీపించేసరికి ఆమె నడక పెళ్ళినడకగామారిపోయింది. అలవాటుప్రకారం బడ్డీముందున్న బెంచీవైపు చూసింది.

యథాప్రకారం ఓ యువకుడు దానిమీద కూర్చునున్నాడు. ఇంగ్లీషు పత్రికలోని టార్జాన్ బొమ్మల్నీ ఏదో చార్ట్‌నీ భూతద్దంతో దీక్షగా పరిశీలిస్తున్నాడు. ఇద్దరు రిక్షాలవాళ్ళుకూడా వచ్చి చేరారు. అంతా ఏ యుద్ధానికో, వ్యూహర చనలో నిమగ్నులైనట్టుగా ఉన్నారు.

వాళ్లవంక జాలిగా చూసింది అరుణ.

సాలెగూడులో చిక్కుకున్న పురుగులూ, శ్లే ష్మంలోపడ్డ ఈగలూ, బెల్లంపాకంలోకి జారిపడ్డ ఈగలూ గుర్చొచ్చాయి.

వాళ్ళంతా దీవం చుట్టూ పరిభ్రమించే శలభాల్లా బ్రాకెట్టు చుట్టూ తిరిగే పిచ్చివాళ్ళు.

రూపాయికి ఎనభైరూపాయలొస్తాయని దాంతో తమ కష్టాలూ, కన్నీళ్ళూ ఆరాటాలూ, పోరాటాలూ అన్నీ మంత్రం వేసినట్లు మాయ మైపోతాయనీ,తమ ఆశలూ, కోర్కెలూ నెరవేర తాయనీ కళ్ళు మిరుమిట్లుగొల్పేరంగురంగుల జీవితం తమకి స్వాగతం చెబుతుందని వారి కల! ఆశ! ఆకాంక్ష! ఆరాటం!!

అందుకోసం కడుపు మాడ్చుకొని తమ పై నల కష్టాన్ని బ్రాకెట్లో కాస్తున్నారు. కళ్ళుకాయ

లుకాచేలా అదృష్టదేవత మందహాసంకోసం ఎదురుచూస్తున్నారు.

బొమ్మల్లో అదృష్టపు అంకెల్ని వెదుక్కొంటో న్న ఆ యువకుడు ఎవరో పిలిచినట్టన్పించి తలెత్తాడు.

కళ్ళెదుట కరుణించే దేవతలా అరుణ.

తత్తరపడి తలదించేసుకున్నాడు. ఏదో తప్పుచేస్తున్నట్టు ఫీలవుతూ.

అంతవరకూ ఆ చూపు కోసమే అక్కడ తచ్చాడుతున్న అరుణ చిన్నగా నిట్టూర్చింది. చురుకైన ఓ యువకుడు ముళ్ళపొదల్లో మాణి క్యాలు వెదుకుతున్నాడే అని బాధపడుతూ భారంగా కదిలింది.

★ ★ ★

పాలనురగలాంటి చీర- జాకెట్టు. తెల్లని స్లిప్పర్స్. తెల్లని హేండ్‌బేగ్. మెడలో ముత్యాల దండ. తలలో మల్లెల దండ-

ప్రియ భక్తుడి అభీష్టాన్ని నెరవేర్చడానిగ్గా ను దివినుండి భువికి దిగివచ్చిన అప్సరాంగ నలా ఉన్న స్వప్నని చూసి చుట్టుపక్కలివాళ్ళు మూర్ఛపోయారు.

వాళ్ళ చూపులు గమనించి కంగారుప డింది స్వప్న. వేళకానివేళ ఒంటరిగా ఓ బ్రహ్మ చారి ఇంటికొచ్చి తప్పుచేశానా అని మధనప డుతూనే గేటు తీసుకొని రాజశేఖర్ ఇంట్లోకి నడిచింది.

ముచ్చటగా ఉన్న పూలతోటనిచూసి మురి సిపోతూ ఇంకొద్దిరోజుల్లో ఈ ఇంటికి పెళ్లికూతు ర్ని కాబోతున్నానోయ్ అని మూగగా చెప్పింది.

"వాట్ఎ సర్‌ప్రైజ్ రియల్లీ! నాకళ్ళని నమ్మ లేకపోతున్నాను. నీ అంతట నువ్వు నా ఇంటికి నడచిరావటం... ఓహ్ అయామ్ రియల్లీ లక్కీ..."

ఆమెని చూసి పరమానందపడిపోయాడు రాజశేఖర్.

సిగ్గుతో వంకర్లు తిరిగిపోతూ కూర్చుని డ్రా యింగ్ రూమ్‌నీ అందులోని ఫర్నీచర్నీ గది లోంచి కన్పిస్తోన్న డబుల్‌బెడ్‌నీ చూసి తను కలలుకన్నది పూదోటలాంటి ఇలాంటి ఇంటి కోసమే అనుకుంది.

"ఒక దేవత ఇలా వచ్చి నా గుండె తలుపు తట్టి నాలోని చైతన్యానికి ప్రాణం పోస్తుందని కలలో కూడా ఊహించలేదు"

కృష్ణుని మురళీగానానికి పరవశించే రాధ అయిపోయింది స్వప్న.

"నిన్ను చూసినప్పుడల్లా నీతో మాట్లాడాలని మనస్సు ఉవ్విళ్ళూరేది. కాని స్టూడెంట్సేం అనుకుంటారోనని మనస్సుని అదిమిపట్టి డై రీలో నీగురించి కవితలు రాసేవాణ్ని...."

సిగ్గుతో బుగ్గలు కెంపులవుతోంటే అంది- "మీతో ఓ ముఖ్య విషయం మాట్లాడదా మనీ..."

"ఓకే... ఏమిటో చెప్పెయ్. ఇక్కడ మన మాటలెవరికీ విన్పించవ్ మనచేష్టలెవరికీ కన్పించవ్- గోహెడ్" నవ్వేడు.

"నాకు పెళ్లి కుదిరింది...

"మైగాడ్! ఎప్పుడు?"

"నిన్న. అది నాకిష్టంలేదు. మీరు... పె ళ్ళి..."

అతడాశ్చర్యపడలేదు. "ఆర్యూ లవింగ్‌మీ? నన్ను ప్రేమిస్తున్నావా?"

మరో ఆలోచన లేకుండా తలూపేసింది.

అతడి ముఖంలో వెలుగు గుప్పుమంది. "థాంక్యూ...నేను ప్రేమిస్తున్న యువతి నన్ను ప్రేమించడం- ఫెంటాస్టిక్- గొప్ప అనుభవం! దెన్...."

"మీరు పెళ్ళిచేసుకుంటారని...."

వగలబడి నవ్వేడు రాజశేఖర్.

ఆమె మొఖం రక్తహీనమయింది.

"చూడు స్వప్నా. కాలంతోబాటే మనమూ ముందుకెళ్ళాలి తప్ప వెనక్కి నడవకూడదు. ఈరోజుల్లో కూడా ప్రేమించిన వాళ్ళంతా పెళ్ళి చేసుకోవాలనీ అసలు ప్రేమించడం పెళ్ళిచే సుకోవడం కోసమేనని అనుకోవడం దారుణం. ఘోరం. మనం ఎందర్నో ప్రేమిస్తుంటాం. వాళ్ళందర్నీ పెళ్ళిచేసుకోవాలనడం అన్యా యంకాదూ? పైగా పెళ్ళిచేసుకుంటే ప్రేమ నశిస్తుందన్నారు అనుభవజ్ఞులు. నిజానికి ప్రే మనేది మొక్కనున్న పువ్వులాంటిది. దాన్ని తెంపి పెళ్లి అనే తలలో ముడిస్తే దాని బతుకు గంటల్లోనే సమాప్తమవుతుంది మైడియర్ గాళ్" బోటనీ లెక్చరర్ రాజశేఖర్ వివరించా

డు.

ఆమె తలకి నేలకి కృంగిపోయింది.

"అరె- అంత ఇదైపోవద్దు. నిన్ను పెళ్లిచేసుకోవడానికి నాకేం అభ్యంతరం లేదు. కాని..."

మరేవిటన్నట్లు చూసింది.

"నాకు పెళ్ళికుదిరిపోయింది ఈవారంలోనే. ఈ సభ్యసమాజంలో నాకోరేటుంది. డాక్టర్ల ఇంజనీర్ల రేటుకన్నా తక్కువేలే. రెండు లకారాలు. అంతే- అది వాళ్లిస్తున్నారు. మీనాన్న ఆరేటు ఇవ్వగలిగితే కుదిరిన సంబంధం వదిలేయటానికి నాకూ, మావాళ్ళకీ ఎలాంటి అభ్యంతరమూలేదు. విలువైన వస్తువుని తగిన విలువిచ్చి కొనుక్కున్నప్పుడే దానికీ కొన్నవారికీ కూడా విలువ. అంతే తప్ప ఊరికే తీసేసుకుంటే విలువేముంటుంది చెప్పు?"

నిరసనగా, అసహ్యంగా చూసి వెళ్ళడానికి ద్యుక్తురాలయ్యింది.

"వెళ్ళిపోతున్నావా? నీఇష్టం మరి. పెళ్లిగాకపోయినా మనమధ్య ప్రేమబంధం ఉంటుంది. ఎప్పుడు కావాలంటే అప్పుడు మనం కలుసుకోవచ్చు. అమర సుఖాలు జుర్రుకోవచ్చు. నీలాంటి అమ్మాయిలు మనస్సుపుట్టినప్పుడే స్వర్గానికొచ్చిపోతూంటార్లే...."

"స్కౌండ్రల్...." అతణ్నో పురుగులా చూసి బయటికి నడిచింది.

"భయపడక్కర్లేదు- నేను సినిమా విలన్ని కాదు" నవ్వుతూ అన్నాడు.

చెళ్ళున కొరడాతో కొట్టినట్లన్పించింది. సృష్టిలోని అసహ్యాన్నంతా ముద్దచేసి అతడి మీదికి విసిరేసి వచ్చేసింది!

ఎంతటి దుర్మార్గుడు! అతడా తన కలల సుందరుడు? కాదుకాదు!

అందంచందం, హోదా గౌరవం కారూ మేడా- వీటన్నిటితోబాటు గుండెనిండా తననే నిలుపుకొని ఆరాధించే అపురూప పురుషుడి గురించి తను కలలుకంటోందిగాని పయోముఖవిషకుంభంలాంటి రాజశేఖర్ గురించి కానేకాదు!

నిట్టూర్చింది స్వప్న.

కింకర్తవ్యం?

రాజశేఖర్ని ప్రేమించానంది గనుక నలుగురికీ గొప్పగా చెబుతాడుకాబోలు! తనని అభాసుపాల్జేస్తానని బెదిరించి లొంగదీసుకో చూస్తాడు కాబోలు! అప్పటికీ తను లొంగకపోతే గోడల మీద పేర్లు రాయించీ ఆకాశరామన్న ఉత్తరాలు రాసీ పెళ్లి చెడగొట్టి అవమానాలపాలు చేస్తాడు కాబోలు.

పోనీ అతడు కాగితం పులి అనుకుంటే....

తను ఆఫ్టాల్ ఓ టైపిస్టుని పెళ్లిచేసుకోక తప్పదు.

అతన్ని చేసుకోవడమంటే చవకరకం చీరలు కట్టుకుని, పిల్ల ముక్కులూ, మూతులూ కడుగుతూ పట్టు సడలిన శరీరంతో ధుమధుమలాడే ముఖంతో జడవేసుకునే ఓపిక కూడా లేక పాతికేళ్ళకే అప్పలమ్మలా తయారవ్వడానికి సిద్ధమవడమన్నమాట.

ఎటుచూసినా అగాధాలే. భవిష్యత్తంతా అంధకారబంధురమే. ఏరకంగా చూసినా తన కలలు తీరే మార్గం కనుచూపుమేరలో కన్పించటంలేదు.

ముందూ వెనకా ఇరువక్కలా గోతులే.

ఎటు వెళ్ళటం?

పెరట్లోని నుయ్యి గుర్తొచ్చింది.



ఉలిక్కిపడిలేచింది స్వప్న.

బట్టలన్నీ ముచ్చెమటల్తో తడిసి ముద్దయ్యాయి. గబుక్కున అద్దం దగ్గరికెళ్ళి ముఖం చెంపలూ తడుముకుని చూసుకుని తృప్తిగా నిట్టూర్చింది.

బాపురే! ఎంతదారుణమైన కల!

పెళ్లయిన నాలుగేళ్ళకే తను చీకేసిన

మామిడిటెంకలా అయిపోయింది. ఇరవైమూ డేళ్ళకే నలభై నాలుగేళ్ళదాన్లా మారిపోయింది.

నెరిసిన జుట్టు, గుంటకళ్ళు, డోక్కుపోయిన మొఖం, జారితోళ్ళలా వేలాడుతున్న ఒంటిబి గువులు, ఒంటిమీద మాసిన నేతచీర, మెళ్ళో పుస్తెలతాడు, చంకలో పాలకోసం ఏడ్చేపిల్లా డు...

ఆ రూపం గుర్తుతెచ్చుకునేసరికామె ఒళ్ళు జలదరించింది.

అది వూహకాదు నిజమే.

టైపిస్టు ప్రభాకర్‌ని పెళ్ళిచేసుకుంటే అది పూర్తిగా నిజమైతీరుతుంది.

అంతేకాదు-

తనకి దగ్గో జ్వరమో గుండెనీరసమో ఏదో కటి ఎప్పుడూ పట్టుకు వేలాడుతుంది. ఆయన ప్రతిదానికీ సాధిస్తూ అది అమర్చలేదు, ఇది సర్దలేదంటూ చిందులు తొక్కుతారు. పిల్లలు ప్రాణాలు తోడేస్తూ ఆరున్నొక్కరాగం అందు కుంటూంటారు. ఇంట్లో దారిద్ర్యం నగ్ననృత్యం చేస్తూంటుంది. ఎక్కడ బడితే అక్కడ బట్టలు. శుచీశుభ్రతలేని వాతావరణం. సొట్టలువడ్డ పాత్రలు. విరిగిన అద్దం. బూజుపట్టిన కప్పు. వినుక్కోడానిక్కూడా తీరికలేనంత పని...

మైగాడ్!

తను రోజుకి ఇరవై గంటలు చొప్పున పనిచే సే యంత్రం, వంటమనిషి, పనిమనిషి, చాకలి, ఆయా,నర్సు, మగాడికి శరీరాన్నప్ప గించే మాంసంముద్ద. పిల్లలకి రక్తదానం చే స్తూపోయే తల్లి. సుఖం సరదాఅంటే అర్థంతె లీని ప్రాణి. కుక్కలా నక్కలా సందులోని పందిలా...

వద్దొద్దు... అలాటి బతుకు కలలో కూడా వద్దు. ఇలలో ముందే వద్దు.

తను బతికుంటే ప్రభాకర్ని పెళ్ళిచేసుకో వడం తప్ప మరో గత్యంతరంలేదు. తను అరిచిగీపెట్టినా ఆ సంబంధం వదులుకోడానికి ఒప్పుకోరు ఇంట్లో తన అందం ఏ రాకుమారు డినీ తీసుకురాలేదని తేలిపోయింది.

అన్నిటికీ రాజీపడిపోతూ ఏదోలా బతికేస్తు న్నామంటూ బతికే బతుకు తనకక్కర్లేదు.

ఎవరు గుర్తించినా గుర్తించకపోయినా తనో యువరాణి. అప్సరాంగన.

తను బతికినా చనిపోయినా గొప్పగా గౌర వంగా ఓహో అనేలానే ప్రవర్తిస్తుంది. తను నగటు మధ్యతరగతి మహిళకాదు. ప్రతిదాన్తో నూ రాజీపడటానికి.

రాజులేని తనకి రాజీ ఏల?

మరేమీ ఆలోచించకుండా లేచింది స్వప్న. చప్పుడు చేయకుండా తలుపుతీసుకుని పెర ట్లోని నూతిదగ్గరికెళ్ళింది.

లోపలికి చూసింది.

వెన్నెలపడి మెరుస్తున్న నీళ్ళు వెండిలో కంలా అన్పించింది. తనని రారమ్మంటూ ఆహ్వానిస్తున్నట్టు అనుభూతి చెందింది.

దేవుడా! వచ్చే జన్మలో నన్ను రాకుమారిగా పుట్టించు. ఓ రాజకుమారుడితో పాణిగ్రహణం జరిగేట్లు దీవించు. మనస్సులోనే ప్రార్థించు కుని అడుగుముందుకేయబోయి ఆగింది.

తనెలాగూ చనిపోతుంది. పోయాక రాజశే ఖర్ తన గురించెన్నో కథలు చెప్పొచ్చు కూడా.

ఆ అవకాశం అతడికివ్వకూడదు. నిన్ను ప్రేమిస్తాను, అనుభవిస్తానుగాని పెళ్ళి చేసుకో నన్న అతణ్ని అలా వదలకూడదు.

అతడివల్ల మోసబోయాననీ పెళ్ళికి నిరాక రించినందున ఆత్మహత్య చేసుకుంటున్నానని ఒక ఉత్తరం రాసి పెడితే?

రాజశేఖర్ని పోలీసులు అరెస్టు చేస్తారు. ఉద్యోగం పోతుంది. పరువుపోతుంది. లక్షల కట్నం పోతుంది. హీరోఫోజు పోతుంది. దెబ్బకి బికారయి నలుగుర్లో తలెత్తుకోలేక ఆత్మహత్య చేసుకుంటాడు.

అతడికలాంటి శాస్తి జరిగినప్పుడే తనకి శాంతి.

గబగబా లోపలికెళ్ళి ఒక కాగితంమీద నాలుగుముక్కలు రాసి సంతకం చేసింది. అందరికీ తేలిగ్గా కనబడేలా ఉంచి వచ్చే సింది.

ఆనందపు తేరుమీద ఆనందలోకాల కెళు తున్నంత సంబరంగా నుయ్యి దగ్గరికెళ్ళి నూ తిగట్టెక్కింది స్వప్న.

ఇంతలో రెండుచేతులామె నడుం పట్టు

కుని వెనక్కిలాగేశాయి. డభీమని వెల్లికిలాపడ్డా రిద్దరూ.

"ఇదేంపనే? ఆత్మహత్య చేసుకోడానికి సిగ్గె య్యడంలేదూ? నువ్వింత పిరికిదానివనుకోలే దు. నేను రావటం ఓ క్షణం ఆలస్యమయ్యుంటే ఏమయ్యేదానివి?" అలివేణి కోప్పడింది.

"చచ్చి సుఖపడేదాన్ని"

"చావులో సుఖాన్ని వెదుక్కునేంత మూర్ఖు రాలివనుకోలేదు వెర్రిమొర్రి వేషాలెయ్యక ఇంట్లోకిపద"

"నేన్రాను నాకు బతకాలని లేదు..."

"బతుకుమీద విరక్తికికాదు అనురక్తిని పెంచుకో. బతుకుతీపి అంటే ఏమిటో తెలు స్తుంది. ఆ తర్వాత చావంటే ఆమడదూరం పరుగెడతావు"

బతుకు విషతుల్యమని తేలిపోయాక ఏ ఆశతో బతకనక్కా?"

"ఏమీ అవ్వందే ఏదేదో పోయిందని నిరాశ పడతావెందుకే?"

"ఇంకేం కావాలి కలలన్నీ కాలిపోయాక, ఊహలరెక్కలన్నీ విరిగిపోయాక!" సర్వం కో ల్పోయిందాన్లా అంది స్వప్న.

"పిచ్చిదానా! కథల్లోనూ, సినిమాల్లోనూ ఇట్టే ప్రేమించేసుకుంటారు. అడ్డంకుల్ని ఎది రించేసి పెళ్లిచేసుకుంటారు. ఆదర్శాలు వల్లించి ప్రేక్షకుల అభినందలందుకుంటారు. వాటిని కథలుగానే చూసినంతకాలం ఫరవాలే దు. అవే జీవితాలనుకుంటే జీవితాల్లోనూ అలాగే జరగాలనుకుంటేనే వస్తుంది చిక్కు.

సినిమాల్లో హీరోహీరోయిన్లు పట్టించుకోనివి నిజజీవితంలో మనం పట్టించుకోవాలి. ఇక్కడ బతకడానికి డబ్బూ దస్కం కావాలి. పరువూ మర్యాదా మంచీ చెడూ వెనకాముందూ చూసు కోవాలి. మంచం ఉన్నంత వరకే కాళ్ళుజాపుకో వాలి. కోర్కెలకీ ఆశలకీ కళ్ళెం వేసుకోవాలి.

అదేమీ గమనించకుండా వయసులో ఆవే శంలో ప్రేమించుకుంటారు. ప్రేమ ఓ ఫాషన్గా ఓ సరదాగా అనిపించి ప్రేమించుకుంటారు. తీరా పెళ్లిఘట్టం వచ్చేసరికి అమ్మా నాన్నలూ, అన్నలూ అంతన్నలూ గుర్తొచ్చి అసలు రంగు బయటపెట్టేస్తారు. పలాయనం చిత్తగించేస్తా రు. నీలాంటి యువతులు డిప్రెషన్కిలోనై ఆత్మహత్యలకి తలపడతారు"

అలివేణి ఆగింది.

స్వప్న ఆలోచనలో పడింది.

తను ప్రేమలో విఫలమై ఈ పనికి పూను కుందనుకొంటోందా?

తనెవర్నైనా మనస్ఫూర్తిగా ప్రేమించిందా? లేదు. రాజశేఖర్ని ఇష్టపడటానికి కారణం తన కలలు నిజమవుతాయనే. అతడు నిరుపేద అయితే తనతడివంక కన్నెత్తి చూసేదేకాదు. నిజం చెప్పాలంటే తను కలల్ని ప్రే మించింది!

"నేల విడిచి సాముచేస్తే ఇలాటి ఆశాభంగా లు తప్పవు. ఊహల్లో ఊరేగటంమాని వాస్తవా న్ని పరిశీలించటం అవసరం. ముఖ్యంగా నీలాటి కన్నెపిల్లలు ఈ సంగతి గుర్తించటం వారి భవిష్యత్తు దృష్ట్యామంచిది"

"నువ్వు చెప్పేదేమిటి? తలక్రిందులుగా తపస్సు చేసినా లైపిస్టు మొగుడు దొరకడ నేగా? మీలాగా కళ్ళు మూసుకుని పెళ్లిచేసుకో మనేగా? అందర్లానే వినాయకుడి బొడ్డులో వేలుపెట్టు- తేలు కుడితే మాలానే పైకి నవ్వు తూ లోపల ఏడ్వమనేగా?" రోషంగా అంది.

జాలిగా చూసింది చెల్లెల్ని.

"నాన్నకి అంతకంటే మంచిసంబంధం తేగల తాహతుందంటావా? మనమిచ్చే కట్నా నికి ఇంతమంచి సంబంధం రావడమే ఓ గొప్పఅని అమ్మానాన్నా మురిసిపోవటం గమ నించలేదా నువ్వు!"

ఆమె సూటిగా అడిగేసరికి తలదించేసు కుంది. కళ్ళెదుట ప్రత్యక్ష సమాధానంగా రాజశే ఖర్ నిలబడితే నోరెలా విప్పగలదు?

"నువ్వు కోరికల గుర్రం ఎక్కి ఆకాశంలో విహరిస్తున్నందున లైపిస్టు ఉద్యోగం నల్లపూ సగా కన్పించొచ్చు. కాని అలాటి ఉద్యోగంకోసం అలాటి ఉద్యోగస్తుడికోసం ఎందరెంత ఆరాట పడుతున్నారో నీకేం తెలుసు? అయినా పడిన గోడలు పడినట్టే ఉండిపోవు. మళ్ళీ కొత్త గోడలు లేస్తాయి. అంతెందుకూ మీ బావని న్నటి వరకూ లాబ్ అసిస్టెంటు ఇవాళ బ్యాంకులో ఉద్యోగం వచ్చింది..."

"నిజమా అక్కా బావగారికి..."

"అవును... పడుకునేముందు టెలిగ్రాం వచ్చింది రాజమండ్రిలో పోష్టింగిచ్చార్ట- నీకు చెబుదామనొస్తే నిద్రపోతున్నావు..."

స్వప్న మనస్సు చేదుగా అయిపోయింది. బావగారు బ్యాంకు ఉద్యోగి తనకాబోయే భర్త టైపిస్టు! జీతాల్లో కూడా పెద్దతేడా ఉండితీరుతుంది!

గబగబా పోల్చుకుని హీనంగా ఫీలయ్యింది.

"ఇవాళాయన అకస్మాత్తుగా బ్యాంకు క్లర్క్ అయిపోలేదు. దాని వెనకెంతో కృషీ పట్టుదలా ఉన్నాయి. డిగ్రీ చదివాను అటెండరు ఉద్యోగమా అనుకోకుండా లేబ్ అసిస్టెంటుగా జేరారు. పోటీ పరీక్షలు రాసిరాసి ఒకగమ్యం చేరుకున్నారు. అలాగే మరిదిగారు ఇవాళ టైపిస్టే కావొచ్చు. అవకాశాల్ని సద్వినియోగం చేసుకుని రేపు ఆఫీసరవ్వొచ్చు. అందుకాయన కృషి చెయ్యాలి. నువ్వు సహకరించాలి అంతే. ఫలితం వెదుక్కుంటూ వస్తుంది"

స్వప్న కళ్ళుమెరిశాయి.

"అట్టడుగు స్థాయినుంచి నిచ్చెనెక్కి శిఖరాగ్రం చేరుకున్న వాళ్ళెంతోమంది ఉన్నారు. చాలామంది చీకటిని తిడుతూ కూర్చుంటారు తప్ప చీకటి పోవడానికి చిరుదీపం వెలిగించే ప్రయత్నం చెయ్యరు. తమ అసహాయతకీ బలహీనతకీ రోదిస్తారు తప్ప వాటినే అవకాశాలుగా అనుకూలంగా మరల్చుకోవాలని చూడరు. కొందరింకో అడుగుముందుకేసి అసంతృప్తితో అశాంతితో అలమటిస్తూ తమవారి బతుకుల్ని కూడా నరకం చేసేస్తారు.

ఎవరైనాసరే... ఉన్నదాంతో తృప్తిపడుతూనే లేనిదానికోసం మరింత ఉన్నత స్థితికోసం కృషిచెయ్యాలి. సాధించాలి. కృషి ఉంటే మనిషి ఋషి అవుతాడన్నారు. ఆ కృషికి నీలాంటి తెలివైన అర్ధాంగి ప్రోత్సాహసహకారాలుంటే ఎలాటి విజయాలైనా తేలిగ్గా సాధించొచ్చు"

స్వప్నముఖం కాంతివంతమయ్యింది. మనస్సులోని బాధ పటాపంచలయ్యింది.

పెళ్ళిచూపుల్నాడు అరుణ చెప్పిన మాటలు కూడా గుర్తొచ్చాయి.

అవున్నిజమే... తనాకోణం నుంచి ఆలోచించనేలేదు. ప్రభాకర్ వుద్యోగం సంపాదనా తక్కువని మధనపడిపోతోంది తప్ప అతనెప్పుడూ టైపిస్టుగానే ఎందుకుంటాడని ఆలోచించలేకపోయింది. తను అడుగుపెట్టిన వేళావిశేషం వల్ల ఆఫీసర్‌గా ప్రమోషన్ రావచ్చు. లేదా పరీక్షలకి కట్టించి ప్రమోషన్ వచ్చేట్లు తను చెయ్యొచ్చు. ఆడది తలచుకోవాలేగాని ఏమైనా చెయ్యగలదు. భర్తని బిడ్డల్నీ ఎంత గొప్పగానైనా తీర్చిదిద్దగలదు!

చిన్నప్పుడు తను చదివిన కథలే అందుకు నిదర్శనం!

శివాజీ గొప్పవాడవడం వెనుక అతడి తల్లి వుంది. గాంధీ మహాత్ముడవడంలో కస్తూర్బా చేదోడువుంది. మార్క్సుమహనీయుని వెనుక జెన్నీవుంది. ఇలాంటి యధార్థాలెన్నైనా వుదహరించవచ్చు.

తను వాళ్ళకెందులోను తీసిపోదు. పైగా ఈ పుణ్యభూమిమీద జన్మించిన పడతి తను! పవిత్రతా, పట్టుదలా, లక్ష్యసాధనా తన రక్తంలోనూ వుంది!

ప్రభాకర్నొ గొప్పవ్యక్తిగా పెద్దహోదా అధికారంగలవాడిగా సంపన్నుడిగా తన కలలపురుషుడిగా తీర్చిదిద్దుతుంది! అంతవరకూ తను విశ్రమించదు. ఇదిసత్యం! ఇదేప్రతిజ్ఞ!

తన సమస్యలూ, బాధలూ నిరాశలూ, హీనభావాలూ అన్నీ మంత్రించినట్టు మాయమయ్యాయి.

తన మార్గం ఏమిటో తెలిసినట్టు తనజీవిత లక్ష్యమేమిటో రూఢి అయినట్టు సత్యసాక్షాత్కారమైనట్టు జ్ఞానోదయమైనట్టుగా వుందామెకి!

లేచి ఏమిజరగనట్టే ఇంట్లోకెళ్ళిపోయింది స్వప్న.

నిట్టూర్చింది అలివేణి.

★ ★ ★

"ఏమండీ"

"ఎవరూ" అంటూ లోపల్నుంచొచ్చింది అరుణ.

గుమ్మంలో బ్రాకెట్టు యువకుడు. అంకెల్లో అదృష్టాన్ని వెదుక్కునే అభాగ్యుడు. తనని

చూచి తప్పుచేస్తున్నట్టు ఫీలయ్యే చిన్నవాడు.

"మీ అమ్మగారు లేరాండీ...."తడబడ్డాడు.

"పనిమీద వెళ్ళింది ఏమైనా పనుందా?"

"ఏంలేదనుకోండి. కొంచెం కుట్టిపెడతారనీ...." కాగితం చుట్టలోంచి చొక్కాతీసిచ్చాడు.

చొక్కా అందుకుని చూసింది. చాలా చిరుగులూ కుట్లూ వున్నాయి. ఆయిల్ మరకలు కూడా ఎక్కువేవున్నాయి.

అతడి పరిస్థితి అర్థంకాక అతడిమీద మరింత సానుభూతి పెరిగిందామెకి.

"నేను కుడతాన్లెండి- కూర్చోండి" స్టూలు వేసి తను మిషన్ ముందు కూర్చుంది.

"ఆయిల్ మరకలెక్కడ అంటించుకున్నారు?"

"ప్రెస్సులోనండి. నేను ప్రెస్సులో కంపోజింగూ, అప్పుడప్పుడూ ప్రూఫ్‌రీడింగూ చేస్తుంటాను"

"అలాగా- జీతం ఎంతిస్తారేమిటి?"

"నాలుగొందలు"

"చాలాదారుణమేనే. రాత్రీపగలూ కూడా పని చేయించుకుంటారు కాబోలు..."

"సీజన్లో అంతేనండి"

"మీ ఇంట్లో ఎవ్వరూ కన్పించరేం? ఒక్కరే వుంటున్నారా?"

ఆమె ప్రశ్నకతడి కళ్ళు చెమ్మగిల్లాయ్. "నాకెవ్వర్లేరండి. పెంచి పెద్దచేసిన మేనమామ రెక్కలురాగానే వదిలేశాడండి"

"అయ్యో... అలాగా పాపం...."

ఇద్దరూ ఒకేబోటులో ప్రయాణిస్తున్నట్టన్పించిందొక్క క్షణం ఆమెకి!

"మీరెక్కువగా కిళ్ళీబడ్డీదగ్గర కూర్చుంటారెందుకూ?" ఏమీ ఎరగనట్టు అడిగింది కుట్టిన చొక్కా తిరగిస్తూ.

"మీలాంటివారు తెలుసుకోదగ్గది కాదులెండి"

"అంటే? కాస్త వివరంగా చెప్పండి స్వామీ"

"నాపేరు మీకెలా తెలుసు?"

"మీపేరా?!"

"నాపేరు స్వామినాథం. అంతా స్వామి అంటారు"

"ఓసారీ- ఏదో యధాలాపంగా అనేశానంతే. నిజంగా మీపేరు నాకు తెలీదు"

"పేరు తెలుసుకోవల్సినంత గొప్పవాణ్ని కాదులెండి. కాని మీపేరు నాకు తెలుసండి" అనేసి నాలిక్కరుచుకున్నాడు.

అరుణ బుగ్గలు అరుణిమనీ సిగ్గునీ దిద్దుకున్నాయి.

"భలేవారే... ఎవరి ప్రత్యేకతవారిది. ఎవరిగొప్పవారిది. ఆ విషయాల్లో ఒకరితో పోల్చుకోవడం అనవసరం. ఎంచేతంటే అవన్నీ పెరిగిన పరిస్థితులమీద చుట్టూవున్న వాతావరణం మీదా ఆర్థిక స్థితిగతుల మీదా ఎక్కువగా ఆధారపడివుంటాయి గనుక"

"మీరు చాలా తియ్యగా మాట్లాడతారండీ" కించిత్తు సిగ్గుగా అమాయకంగా అన్నాడు.

నవ్వింది. "మీరన్నీ చెబుతున్నారు కానీ నేనడిగింది చెప్పటంలేదు"

"అదాండీ... అది....బ్రాకెట్టు....!"

తలొంచుకుని గబగబా వెళ్ళిపోయాడు స్వామి.

విస్మయంగా అన్పించినా అంతకుమించి ఆనందం కలిగింది అరుణకి.

అతడికి తనుచేస్తున్నపని మంచిది కాదన్న స్పృహ వుందని తెలీడమే దానిక్కారణం!

ఏదోపనిమీద అటుగా వచ్చిన జగదాంబ వెళ్తోన్నస్వామినీ అతణ్నేచూస్తూ గుమ్మంలో నిలబడిన అరుణనీ మార్చి మార్చి చూసింది. బుగ్గలు నొక్కుకుంది. ఆపైన తలాడించింది. ఏదో అర్థమైనట్లు.

★ ★ ★

రాణి తల్లి భానుమతికి హార్ట్‌ఎటాక్ వచ్చింది.

మిన్నూమన్నూ ఏకమవుతున్నంత హడావిడి చేసేసింది. నమయానికి రాణీ రాజారావు కూడా ఇంట్లో వుండటంతో క్షణాల్లో డాక్టర్లనీ, నర్సుల్నీ పిలిపించేశారు.

ఆవిడ గదినే ఆసుపత్రిగా మార్చేసి ట్రీట్‌మెంట్ చేశారు.

నొప్పి నద్దుమణిగేనరికి అంతాహాయిగా వూపిరి పీల్చుకున్నారు.

పూర్తి విశ్రాంతి తీసుకోవాలన్చెప్పి నహాయానికో నర్సుని వుంచివెళ్ళిపోయారు డాక్టర్లు.

"ఏదో కొంచెం గుండెనొప్పి వస్తే ఇంత మందిని పిలవాలా? డబ్బునిలా మంచినీళ్లలా ఖర్చు పెట్టేస్తే పిల్లలకింక మట్టీమశానం మిగుల్తుంది!" తను చేసిన హడావుడి మర్చిపోయి భర్తని తప్పుపట్టింది భానుమతి.

తండ్రీ కూతుళ్ళిద్దరూ ముక్కుమీదవేలుంచుకున్నారామె మాటలకి.

డబ్బుకీ ఆవిడ ప్రాణానికీ లంకె అని అందరికీ తెలుసు. కాని తన ప్రాణాల మీదికొచ్చినప్పుడు కూడా డబ్బు కోసం కలవరిస్తుందన్నది వారి వూహకందని సంగతి!

"నీకన్నా డబ్బెక్కువకాదు. మనకీ ఖర్చు ఓ లెక్కలోనిదికాదు. నువ్వేలాంటాలోచనలు పెట్టుకోక పూర్తిగా రెస్ట్ తీసుకో" రాజారావు అన్నారు.

"అలా చెప్పే ఇంతదాకా తెచ్చేరు. మా నాన్న ఇచ్చిన నిక్షేపంలాంటి పాతికెకరాల మాగాణీనిఅమ్మేసి ఫ్యాక్టరీలో షేర్లూ, కాంట్రాక్టులూ అన్నారు. ఏమొస్తున్నాయి లాభాలు? పది లక్షలు పెట్టి ఈ మేడకట్టేరేమో అంతేగా!" ఆమె కళ్ళు నీళ్ళతో నిండాయ్.

"నీకు మీ నాన్న ఇచ్చిన ఆస్తే తప్ప నా ఆస్తి, నా సంపాదనా కన్పించదు. సరేలే- నీ ఆరోగ్యం బాగోనప్పుడే అవన్నీ తర్కించుకోవాలా? భానూ - అనవసరమైన వాటి గురించి అధికంగా ఆలోచించొద్దు".

"నాకు అనవసరమా? అంటే ఏవిటి మీ వుద్దేశ్యం? మీరెలా చేసినా ఎందర్తో తిరిగినా నోర్మూసుకొని పడుండాలన్నమాట. వ్యాపారాలంటూ వూళ్లు తిరుగుతూ ఎవరెవర్తెతో తిరిగినా కుక్కిన పేనులా పడుండాలన్నమాట"

"భానూ! ఇంక నరిపెట్టు" నహనం నశించి విసుక్కున్నారు.

"నేనంటేనే మీకు వినుగు విరక్తీ అని తెలుసులెండి. అసలు మీరు ఇంట్లో వాళ్లని ప్రేమించిందెప్పుడూ!"

"షటప్, ఏమిటా అర్థంలేని వాగుడు?"

"అనండనండి... నా ఆస్తినంతా కరిగించి మీ చేతులలోపోశాను కదూ షటప్పూ అంటారు గెటవుట్టూ అంటారు" ఏడ్చేసిందావిడ.

నుదురుపట్టుకున్నారు రాజారావు.

ఇంక శ్రోతలా వుండలేకపోయింది రాణి.

"వూరుకోమమ్మీ, నీ హెల్త్ బాగోనప్పుడు వూరికే పోట్లాడతావెందుకు. నీకు కొన్ని గంటల క్రితం హార్ట్‌ఎటాక్ వచ్చిందని మర్చిపోతే ఎలా?"

"నువ్వూ నన్నే అంటున్నావా బేబీ, అవున్లే... మీరంతా ఒకటేకదూ. నేనే పరాయిదాన్ని!"

"నీకివాళేమయ్యిందే"

"నాకేదో అయిందిగాని ముందబ్బాయికీ అమ్మాయికీ పెళ్ళిళ్ళు చేసి ఆస్తి వారిపేర్న రాసేయ్యండి. ఇంక కాంట్రాక్టలూ వద్దు వ్యాపారాలూ వద్దుగాని నిశ్చింతగా ఇంటిపట్టున వుండండి చాలు".

"అలాగేలే - ముందు నీ ఆరోగ్యం కుదుటపడనీ"

"మీరలా అంటూనే వాయిదావేస్తారని నాకు తెలుసులెండి. మీరు నేను చెప్పినట్లు చేస్తేనే నా ఆరోగ్యం బాగవుతుంది. ఒక్క రెండు నెలల్లో వాళ్ల పెళ్ళిళ్ళైపోవాలి. ఎంచేస్తారో ఎలా చేస్తారో మీ ఇష్టం"

"మరీ అంత మొండితనం పనికిరాదు భానూ. అబ్బాయి యమ్.బి.ఏ పూర్తి చెయ్యడానికింకా ఏడాది పడుతుంది. అల్లుడికోర్సు పూర్తై మనదేశం తిరిగి రావడానికి నాలుగు నెలలాగాలి. అల్లుడు రాగానే ముందమ్మాయి పెళ్ళి చేసేస్తాను- సరేనా?"

చేతిలో చెయ్యివేసేవరకూ వూరుకోలేదావిడ. తర్వాత నిశ్చింతగా పడుకుంది.

రాజారావూ, వారమ్మాయీ హాల్లోకొచ్చి కూర్చొని టీ తెమ్మని నౌకర్తో చెప్పారు.

ఆయన పైపు వెలిగించారు మౌనంగా. ఆయన ముఖంలోని గంభీరత వెనుకనున్న బాధనీ, విచారాన్నీ స్పష్టంగా చదవగలిగింది రాణి.

ఆయన గురించామెకు బాగా తెలుసు. ఆయన డ్రింక్ చేస్తారు. కాని పరాయి స్త్రీలతో

సంబంధంలేదు. వ్యాపారరీత్యా తరచూ పార్టీలు ఇస్తారు, బహుమతులు పంపుతారు. కాని డబ్బు దుర్వినియోగం చెయ్యరు. తండ్రీ మావగార్లద్వారా సంక్రమించిన ఆస్తిపాస్తుల్ని ఆయన మూడింతలు చేశారన్నది అందరికీ తెలిసిందే. ఆ విషయం తల్లికి ఎందుకు అర్థంకాదో?

"మమ్మీమాటల్నేం పట్టించుకోకుడాడీ- ఆమెదంతా అదో పద్ధతి"

ఆయన మాట్లాడలేదు. కళ్లజోడు తీసి కళ్ళు తుడుచుకుని మళ్ళీ పెట్టేసుకున్నారు.

"అన్నీతెలిసిన మీరు మమ్మీ మాటలకు ఇదవ్వడం బాగాలేదు డాడీ!"

"అబ్బే- ఇదవ్వటంలేదమ్మా. పాతికేళ్ళుగా ఇదంతా అలవాటైపోయింది"

ఆయన గొంతుగాద్గదికమయ్యింది. బాధగా చూస్తుండిపోయింది రాణి.

టీ తాగుతూ అన్నారు- "లీవిట్ రాణి, బైదిబై- శ్రీరామ్ రాగానే మీ పెళ్ళి జరిపించేస్తాను. ఈలోగా నర్సింగ్‌హోమ్ కట్టించి అన్ని ఏర్పాట్లూ చేయిద్దామనుంది. అతడురాగానే ఓపెన్ చేసెయ్యొచ్చు"

"థాంక్యూ డాడీ, ఆనువత్రి హైద్రాబాద్‌లో కట్టించుడాడీ. ఐలైక్ దట్ సిటీ, పైగా ఫారెన్ రిటర్న్డ్‌కి తగ్గ పేరూ ప్రాక్టీసూ విలువా ఆదాయం వుంటాయి"

"నిజమేకాని మనూళ్ళో అయితే మా కళ్ళ ముందుంటారు- పైగా మీ మమ్మీ..."

"సిల్లీసెంటిమెంట్సొద్దు డాడీ... మమ్మీని ఒప్పించే పూచీనాది"

"మీ మమ్మీనంత తేలిగ్గా అంచనావెయ్యకు. ఆఖరినిమిషంలో అందరిముందూ రాద్ధాంతం చెయ్యడానికి వెనుదియ్యదు. నిన్ను తనకి దూరంచెయ్యడానికే సిటీలో కట్టించానని నన్నంటుంది మధ్యన"

"డోంట్‌బాదర్ అబౌట్ మమ్మీ. టైమెంతోలేదు. త్వరగా కన్‌స్ట్రక్షన్ చెయ్యాలి. బావకేంతెలీనివ్వకు డాడీ- సర్‌ప్రైజ్ చేద్దాం"

"శ్రీరామ్ ఏమంటాడో..."

"నా మాటకాదనడు..."

"దెన్ ఒకే. ప్లాన్స్ తయారుచెయ్యమంటాను. నీకు నచ్చింది సెలక్ట్ చేద్దువుగాని. ఈలోగా స్థలం విషయం సెటిల్‌చేసేస్తాను"

"థాంక్యూడాడ్" తండ్రి నుదుటిమీద ముద్దుపెట్టేసుకుని మేడమీదికి పరుగెత్తింది శ్రీరామ్‌కి ఉత్తరం రాయడానికి.

★ ★ ★

స్వప్నకి పెళ్ళవడం, హైద్రాబాద్ కాపురానికి వెళ్లడం అంతా కలలోలా జరిగిపోయాయి.

వాళ్ళు చిన్నడాబాని అద్దెకు తీసుకున్నారు. చుట్టూ ప్రహరిగోడ, మధ్యలో బుల్లిపూలతోట. ఇంటినిండా చక్కగా సర్దిన ఫర్నిచర్. చూడముచ్చటగా ప్రశాంతంగా వున్న ఇంటిని చూసి ప్రభాకర్ మురిసిపోయాడు.

"పర్ణశాలలో లభించని ప్రశాంతత ఇక్కడ లభిస్తోంది. అందుకే దీనిపేరిహః స్వప్నశాల" అన్నాడామెని కౌగిలిలో తీసుకుంటూ ప్రభాకర్.

స్వప్నకి సిటీ కొత్త గనుక వారంరోజులు శలవుపెట్టి అన్నీ చూపించాడు ప్రభాకర్.

జూ చూస్తూ చిన్నపిల్లలా గెంతింది. మ్యూజియంచూసి కళ్లల్లో మెరుపులు కురిపించింది. ఇందిరా పార్కులో 'ప్రేమయాత్రలకు బృందావనమూ కొడైకెనాలు ఏలనో' అంటూ పాడింది. చార్మినార్ మీంచి నగర శోభ తిలకించి మురిసిపోయింది. హుస్సేన్‌సాగర్ ఒడ్డున కూర్చుని మనసున మల్లెలమాలలూగాయంది. కామత్‌లో భోంచేస్తూ నలభీములీ హొటళ్ళో వంటవాళ్లని వాదించింది. అబిడ్స్‌లో షాపింగ్ చేస్తూ పర్సు ఖాళీ అవడం గమనించనేలేదు.

శలవులు హనీమూన్ ట్రిప్‌లా గడిచిపోయాయి.

"ప్రభూ! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడాలి" అంది స్వప్న.

"యస్ మేడమ్" చేతులు కట్టుకున్నాడు.

"ఆఫీసయ్యాక మీరేంచేస్తారు- ఐ మీన్ ఖాళీ సమయాల్లో"

"స్వాతంత్ర్యం నా జన్మహక్కు అంటూ బలాదూరు తిరగటమే. సినిమాలూ షికార్లూ అప్పుడప్పుడూ ఫ్రండ్స్ బలవంతంమీద పేకాటానూ. ఇప్పుడిహ శ్రీమతిగారొచ్చారు గనుక స్వప్నగార్తో కబుర్లు, షికార్లూ ఆ లిస్టుకి కలపాలి"

"ఇకనుంచవన్నీ బంద్"

"ఆజ్ఞ"

"నిజంగానే ప్రభూ, మీరీ గొర్రెతోక ఉద్యోగంచేస్తూ గుర్తింపు గౌరవంలేకుండా ఏదోలా బతికేస్తున్నామనుకుంటూ బతకటం నాకిష్టంలేదు. మనం కొన్ని లక్ష్యాల్ని సాధించాల్సి వుంది. అప్పుడే మన జీవితాల్లో థ్రిల్, సుఖం, సంతోషం అన్నీ వుంటాయ్- మన కలలు నిజమవుతాయ్"

"నాకేం అర్థంకావట్లేదు స్వప్నా. ఇంతవరకూ జీవితానికో లక్ష్యంముండాలని కూడా తోచలేదు. నీమీదా నీ తెలివితేటలు మీదా నాకు నమ్మకముంది. నువ్వెలా 'చేద్దామంటే అలాగే చెయ్యడానికి నేను సిద్ధం"

"నీమనసూ, నీ ప్రతిభా నాకు తెలుసు ప్రభూ, నువ్వో ఐఎఎస్ ఆఫీసరవ్వాలని నాకోరిక- కల- లక్ష్యం కూడా. ఐఎఎస్సా అని అధైర్యపడొద్దు. నీ శక్తి నాకు తెలుసు. నీ ప్రతిభ టైప్ మిషన్లో నలిగిపోకూడదు. ఇకనుంచి నువ్వు ఖాళీ సమయాన్ని పుస్తకపఠనంమీద కేంద్రీకరించాలి. నీ వెనుక నేనుంటాను తోడుగా, నీడగా"

"ఒకేస్వప్నా నీనమ్మకాన్నెందుక్కాదనాలి. నువ్వీఇంటపాదంమోపిన వేళావిశేషం వల్ల నీకోరిక నిజమవుతుందేమో చూద్దాం"

"థ్యాంకూ ప్రభు థ్యాంకూ" అపరిమితానందంతో వాటేసుకుంది.

ఆవాల్టి నుంచే ప్రభాకర్ ఐ.ఎ.ఎస్‌కి కావాల్సిన పుస్తకాలు కొని చదవడంలో మునిగిపోయాడు. అతడి చదువుకెలాంటి అవరోధమూ కలక్కుండా అన్ని అమరుస్తోంది స్వప్న. లైబ్రరీకెళ్ళి అతడిక్కావల్సిన పుస్తకాలు తెస్తోంది. నోట్సు ప్రిపేరు చేస్తోంది. కాంపిటీషన్ బుక్స్ కొంటోంది.

ఒక్క మాటలో చెప్పాలంటే వారికా పరీక్ష తప్పమరేధ్యాసాలేదు.

"ఐ.ఎ.ఎస్ వెళ్తున్నావుట కదా- గుడ్" అని వంకరగా నవ్వేరు కొందరు ఆఫీసులో.

"ఇంకెన్నాళ్ళులేవోయ్ ఈ టైపు మిషను టకటకలు. రేపోమాపో కలెక్టరై మాలాటి వాళ్ళని హడలెత్తించవూ" అన్నారు ఇంకొందరు. "మా ఫ్రెండొకడు సైనిక్ స్కూల్లో చదివాడు. గోల్డ్ మెడలిస్ట్. ఢిల్లీలో కోచింగు తీసుకున్నాడు కూడా. ప్చ్- పాసవ్వలేకపోయాడనుకో" అన్నారు ఒకరు.

"డైరెక్టుగా అయ్యేయస్‌కెందుకోయ్ గ్రూప్ ఒన్‌కీ టూకీ ట్రైచెయ్యకపోయావా" అన్నారు కొందరు.

"తెలుగువాళ్ళని అయ్యేయస్ ఎగ్జామ్‌లో పాస్ చెయ్యరోయ్" అని వ్యాఖ్యానించారు కొందరు.

ఎవరేమన్నా నవ్వేసి వూరుకుని తమ దృష్టిని తమ టార్గెట్ మీద కేంద్రీకరించారిద్దరూ.

పరీక్షలయ్యాయి. సంతృప్తిగా రాశానన్నాడు ప్రభాకర్.

ఓ రోజున స్వీట్‌పాకెట్‌తో పరుగునొచ్చాడు ఇంటికి.

"స్వప్నా... స్వీటెస్ట్ న్యూస్. అయ్యేయస్ పాసయ్యాను. ట్రైనింగుకి రమ్మంటూ ఆర్డర్స్ వచ్చాయి" ఆమె నెత్తి గిరగిరా త్రిప్పేశాడు సంతోషం పట్టలేక.

మహదానందంతో మరో స్వీట్‌ని అతడి నోట్లో కుక్కి అతడిపై ముద్దులవర్షం కురిపించింది.

"ఇన్నాళ్ళకి నా స్వప్నాలు ఫలించే రోజొచ్చింది. అయామ్ రియల్లీ ప్రౌడాఫ్ యూ డియర్ ప్రభూ" గాఢంగా కౌగలించుకుంది.

"ఈ విజయం నీదే స్వప్నా నీ సంకల్పం సహాయం లేకపోతే నేనింకా టైపిస్టుగానే కుదించుకుపోయేవాణ్ణి"

"అదేంకాదు... పుట్టబోయే మన బాబుదీ అదృష్టమంతా" అనేసి మొహాన్ని చేతుల్తో కప్పేసుకుంది.

ఆమె చుబుకానెత్తి ఆమె కళ్ళని చుంబించాడు. అనంతరం లతల్లా అల్లుకుపోయారిద్దరూ.

ట్రైనింగ్ పూర్తవడంతోనే ప్రభాకర్ని సబ్‌కలెక్టర్‌గా పోస్ట్‌చేశారు.

ఫర్నిష్డ్, బంగళా, కారూ, నౌకర్లూ - ఓహ్ అచ్చం స్వప్న కలలు కన్నట్టుగానే వుంది.

ఇప్పుడు స్వప్న సంతోషానికి ఏకైక ప్రతినిధి.

చక్కని తీయని సంసారం. ముద్దులొలికే

సంతానం. మనస్సునర్థంచేసుకొన్న భర్త. అనుభవించడానిక్కావల్సినంత సంపద. ఇంటాబయటా అడుగులకు మడుగులొత్తే జనం. అడపాదడపా ప్రారంభోత్సవాలు, బహుమతి ప్రదానాలూనూ!

ఇంతకంటే ఏంకావాలి మరి?

ఒకసారి కార్లో వెళ్తుండగా స్వప్నకి రాణి కన్పించింది. ఇంటికి తీసుకొచ్చి మర్యాద చేసింది. శ్రీరామ్ అమెరికాలో ఎవర్నో పెళ్ళాడి అక్కడే స్థిరపడిపోయాడనీ, వ్యాపారంలో నష్టంరాగా తండ్రి ఆస్తిని అప్పులవాళ్ళు కబళించెయ్యడానికి కాచుక్కూర్చున్నారనీ చెప్పి ఏడ్చేసింది రాణి.

ప్రభుతో చెప్పి వారి సమస్యల్ని పరిష్కరిస్తానని హామీ ఇచ్చింది. అంతేకాదు. హామీని నిలబెట్టుకుంది కూడా.

మరోసారి అరుణ స్వప్నని వెదుక్కొంటూ వచ్చింది. తన భర్త నిరుద్యోగి అనీ, పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుందనీ తెలిసి, వెంటనే ప్రభుతో చెప్పి ఒక ఆఫీసులో రికార్డ్ అసిస్టెంట్ వుద్యోగం వేయించింది.

స్వప్నా ప్రభాకర్ కూడా ఎంతో నీతిగా నిజాయితీగా వున్నా అప్పుడప్పుడూ స్నేహితులకో, బంధువులకో అలాంటి పనులు చెయ్యక తప్పటంలేదు. అందులో స్వార్థం లేదుగనుక తప్పు లేదని తృప్తిపడుతున్నారు.

ఒక ఆదివారం సముద్రపుటొడ్డుకి పిక్నిక్ వెళ్ళారు.

"మీరీ ప్రాంతంలో సబ్‌కలెక్టర్‌గా చేసినదానికి గుర్తుగా కొన్ని శాశ్వతంగా నిలిచేపనులు చెయ్యాలి ప్రభూ"

"యస్ మేడమ్... ఆ చక్కని ఐడియా ఏదో నువ్వే చెప్పాలి"

"కొన్ని మార్పులుచేసి కొన్ని రోడ్లువేసి కొంత శ్రమిస్తే ఈ ఒడ్డుని చక్కని బీచ్‌గా చెయ్యొచ్చు. వూళ్లోని జనమంతా మీ పేరు చెప్పుకుని రోజూ ఇక్కడికి షికారుకొస్తారు. టూరిస్ట్ ఎట్రాక్షన్ కావొచ్చుకూడా"

"గుడ్... క్రియలో చేసి చూపిస్తాను"

ప్రభాకర్, పిల్లలూ కలిసి స్నానాలు చేస్తోంటే ఒడ్డున నిలబడింది స్వప్న.

"పెద్ద కలెక్టరవయ్యిండి కూడా చిన్నపిల్లలా ఇక్కడిక్కడ స్నానం చేస్తావేమిటి? ధైర్యంవుంటే లోపలికెళ్ళి చెయ్యి" కవ్వించింది.

"నువ్వేళ్ళమంటే ఎక్కడికైనా వెళ్తానోయ్" అంటూ సముద్రంలోపలికెళ్ళాడు ప్రభాకర్ ఈత కొట్టుకుంటూ.

చాలా లోపలికెళ్ళి చెయ్యి వూపాడు వుత్సాహంగా. పిల్లలూ స్వప్నా కూడా సంబరంగా అరిచారు.

ఇంతలో ఓ పెద్దకెరటం మహా సర్పపు పడగలా వచ్చి ప్రభుమీదకు విరుచుకుపడింది.

"ప్రభూ" కెవ్వున అరిచింది స్వప్న.

"స్వప్నా...ఏవిటే ఏవయ్యిందే- పీడకల వచ్చిందా" అలివేణి అడిగింది కుదుపుతూ.

"వూఁ... ఎక్కడున్నానూ... హాస్పటల్లోనా?"

"నీ మొఖం. మనింట్లోనే వున్నావుగాని పీడకల వచ్చిందా అంతగట్టిగా అరిచావ్"

తను కల కన్నదని గ్రహించి దీర్ఘంగా నిట్టూరుస్తూనే తలూపింది.

"ఆంజనేయ దండకం చదువుకుంటూ పడుకో"

తలూపి టేబుల్‌మీదున్న అలారం టైమ్ పీస్‌లోకి చూసింది స్వప్న ఆత్రంగా.

అయిదూ పది.

ఆమెలో వుత్సాహ తరంగం వువ్వెత్తున లేచింది.

తెల్లవారుజామున వచ్చిన కలలు నిజమవుతాయంటారు.

తన ఈ కల కూడా నిజమవుతుందేమో?!

ఏమో ఏవిటి నిజమై తీరుతుంది. తను నిజం చేసి తీరుతుంది కూడా.

స్వప్నకి ఎక్కళ్ళేని సంతోషమూ కలిగింది.

చాన్నాళ్ళ తర్వాత హాయిగా తృప్తిగా నిద్రపోయింది.

★ ★ ★

వెంకటరమణా ప్రింటింగ్ ప్రెస్‌లో యాంత్రికంగా కంపోజింగ్ చేస్తున్నాడు స్వామి. అయినా అతడి దృష్టంతా బ్రాకెట్టుమీదే

వుంది.

ఆవాళ ప్రైవేటుగా చిన్న బైండింగు పని చేసి అయిదు రూపాయలు సంపాదించాడు. దాన్ని ఏ నెంబరుమీద కాయాలా అని ఆలోచి స్తున్నాడు.

అలా అడపాదడపా వచ్చే పైడబ్బులేకాదు జీతంలో సగంపైగా బ్రాకెట్టు మహాలక్ష్మికి దక్షి ణగా సమర్పిస్తుంటాడతడు.

ఇరుకుగదిలో వుంటున్నాడు. పడుకోడానికి మంచంకూడా లేదు. చిరగని బట్టల్లేవు. గంజి అన్నం తప్ప సరైన భోజనం లేదు.

తనకోసం సాధ్యమైనంత తక్కువ ఖర్చు చేసుకుని మిగతాదంతా బ్రాకెట్టు ఆడెయ్యా టమే దానిక్కారణం.

అదృష్టం వరిస్తే రూపాయికి ఎనభై రూపా యలొస్తాయి. అంచేత బ్రాకెట్టు తనని లక్షాధికా ర్ని చేసే మంత్రదండమని విశ్వసిస్తాడు.

బ్రాకెట్టు అంకెల్లో ఓ లెక్కల సూత్రం ఇమిడి వుందనీ ఆడగాఆడగా అది అవగాహ నమవుతుందనీ స్వామి నమ్మకం. అప్పుడు తన జీతమంతా ఒడ్డేస్తే 32,000 వస్తాయి. దాన్నంతా తిరిగి కాస్తే తను లక్షాధికారి అయి పోతాడు. తనని చూసి నవ్విన వాళ్ళకి ఫోజు కొట్టేస్తాడు.

ఆ శుభదినం కోసం చకోరపక్షిలా ఎదురు చూస్తున్న స్వామి గతం చాలా బాధాకరమైంది.

అతడికి ఏడేళ్ళు నిండకుండానే అతడి తండ్రికి నూరేళ్ళు నిండిపోయాయి. రెక్కలు తెగిన పక్షులై మేనమామగూటిలో తలదాచుకు న్నారు తల్లీకొడుకులు.

తల్లి పగలు పనిమనిషి. రాత్రుళ్ళు ఇంట్లో నవారు నేసి అంతోఇంతో సంపాదించేది.

తాను వానాకాలం చదువు చదువు కుంటూనే మేనమావ పాలేరుగా పశుపాలన చూసేవాడు.

వారి దూషణభూషణ తిరస్కారాల్ని మౌనంగా భరించారు పది పన్నెండేళ్ళు.

అతడు ఇంటర్ చదువుతూండగా తల్లికి జబ్బు చేసింది. వైద్యం చేయించలేదుగాని ఎప్పట్లా అరవ చాకిరీ చెయ్యమన్నారు. అతడు చూస్తూ వుండలేక ఎదురుతిరిగాడు.

"నాసొమ్ము తేరగా తింటూ నన్నే ఎది రించేంత పెద్దవాడివైపోయావన్నమాట. ఒరే కుర్రనన్నాసీ! మీ అమ్మకి మందులిప్పించడా నికీ మిమ్మల్ని మేపడానికీ మీనాన్నేం పాతర్లు వదలిపోలేదురా. ఇంత జరిగేక మిమ్మల్ని ఇంట్లో వుండనిచ్చేదిలేదు. మీదిక్కున్న చోటికి ఫోండి. మీ అమ్మకి వైద్యమే చేయిస్తావో శ్రా ద్ధమే పెడతావో నీఇష్టం. ఫోండి..." అంటూ తాడెత్తు ఎగిరాడు మేనమావ.

తల్లినా చెఱ నుంచి విడిపించాలని తహత హలాడాడు. వుద్యోగ ప్రయత్నాలేమీ ఫలించ లేదు. కడకి తల్లికూడా అతడికన్యాయం చేసి మరోలోకం వెళ్ళిపోయింది.

తమకి డబ్బు, ఆస్తీ వుండివుంటే మావ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడక్కర్లేకపో యేది. తల్లి అనారోగ్యం ఆయుష్షుని మ్రింగేదీకా దు.

"ఎలాగైనాసరే డబ్బు సంపాదించాలి. లక్షా ధికారినవ్వాలి" దృఢంగా అనుకుని పొట్ట చేత బట్టుకొని ఆ వూరొచ్చి ప్రెస్సులో వర్కర్‌గా చేరాడు.

మొదట లాటరీలనాశ్రయించాడు. కాని ప్రో త్సాహకరంగా అన్పించలేదు. అప్పుడు బ్రాకె ట్టు కాళ్ళమీద సాగిలపడిపోయాడు.

బ్రాకెట్టు లక్ష్మి కరుణిస్తే తిరిగిపోయే తన దశ గురించి ఆలోచిస్తూనే చేతిలోని పని పూర్తిచేశాడు స్వామి. యజమానికి చెప్పి తిన్నగా కిళ్ళీబడ్డీ దగ్గరికొచ్చేశాడు.

అతడికోసమే ఎదురుచూస్తున్న కొందరు సాదరంగా ఆహ్వానించి దినపత్రికల్లోని కార్టూన్ సీరియల్ బొమ్మల్నీ చార్ట్‌నీ అందిచ్చారు.

అన్నీ ఋషిలా పరిశీలించాడు.

అంతక్రితం వారం ఆదేరోజున '05' వచ్చింది. క్రితంనెల అదే తారీఖున '50' వచ్చింది. గత నాలుగు నెలల్లో నాలుగో శుక్ర వారం రోజున తప్పకుండా ఓ అంకె జీరో అవుతోంది.

అవాళ జీరో రావటం ఖాయం అనుకున్నా డు. రెండో అంకె కోసం వెదగ్గా జీరోతోబాటు ఎక్కువగా '5' వచ్చినట్టు కన్పించింది. '05'

గాని '50' గాని వచ్చి తీరుతుందనుకున్నాడు స్వామి.

మిగతావాళ్ళక్కూడా అదే వివరించి అయి దురూపాయలూ ఆ రెండంకెల మీదా కాసేశాడు. కొట్టతనిచ్చిన చీటీ తీసుకొని ఇంటికెళ్ళాడు.

నిస్సత్తువగా అన్పించి చాపమీద పడుకున్నాడు. ఆకలి కరకరలాడుతోంది. కాని అన్నం వండుకునే ఓపికలేదు.

ఈ ఒంటరితనం భరించరానిదిగా వుంటోంది. పోనీ పెళ్లి చేసుకుంటే?

పిల్లనెవరిస్తారు? ఇచ్చినా ఆమెనెలా పోషించగలడు? ఆమె షోకుల్నీ సరదాల్నీ తీర్చడం ఎలా? డబ్బులేనివాడు డుబ్బుకి కొరగాడు కదా. పోషించలేని భర్తతో ఏ భార్యైనా ఎన్నాళ్ళుంటుంది? మరొకరు దొరగ్గానే సాంఘిక బంధనాలు తెంచుకుని స్వర్గసుఖం వెదుక్కుంటూ లేచిపోతుంది.

అందుకే మొదట డబ్బు సంపాదించాలి. అప్పుడు బెల్లంచుట్టూ చేరే చీమల్లా చేరతారు బంధుమిత్రులు. కట్టుకున్న భార్యకూడా పతివ్రతలావడి వుంటుంది.

ఇంకాఇంకా తనఖర్చు తగ్గించేసుకుని బ్రాకెట్టు ఆడి త్వరగా గమ్యం చేరుకోవాలని నిశ్చయించుకున్నాడు.

లేచి ఇంత అన్నం వండుకున్నాడు. గంజి పోసుకుని తిని బయటికి నడిచాడు ఈసరికి ఓపెనింగ్ వచ్చి వుంటుందనుకుంటూ.

అరుణావాళ్ళింటి ముందునుంచి వెళ్తోంటే అతడికాళ్ళు తడబడ్డాయ్.

నిజం చెప్పొద్దూ అరుణంటే అతడికి గౌరవం భయం భక్తీ అన్నీను. ఆమె కాస్త నలుపైనా బావుంటుంది. ముఖ్యంగా కళ్ళు చలాకీగా ఆకర్షణీయంగా వుంటాయి. పైగా తనకన్నా పెద్ద చదువు చదువుతోందని ఆమె అంటే గౌరవం. అభిమానం. కాని ఆమె కళ్ళంటే అతడికి మహా భయం.

ఆ కళ్ళు తనని హెచ్చరిస్తున్నట్టు తప్పు మార్గాన పోతున్నావని ప్రేమగా చెబుతున్నట్టూ అన్పిస్తూంటుంది.

మెదడులో ఏవేవో వూహలు వూపిరి పోసుకొంటోంటే చిన్నగా నిట్టూరుస్తూ కిళ్ళీబడ్డీ దగ్గరికెళ్ళేడు.

"ఓపెనింగ్ వచ్చిందా గురూ?"

"జీరో వచ్చింది"

స్వామి సంబరానికవధుల్లేకపోయాయ్.

అంటే జీరో ఫైవ్ రాబోతోంది! తన జోస్యం ఫలించబోతోంది! అదృష్టలక్ష్మి తన తలుపు తడుతోంది!

ఆవాళ నాలుగొందలొస్తాయి. దాన్నంతా రేపు తిరిగి కాసేస్తాడు. బ్రాకెట్టు [illegible] సిపోయింది గనుక రేపుకూడా బ్రాకెట్టు తగుల్తుంది. ముప్పై రెండు వేలొస్తాయి. మళ్ళీ దాన్ని కాసేస్తాడు. అప్పుడు...

పరమానందంతో వుక్కిరిబిక్కిరైపోయాడు.

మాయల ఫకీరు ప్రాణం చిలకలో వుంది. బ్రాకెట్టు ఆయువుపట్టు తనచేతిలో వుంది.

ఇక భాగ్యలక్ష్మి తను చెప్పినట్టు నర్తిస్తుంది!

"ఏంటి గురూ గుర్రం ఎక్కినట్టున్నావ్?"

"గుర్రం కాదు ఏనుగెక్కేస్తాను చూస్తూండు. రేపిచ్చేస్తానుగాని సిగరెట్టు, కిళ్ళీ రెండ్రూపాయలూ ఇవ్వరు- సినిమాకెళ్ళాలి"

యమాశ్చర్యంగా చూశాడతడు. అతడికి తెలిసినంతవరకూ స్వామి ఆ మూడింటివంకా కన్నెత్తి చూడలేదు.

నోరెళ్ళబెట్టి చూస్తూనే అందిచ్చాడు.

కిళ్ళీ నములుతూ స్టైలుగా సిగరెట్టు కాలుస్తూ హీరోలా నడుస్తూ సినిమాకి వెళ్ళాడు స్వామి.

సినిమా చూళ్ళేదు. తెరమీద తన కలల్నే చూశాడు.

సెకండ్‌షో అయ్యీ అవ్వగానే వరుగున బయటికొచ్చి అక్కడి కిళ్ళీషాపు ముందు వ్రేలాడగట్టిన పలక వంక చూశాడు.

డబుల్ జీరో!

కళ్ళు గిర్రున తిరిగాయి స్వామికి. కన్నీళ్ళు వుబికి వస్తోంటే ఇలా జరిగిందేమిటాని జుట్టు పీక్కున్నాడు. అంతలో ఫ్లాష్‌లాంటి ఆలోచనొచ్చింది.

క్లోజింగ్ అంకె కరెక్టవ్వలేదని ఏడ్వడం అనవసరం. ఓపెనింగ్ కరెక్ట్ అయ్యిందని సంతోష

పడటం అవసరం. ఎంచేతంటే తనలెక్క నగం కరక్టయ్యింది. అంటే నగం విజయం సాధించినట్టే. మరికొంత కృషి చేస్తే ఆ మిగతా నగమూ తెలిసిపోతుంది. ఆ తర్వాత తను పట్టిందల్లా బంగారమే!

చిన్నగా ఈలవేస్తూ అడుగువేశాడు ఆశాజీవి స్వామి.

నాలుగడుగులేశాడో లేదో వెనకనుంచి విన్పించిన జనం మాటలకి చేష్టలు దక్కి నిలుచుండిపోయాడు.

"అడిగో ఆ కుర్రాడే. అరుణకి అతడ్తోనే సంబంధం వుందిట" సినిమా జనంలోని ఒక రన్నారు.

"నిజమేనంటావా?"

"నిప్పులేందే పొగరాదురా. ఏదో వుండే వుంటుంది. ఇతడికి ఆడదక్కులేదు. వాళ్ళకి మగదిక్కు లేదు. ఇంకేవిటోయ్?"

"కానా అమ్మాయి అలాటిది కాదనుకుంటా న్నా..."

"అదో పెద్దకేనుగురూ. చాలామంది ప్రయత్నాలు చేస్తున్నారు. నీకూ ఓపికుంటే చూసుకో"

స్వామి రక్తం సలసల కాగింది. అరుణ గురించంత చీప్‌గా మాట్లాడుతోంటే సహించ లేకపోయాడు.

గిరుక్కున వెనుదిరిగెళ్ళి గబుక్కున చొక్కా పట్టుకుని దబదబా నాలుగు బాదేశాడు.

ముందు ఏంజరుగుతోందో ఎవరికీ అర్థంకా లేదు. అర్థమైన వుత్తర క్షణాన అతడి స్నేహితులు నలుగురూ కలిసి స్వామిమీద పడ్డారు.

★ ★ ★

స్వప్నపెళ్ళి ప్రభాకర్‌తో చాలా నిరాడంబరంగా బొమ్మలపెళ్ళిలా జరిగిపోయింది.

అప్పుతో చేస్తున్న పెళ్ళి గనుక ఖర్చు తగ్గుతుందని ద్వారకాతిరుమల గుళ్ళో పెళ్ళి చేసేశారు విశ్వనాథం.

అదే ముహూర్తానికి చాలా పెళ్ళిళ్ళు జరుగుతూండటంతో ఎక్కడా జాగాలేకపోయింది. మరి గత్యంతరం కన్పించక మెట్లమీద నాలుగు గజాల స్థలం దొరకడంతో అదే భాగ్యమనుకుని అక్కడే కానిచ్చేశారు.

స్వప్న ప్రాణంలేని బొమ్మలా కూర్చొంది పెళ్ళి పీటలమీద.

పుత్తడి బొమ్మలా వుంది పెళ్ళికూతురని అంతా చెప్పుకొంటోంటే మరింతగా కుళ్ళిపోయిందామె.

పుత్తడి బొమ్మప్రక్కన రాకుమారులకీ రాజశేఖరులకీ తప్ప మరెవరికీ నిలబడే అర్హతకూడా లేదు.

కాని... ఏ ప్రత్యేకతా లేని సాదాసీదా ప్రభాకర్‌తో....!

మరింతగా డీలాపడిపోయింది. ఎవరూ గమనించకుండా కళ్ళూ, ముక్కూ తుడుచుకుంది. అయినా ఆమె అక్క అలివేణి దృష్టిలో పడనేపడింది.

"ష్...ఏవిటే అది- అంతా చూస్తున్నారు" అంది చెవిలో, "నీ ఫ్రండ్స్ ఎవరైనా వచ్చినా బావుణ్ణు...."

అరుణ ఏదో పనివుంది రాలేనని చెప్పి ఇంటి దగ్గరే ప్రెజంటేషన్ ఇచ్చేసింది. రాణి తమ కార్లో వస్తానందిగాని రాలేదెంచేతో. మిగతా వాళ్ళు అంతదూరం ఎలా రామే అనేశారు.

నిట్టూర్చింది.

వాళ్ళు రాకపోవడంకూడా మంచిదే అయ్యింది. లేకపోతే వచ్చి ఈ పెళ్ళి చూస్తే ఎంతసిగ్గు, అసలిది పెళ్ళా?

రంగుబల్బుల తోరణాల్లేవు. వెలుగుతో నిండిన భవనంలేదు. బ్యాండుమేళం లేదు. విందు లేదు. పూలమంటపం లేదు. మందు గుండు ప్రేలుళ్ళు లేవు. బహుమతుల పాకెట్లు లేవు. పట్టుచీరల పరపరలు లేవు.

కూటికి ఠికానా లేని వారి పెళ్లిలా గుడిమెట్ల మీద ఏదో అయ్యింది అన్నట్టుగా అయిపోయింది పెళ్లి.

తీరని అసహనంగా, అసంతృప్తిగా ఆవేదనగా వుంది. మనస్సులో కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది స్వప్న.

★ ★ ★

స్వామినెవరో కొట్టేరని తెలిసి అరుణ మొదట నమ్మలేకపోయింది.

ఎవరో కాకివెధవలు తనగురించి కారుకూ

తులు కూస్తే విని సహించలేక వాళ్ళతోతలవడితే వాళ్ళతన్ని కొట్టారని విని మ్రాన్పడిపోయింది.

ఎవరో తనగురించేదో వాగితే అతడు ఆవేశపడ్డాడు.

అంటే అతను తనని ప్రేమిస్తున్నాడా?!

ఆమె గుండెలు ఝల్లుమన్నాయ్.

ఏదో వింతైన పారవశ్యత నిండిన అనుభూతి ఆమె నరనరాన్నీ తాకిందొక్క క్షణం.

అతడి మొఖంలో, కళ్ళల్లో తనకేదో ఆకర్షణ కన్పించిన మాట నిజమే. అతడిమీదా అతడి బలహీనతమీదా సానుభూతి వున్నమాట నిజమే. వాటివెనుక అస్పష్టరూపంలో ప్రేమ వుందా? ఏమో!

ఆమె పెదాలపై సన్నని మందహాసం సుతారంగా కదిలింది.

ఆమెకి తన పరిస్థితీ ఆర్థికస్థితీ సమాజంలో తమస్థానం- అన్నీ తెలును. అందుకే నేలవిడిచి సాముచెయ్యదామె. నింగిలో వూహలవూయలూగదు.

జీవితాన్ని జీవితంలానే చూస్తుంది. అదే ఆమె ప్రత్యేకత.

ఇప్పుడే వస్తానని తల్లితో చెప్పి స్వామి ఇంటికెళ్ళింది.

ఇరుగుపొరుగు అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకోవడం ఆమె గమనించకపోలేదు. తన మీద పుకార్లకి మరింత బలమొస్తుందనీ తెలును. అయినా వేటినీ లెక్కచేసే స్థితిలో లేదామె.

అరుణని చూసి ఆశ్చర్యం సంబరం నిండినకళ్ళతో తడబడుతూ ఆహ్వానించాడు స్వామి.

తపస్సు ఫలించిందన్న భావం అతడి కళ్ళల్లో కదలాట్టం ఆమె గమనించకపోలేదు.

"రండి... కూర్చోండి...." అనేసి నాలిక్కరుచుకున్నాడు ఎక్కడ కూర్చోమనాలో తెలీక.

నవ్విందామె. "నా సంగతికేంగాని మీరు కూర్చోండి- దెబ్బలు బాగా తగిలినట్లున్నాయే"

అతడి చేతికున్న కట్లన్నీ మొఖాన అంటించిన పట్టీల్నీ చూస్తూ అందామె.

తలాడించి నవ్వేడు- "రెండ్రోజుల్లో తగ్గిపోతుంది లెండి"

"మీరు తొందరపడకుండా వుండాల్సింది. రోజూ ఎన్నోరకాల కూతలు వింటూంటాం. అన్నిటినీ లెక్కచెయ్యాల్సిన అవసరం లేదు కదా"

"వాళ్ళు మనిద్దరి గురించి... అదే మీ గురించి చెడుగా వాగితే సహించలేకపోయాను..."

ఆమె ముఖం ఎర్రబడింది. అయితే తను విన్నట్టు వాళ్ళు కేవలం తనగురించే వాగలేదన్నమాట. తామిద్దరిగురించీ... ఎంత దారుణం!

"ఇంకెవరి గురించైనా వాగితే పట్టించుకోకపోదును. కాని నిప్పులాంటి మీ గురించి వాగేసరికి నిగ్రహించుకోలేకపోయాను"

"మనం నిదానంగా నడుస్తున్నప్పుడు మన నీడవంకరగా వుందనుకోండి మనం బాధపడటం అనవసరం కదా"

"బాధపడకపోయినా ఒక్కక్షణం ఆలోచించాలి కదండీ"

విస్ఫారిత నేత్రాలతో చూసిందామె.

ఆ కళ్ళల్లో ప్రశంస కన్పించి సిగ్గుపడ్డాడు స్వామి.

"అనవసరమైన విషయాల గురించాలోచిస్తూ బుర్రపాడుజేసుకోవడం మంచిదేనంటారా?"

"అవసరమైన విషయమో అనవసరమైన విషయమో మన దృష్టిలోంచే చూస్తే చాలదు కదండీ"

"నిర్మాణాత్మక విమర్శ గురించి పట్టించుకోవాల్సిందే. కాని కుక్కమొరుగుళ్ళు పట్టించుకోవాల్సిన అవసరం ఏనుగుకి వుండాలంటారా?"

"అది ఏనుగు, ఇది కుక్క అని తెలుసుగనుక పట్టించుకనక్కర్లేదంటాం. కాని ఇది అలాటి విషయంకాదు కదండీ. నీడల్నిచూసి నిజాలుగా భ్రమింపజేస్తారు. గాలికబుర్లు నాటి సుడిగాలి పుట్టిస్తారు. నలుగురు వంకరవంకర అని అరిస్తే అయిదోవాడికి వంకరగానే కన్పిస్తుందండి"

ఆమె ముఖం కాంతివంతమయ్యింది. అత డి తెలివితేటలకి గర్వమూ తన అంచనా తప్పుకానందుకు సంతోషమూ కలిగాయి.

"ఏవిటో అనుకున్నాను. తార్కికంగా కూడా బాగా ఆలోచించగలరే"

"ఏదో వానాకాలం చదువు"

"ఏకాలవు చదువైనా ప్రతిభ ప్రతిభే. తెలివి తేటలు తెలివితేటలేకదా"

తలొంచుకున్నాడు.

అతడు సానబట్టని వజ్రంలాంటివాడనీ సానబడితే ఇక అతడికి తిరుగుతుండదనీ విశ్వసిస్తూ అంది– "నావల్ల మీకు జరిగిన ఇబ్బందికి చింతిస్తున్నాను. ఈ రకంగానైనా మన పరిచయం పెరిగినందుకు సంతోషిస్తు న్నాను"

రెట్టించిన ఆత్మవిశ్వాంతో అడుగులేస్తూ వెళ్ళిపోయిందామె.

తన చెవుల్ని నమ్మలేక ఆశ్చర్యంగా చూశా డు. అనంతరం ఆనందం పట్టలేక గంతులేసి



'అమ్మా!' అని పెదవి కొరుక్కున్నాడు స్వామి- చేతి కట్లవంకచూసుకుంటూ.



పెళ్లైన నెలలోనే స్వప్నని కాపురానికి పంపించడానికి అతికష్టంమీద ఒప్పుకున్నారు విశ్వనాథం.

స్వప్నని తీసుకెళ్ళడానికొచ్చాడు ప్రభాకర్.

"పెళ్లి ఖర్చునుంచి ఇంకా తేరుకోలేదు. మంచం టేబులూ లాటి సామాగ్రి తర్వాత పెడతాం" అన్నారు విశ్వనాథం.

"దానికేం లెండి— మీరెంత పెట్టగలిగితే అంతే పెట్టండిగాని గొప్పలకిపోయి అప్పులపాలవ్వొద్దు" అన్నాడు ప్రభాకర్.

అతని మాటలకి అన్నీ తెలిసిన అల్లుడు లభించాడని ఇంటిల్లిపాదీ మురిసిపోయారు.

ప్రయాణంరోజున స్వప్నకి ప్రత్యేకంగా హితబోధచేసింది శాంతమ్మ.

"ఎప్పుడూ ఇల్లు విడిచివుండని దానివి. అక్కడంతా కొత్తగా వుండొచ్చు. కంగారుపడకు. రెండ్రోజుల్లోనే అంతా అలవాటైపోతుందిలే. మాట రాకుండా వున్నదాంతోనే సంసారాన్ని గుట్టుగా నడపాలి. అదిలేదు ఇదిలేదనీ అదికావాలి ఇది కావాలి అనీ విసిగించకూడదు. మగవాళ్ళు తెచ్చిందాన్నే సంతోషంగా స్వీకరించాలి. అలసి ఆఫీసునుంచివస్తే అది అయిపోయింది, ఇది అయిపోయిందని లిస్టు చదవకూడదు. ఏది చెప్పడానికైనా సమయం సందర్భం చూసుకోవాలి-- తెల్సిందా?!!

ఇరుగు పొరుగువాళ్ళతో కలివిడిగా వుండు. అనవసరమైన విషయాల్లో జోక్యంచేసుకోకు. ఒకవేళ అల్లుడేమైనా అంటే ఎదురుచెప్పి రాద్ధాంతం చెయ్యకుండా అన్నీ నువ్వే సర్దుకుపోవాలి. మననిబట్టే మన ప్రవర్తననిబట్టే మగవాళ్ళు మనుల్తారు. సంసారాన్ని స్వర్గం చేసుకోవాలన్నా నరకం చేసుకోవాలన్నా అంతా ఆడవాళ్ళ చేతుల్లోనే వుందని మర్చిపోకు..."

అసహనంగా వింది స్వప్న.

"సంసారాన్ని చక్కదిద్దటమేకాదు భర్తని గొప్పవ్యక్తిగా తీర్చిదిద్దగల శక్తి కూడా ఆడవాళ్ళకుందమ్మా. ఒక్క రెండేళ్ళలో ఆయాన్నెలా మార్చేస్తానో నువ్వే చూస్తావుగా" మనస్సులోనే అనుకుంది ధీమాగా.

త్వరగా ప్రయాణంకండని తొందరపెడుతున్నారన్నమాటేగాని విశ్వనాథం మనస్సు మనస్సులోలేదు.

పెళ్లైన ప్రతిఆడపిల్లా ఏదో ఒకనాడు పుట్టింటిగడపదాటివెళ్ళక తప్పదు.ఆమెనితల్లిదండ్రులకి సాగనంపకా తప్పదు. అయినా ఆ సమయం వచ్చేసరికి అందరి గుండెలు బరువెక్కుతాయి. కళ్ళల్లో కన్నీటికుండలు బద్దలవుతాయి. పెంచిన మమత కలగబోయే వియోగాన్ని తలచి విలపిస్తే కన్నప్రేగు కూతురి సౌభాగ్యాన్ని తలచి ఆనందంతో వుప్పొంగే విచిత్ర పరిస్థితి అది.

భారమైన హృదయంతో పుట్టింటి గడపదాటింది స్వప్న.

ఇక ఈ క్షణం నుంచి పుట్టిల్లు పరాయి ఇల్లు అయిపోతుందన్పించి గుండెల్నెవరో వుక్కుహస్తాలతో పిసికేస్తున్నట్టు తల్లడిల్లింది. కాని అదే సమయంలో తను తనదనే చిన్నారిపొన్నారి ఇంటిని వెదుక్కుంటూ వెళ్ళి మరో కొత్తజీవితంలో అడుగుపెట్టబోతుందన్న తీయని వూహ ఆమెలో తృప్తినీ సిగ్గునీ కూడా రగిల్చింది.

కళ్ళెంలేని గుర్రంలావచ్చి ఆగింది రైలు.

అల్లుడికీ కూతురికీ మంచిచెడ్డల గురించీ ముందు జాగ్రత్తలు గురించీ మెలకువల గురించీ ఆటుపోటుల గురించీ ఎన్నెన్నో చెప్పారు విశ్వనాథం దంపతులు. తమ అనుభవసారాన్ని నూతన తరానికి కందించి చల్లగా వర్ధిల్లమని మనసారా దీవించారు.

"వెళ్ళగానే ఉత్తరం రాయండి సుమా..."

తండ్రి మాటలకి తలూపుతూ చేతులూ

పించి స్వప్న.

రైలువేగాన్ని పుంజుకొంటోంటే తమసీట్లో కొచ్చికూర్చున్నారు స్వప్నా ప్రభాకర్.

"హైదరాబాద్ రైల్వేస్టేషన్ చాలా పెద్దది కదండీ" వున్నట్టుండి అడిగిందామె.

"వూహూ... సికిందరాబాద్ స్టేషన్ పెద్దది"

కొంచెంగా నిరుత్సాహపడిందామె. "అలాగా... మీరు ఆఫీసుకి సిటీ బస్సు మీదెళ్తారా?"

తలాడించాడు.

"అక్కడ బస్సులూ, చిన్నకార్లూ మోటారు సైకిళ్లూ తప్ప ఇంకేంవుండవు కదండీ" వుత్సాహంగా అడిగింది.

అలా అడుగుతోంటే ఆమె కళ్ళల్లో మెరిసిన మెరుపుల్నిచూసి విస్తుబోయాడతడు. "ఎవరు చెప్పేరలా... నీ ఫ్రెండ్సా?"

"చాలా కథల్లో అలాగే చదివేను"

"వాటిల్లో బాగా డబ్బున్న వాళ్ళ గురించి రాస్తారు గనుక వాళ్ళన్తమానూ కార్లలో తిరగటంచూసి హైదరాబాదునిండా చిన్నకార్లే వున్నాయనుకుంటున్నావా? భలేదానివే. సిటీలో ధనికులేకారు సామాన్యులు కూడా లక్షలాదిమంది వున్నారు. కార్లేకాదు సైకిళ్ళూ అవి కూడా లేనివాళ్ళూ చాలా చాలామంది వున్నారు. సిటీ అన్నప్పి అక్కడున్నవాళ్ళంతా గొప్పవాళ్ళేననీ వాళ్ళంతా గొప్పగా బతికేస్తున్నారనీ అనుకుంటే ఎలా?"

చేదు తిన్నట్టు ఫీలయ్యిందామె. హైదరాబాదు చిన్నసైజు స్వర్గం అనుకొంటుంటే ఈయనిలా మాట్లాడతాడేవిటీ అనుకుంది. కాస్సేపటి వరకూ మాట్లాడలేకపోయింది కూడా.

"ఊహకీ వాస్తవానికీ మధ్య వుండే దూరం చాలా ఎక్కువ. అంచేత వూహల్లోంచి వాస్తవంలో కొచ్చేసరికంతా అయోమయంగా అసంతృప్తిగా వుండటం సహజం. అందుకే వూహల గుర్రాలకి కళ్ళాలువేసి అదుపులో వుంచుకోవడం చాలా అవసరం డార్లింగ్" అంటూ ఆమె బుగ్గమీద చిటికేసి నవ్వేడు.

హాయిగా సిగ్గుపడిందామె.

"మన ఇల్లెలా వుంటుందండీ? చిన్నడాబాయా మేడలోని ఫ్లాటా?"

"తినబోతూ రుచి అడగటం ఎందుకు?"

"ముందు చెబితే మీ సొమ్మేం పోదులెండీ"

"అమ్మమ్మ సస్పెన్స్ పోదూ?"

ఇద్దరూ నవ్వుకున్నారు. కంపార్ట్‌మెంట్లోని వాళ్ళంతా తమవంక చూడటంతో ఇద్దరిబుగ్గలూ ఎర్రగులాబీలయ్యాయి.

"అబ్బో-అప్పుడే తొమ్మిదిన్నరయ్యిందే. పడుకుందాం" అంటూ బెర్త్‌మీద పక్కసర్దేడు ప్రభాకర్.

ఏదో దివ్యమైన లోకంచేరి జన్మని ధన్యం చేసుకోవాలని కాబోలు ఆత్రంగా ఆరాటంగా గుండెల్నిండా ఆశల్ని నింపుకుని మరీ పరుగెడుతోంది రైలు.

డిమ్‌లైట్ కాంతి త్రీటైర్ కంపార్ట్‌మెంట్లో వెన్నెల్లా కురుస్తోంటే జోగుతున్నారంతా.

స్వప్న కంటిమీదకి మాత్రం కునుకురావడంలేదు.

భాగ్యనగరం గురించీ, తన భాగ్యం గురించీ, దాంపత్య సౌరభం గురించీ, అనురాగలహరి గురించీ, తన లక్ష్యం గురించీ ఆలోచిస్తూచిస్తూ ఎప్పుడో ఒంటిగంట ప్రాంతాన నిద్రాదేవి ఒడిలోకి జారిపోయిందామె.

వెలుగురేఖలు చురుక్కున తగిలేసరికి మెలకువ వచ్చింది స్వప్నకి. 'ఛా-మొద్దులా నిద్రపోయానే' అనుకుంటూ లేచికూర్చుంది.

"గుడ్మార్నింగ్ మేడం. ఇప్పుడిప్పుడే భాగ్యనగర ప్రవేశం చెయ్యబోతున్నాం. తమరు ముఖప్రక్షాళనం కానిస్తే కాఫీ తాగెయ్యొచ్చు"

"ఎందుకండీ... ఇంటికెళ్ళిపోతాంగా"

"వెళతాంగానీ ఏ సరుకు ఎక్కడుందో చూచి నువ్వు కాఫీ కాచిచ్చేసరికి చీకటి పడిపోతుంది"

అతడితోబాటు తనూ శృతి కలిపింది.

ఆయన చాలా మంచి మనిషీ సరదా మనిషీనూ. అమ్మానాన్నా అన్నట్టు తను నిజంగా అదృష్టవంతురాలే. కాదంటే ఆ వుద్యోగం కాస్తమంచిదైతే సరిపోను. దానికేంలే ఆయన్ని రెండేళ్ళలో గబగబా నిచ్చెన మెట్లెక్కించెయ్యదూ?

టవల్ తీసుకుని టాయ్‌లెట్‌లోకి నడిచింది.

హేండ్‌బేగ్‌లోంచి అద్దంపౌడరూ వగైరాలు బయటికితీసి తలదువ్వుకుని ఆమె ముస్తాబయివస్తే కళ్ళప్పగించి చూడసాగాడు ప్రభాకర్.

ఎంత అందగత్తె!

రామప్ప గుడిలోని విగ్రహసుందరి దుస్తులు ధరించి వచ్చినట్టు...

ఈ అందానికి కామందు తను. ఇకనుంచీ అందం తన కౌగిట్లో కరిగిపోతుంది. తన పెదాల స్పర్శకి పులకించిపోతుంది. తీయని స్వప్నలోకాల ద్వారాలు తెరుస్తుంది...

ఓహ్! తనెంత లక్కీఫెలో!

తనెలాంటి సుందరి తన జీవిత భాగస్వామిని కావాలనుకున్నాడో అంతకు వందరెట్ల సౌందర్యవతి - కాదు అప్సరాంగన తన జీవితంలోకి నడిచొచ్చి చేయిపట్టుకుని మరో సుందర సుమధుర లోకంలోకి తీసుకెళతాను రారమ్మంటోంది!

"ఏవిటలా చూస్తున్నారు?"

"చూడటంలేదు... నీ అందాన్ని తాగేస్తున్నాను"

అందంగా సిగ్గుపడిందామె.

"నువ్విప్పుడెలా వున్నావో చెప్పనా? మంచులో తడిసిన మల్లె మొగ్గలా..."

"కవిత్వం కూడా వచ్చే"

"నీలాంటి ఆడపిల్ల పక్కనుంటే కవిత్వం ఏవిటి దాని తాత కూడా వస్తుంది"

"అలాగా"

"అవునుగానీ అవేమిటోచూడు– ఇరు పక్కలా కన్పిస్తున్న ఆ ఫ్యాక్టరీలనుచూసి సిటీలో జనం వుండరా అని ఆశ్చర్యపోకుసుమా" హాస్యమాడాడు.

"నేనంత తెలివి తక్కువదాన్ని కాదులెండి"

"కోప్పడకు డార్లింగ్..."

సికింద్రాబాద్ స్టేషన్లో రైలుదిగి ఆటో ఎక్కేరు.

అమీర్‌పేటవైపు సాగిపోతున్న ఆటోలోంచి చూస్తూ– "ఇదేనా భాగ్యనగరం? ఇంకా ఇక్కడ న్నీ ఆకాశహర్మ్యాలుంటాయనుకుందే!" అని నిరాశపడ్తూనే డబుల్‌డెక్కర్లనీ, విశాలమైన రోడ్లనీ చూస్తూ విస్మయపడసాగింది స్వప్న.

మెయిన్‌రోడ్ వదలి సందుగొందులు తిరిగి ఓ ఇరుకు సందులో ఆగింది ఆటో.

అపరిశుభ్రంగావున్న ఆ గల్లీనీ అక్కడున్న పాతఇళ్ళనీ చూసి మొఖం చిట్లించింది. అలాటిచోట కాపురముండాలన్న వూహే కంపరంగా వుందామెకి.

ఇద్దరూ ఇంట్లోకి సామాన్లు జేరవేస్తోంటే పక్క పోర్షన్లో వాళ్ళోసారి తొంగిచూసి తమ పనిలో పడిపోయారే తప్ప ఒక్కరూ పలకరించలేదు.

"ఈ గదీ ఆ వసారా మన పోర్షన్" ప్రభాకర్ చెప్పేడు.

"ఇంతేనా?!" ఆమె స్వరం వణికింది. అలబ్రద్దలవ్వడానికి సిద్ధంగా వుంది కళ్ళల్లో!

"అవును మేడమ్... ఈ గది పగలు డ్రాయింగ్‌రూమ్. రాత్రి బెడ్‌రూమ్. ఆ వసారా కిచెన్. ఆపైన వున్నాయి కామన్ కుళాయీ బాత్‌రూమూ" మడతమంచం వాల్చి కూర్చుంటూ అన్నాడు.

"ఎవరైనా గెస్ట్సు వస్తే?"

"వాళ్ళిందులోకీ మనం కిచెన్లోకి మారడవే" సింపుల్‌గా తేల్చేశాడు.

పెళ్ళిచూపులనాడు రాణి అన్న మాటలు గుర్తొచ్చాయి స్వప్నకి. సన్నగా కంపిస్తూ– "ఈ పోర్షన్‌కి అద్దె ఎంతండీ?" అనడిగింది.

"మూడొందలు... కరెంటు అదనం"

"మైగాడ్!" కూలబడింది.

"శుభం... పట్నాల మేడిపండు బతుకులింతేనోయ్. అనుక్షణం దేవుడ్ని తలచుకోవాల్సిందే– ఇరుకు ఇంట్లో, నీళ్ళపైపుదగ్గర, పాలక్యూలో. బస్టాపులో సినిమాహాలు దగ్గర - ప్రతిచోటా దేవుడ్ని తలచుకోవాల్సిందే. ఈ సాదకేంగాని ఇల్లు నచ్చిందా స్వప్నా?"

'ఛండాలం' అనబోయే మింగేసి "ఫరవాలేదులెండి" అని గొణిగింది.

"థాంక్‌గాడ్. నీకు నచ్చుతుందో లేదోనని




CLARION/B/ZP/20/173 TEL

ఒకటే ఇద్దైపోయాననుకో. ఈ రెంట్‌కి ఈ మాత్రం పోర్షన్ సంపాదించడానికెంత అవస్థ పడ్డానో చెబితే నమ్మవనుకో. అన్నట్టు త్వరగా నీళ్ళు పట్టేనుకోవాలి మళ్ళీ కుళాయి కట్టేస్తారు'' హడావిడి పడ్డాడు.

''మీరు ఆఫీసుకెళ్ళరూ?''

''ఇవాళ కూడా సెలవే. ముద్దొచ్చినప్పుడే చంకెక్కాలన్నారు పెద్దలు. ఆఫీసరు శలవివ్వడానికి ఒప్పుకున్నప్పుడే వరసగా నాలుగురోజులు వాడేసుకోవాల్తప్ప లేకపోతే ఛస్తే శలవివ్వడనుకో''

ఏదో కొత్త ప్రపంచంలోకి - తనెన్నడూ ఎరగని వూహించని ప్రపంచంలోకి వచ్చిపడినట్టుగా వూపిరాడనట్టుగా వుంది స్వప్నకి.

గదిలో మడత మంచం, అలమారలో పుస్తకాలు, గోడకి వేలాడుతూ అద్దం, వంటింట్లో కిరసనాయిలు స్టౌ, సేవండి పాత్రలు, గదిలో ఒకేఒక ఫేముకుర్చీ, ఓ పక్కన పెట్టె, దండేనికి వేళ్ళాడుతూ బట్టలు-ఇదా తను కలలు కన్న పదేపదే కోరుకున్న ఇల్లు?!

''ఈ వనవాసం ఎన్నాళ్ళో!'' నిట్టూర్చి బకెట్టు పట్టుకుని ప్రభాకర్ వెంట కుళాయివైపు నడిచింది.

★ ★ ★

ఆకలిగొన్న ఆడపులిలా ఉంది భానుమతి.

రాజారావు హైదరాబాదులో పదిపదిహేను లక్షలు ఖర్చుపెట్టి పెద్ద బిల్డింగు కట్టిస్తున్నారని ఎవరో చెప్పేరు. అప్పట్నుంచీ తలకిందులైపోతూ ఆయనెక్కడున్నదీ వెదకి పట్టుకోడానికి ఫోన్లు చేస్తూ నానా హైరానా పడిపోతోంది. ఆయన జాడ తెలీకపోయేసరికి దుఃఖం ముప్పిరిగొన మంచంమీదపడి కుళ్ళికుళ్ళి ఏడ్వసాగింది.

ఏదో చక్కని కబురు చెప్పాలని ఉత్తరం చేతబట్టుకుని ఉత్సాహంగా వచ్చిన రాణి శోకదేవతలా ఉన్న తల్లిని చూసి స్థాణువైంది.

''మమ్మీ''

''వచ్చేవా... తల్లీ మీనాన్న మిమ్మల్నీ నన్నూ అన్యాయంచేసి వెళ్ళిపోయారే తల్లీ. మనమింకెలా బతుకుతామో'' కూతుర్ని వాటేసుకుని బావురుమందామె.

''ప్లీజ్ మమ్మీ... అసలేమయ్యిందో చెప్పు''

''ఇంకేం చెప్పనే. నేను భయపడినంతా అయ్యిందే. మీనాన్న మనల్ని నట్టేటముంచి మాయమవ్వడానికి ప్లానువేశారే. చదువుమాని ఉన్నపళాన రమ్మని మీఅన్నయ్యకి ఫోన్ చెయ్యవే''

''ప్...అసలేవయ్యిందో చెప్పకుండా ఈ బుడిబుడి దీర్ఘాలేవిటి మమ్మీ'' విసుక్కుంది రాణి.

''ఇవి బుడిబుడి దీర్ఘాలుకాదే తల్లీ. తల్లిప్రేగు ఆక్రోశమే. నాగురించి నాకు బెంగలేదే. నాతనువెలాగైనా గడిచిపోతుంది. ముక్కుపచ్చలారని నువ్వూ మీఅన్నయ్యా ఏమైపోతారోననే నాబెంగంతా...''

''ఏంజరిగిందో ఏమిటో చెబుతావా లేదా?''

''ఎందుకు చెప్పనే. చెప్పి ఏడవడానికీ ఏడుస్తూ బతకడానికీ బతికున్నానే'' అంటూ కళ్ళొత్తుకుంది.

''మీముద్దుల నాన్న ఏంచేస్తున్నారో తెలుసా? ఉంచుకున్నదానికోసం హైదరాబాదులో ఇరవై లక్షలుపోసి ఆకాశమంతెత్తు మేడ కట్టిస్తున్నారే. మెల్లగా ఆస్తంతా దానికి దోచిపెట్టి దాన్తో కులుకుతారే. మన నోట్లో మన్నుకొట్టనున్నారే''

''ఓస్... అదా నీకివన్నీ ఎవరు చెప్పేరు?'' తేలిగ్గా నిట్టూరుస్తూ అంది రాణి.

''ఒకరేవిటి చాలామంది చెప్పేరు. నిజమేమిటో కళ్ళతో చూసినవాళ్ళుగనుక మన మంచి కోరేవాళ్ళు గనుక కడుపులో దాచుకోకుండా నాకు చెప్పేరు''

''గొప్పపని చేశార్లేగాని ఊరివాళ్ళందరి మాటలూ నమ్మి డాడీని అనుమానించే ముందు ఆయన్నో మాట అడగకూడదూ? నిజమేమిటో చెప్పరూ?''

''నిజం చెబుతారా? తడిగుడ్డతో గొంతుకోసే రకం! అన్ని లక్షలు పోసి అంత బిల్డింగు కట్టిస్తూ నాకు మాటమాత్రమైనా చెప్పని ఆయన...''

''నేనే చెప్పొద్దన్నాను మమ్మీ''

''ఏవిటీ! అయితే తండ్రీకూతుళ్ళిద్దరూ కలిసి ఆడుతున్న నాటకమన్నమాట! ఎంత

ఇదైనా తల్లి కాపురం కూలదొయ్యాలని చూస్తా వుటే రాణీ''

''థేంటాక్ రబ్బిష్. డాడీ నాకోరిక మేరకు మాకోసం నర్సింగ్‌హెూం కట్టిస్తున్నారు...''

''అలాగుటే... మరి వాళ్ళలా చెప్పారేమే?''

''వినేవాళ్ళుంటే ఎన్నైనా చెబుతారు''

''మరి నాకు చెప్పకుండా ఎందుకు దాచారే? నేనసలే బీపీ మనిషినని తెలుసుగా''

''మేం అంతదూరాన ఉండటం ఇష్టంలేక రాద్ధాంతం చేస్తావని''

''ఓసి పిచ్చిదానా-నిన్ను వెర్రిబాగుల్దాన్ని చేసి అదీఇదీ చెప్పి నిన్నక్కడికి తరిమేస్తున్నారే. అబ్బాయెలాగూ ఎక్కడో ఉంటున్నాడు చదువుకుంటూ. ఇక తనెలా తిరిగినా ఏంచేసినా తనకడ్డు ఉండదని మీ నాన్న పథకమే''

''నువ్వన్నీ వక్రంగా ఆలోచిస్తావు. డాడీని నేనే ఒప్పించాను సిటీలో అయితే ప్రాక్టీసు పేరూ డబ్బూ అన్నీ బావుంటాయని...వచ్చే వారం బావ వస్తున్నాడు మమ్మీ...''

''మాతల్లే... ఎంత మంచిమాట చెప్పేవ్. వచ్చే నెలలో మంచి ముహూర్తం చూసి మీఇద్దరికీ పెళ్ళిచేసి నిశ్చింతగా ఉంటానే...''

సిగ్గుల మొగ్గయ్యింది రాణి.

''అవునుగాని బేబీ-అమెరికాలో ఆడామగా పెళ్ళిపెడాకుల్లేకుండానే కలిసుంటారంట కదా''

''అదంతా వట్టిదే మమ్మీ. కిట్టనివాళ్ళలా చెబుతూంటారంతే''

''అంతేనంటావా. అల్లుడుగారు అక్కడెవర్నీ కట్టుకుని రాకుండా ఉంటే అదృష్టమే మరి'' స్వగతంలా అందావిడ.

''నీవన్నీ అనుమానాలే'' అనేసి తన గదికొచ్చేసిందన్నమాటేగానీ ఆమె మెదళ్ళో తల్లి మాటలే ప్రతిధ్వనించసాగాయి.

మమ్మీ అన్నట్టు ఒకవేళ బావ ఎవర్నైనా...!

ఛా- బావ అలాంటివాడుకాదు. తమ సఖ్యాన్ని మర్చిపోయే కృతఘ్నుడు కాదు. పైగా తనంటే చచ్చేంత ప్రేమ.

కాని— మొదట్లో అయిదారు పేజీల వుత్తరం రాసే బావ తర్వాత్తర్వాత ఒకటి రెండు పేజీలు రాస్తున్నాడంతే....

అక్కడెన్నో రకాల ఆడవాళ్ళుంటారు. ఎన్నో ఫాషన్లూ, పార్టీలూ, వీకెండ్ ప్రోగ్రాంలూ...

ఏమో! ఏంచెప్పగలం? ఏదో సినిమాలో చూపినట్టు, ఓ దొరసానితో విమానం దిగితే?!

హూఁ! చూస్తూ వూరుకోడానికి తనేమీ పౌరుషహీనురాలు కాదు. తనకి చేసిన ద్రోహానికి తగిన శాస్తి చేసి తీరుతుంది. కిరాయి రౌడీల్ని పెట్టి కాళ్ళూచేతులూ విరగ్గొట్టిస్తుంది. అతడు కుళ్ళికుళ్ళి ఏడుస్తోంటే తనివితీరా నవ్వుకుంటూ మరో పెద్ద డాక్టర్ని పెళ్ళాడుతుంది.

ఆ ఆలోచన కొంచెం తృప్తినిచ్చినా, ఏదో అసహనంగా, అసంతృప్తిగా అన్పించి, అటూయిటూ దొర్లి, శ్రీరామ్ ఫొటో చేతిలోకి తీసుకుంది.

అతడ్నీ, అతడి నవ్వునీ పిచ్చిగా చూసి ముద్దుపెట్టుకుని గుండెలోకి హత్తుకుంది.

''నువ్వు దూరమవుతావన్న వూహే భరించలేకపోతున్నాను. అది నిజంగా జరిగితే మాత్రం నేను సహించలేను బావా. నన్ను రాక్షసిగా మార్చకు, ప్లీజ్...'' అనుకుంది.

★ ★ ★

''ఆ అబ్బాయి మనకి చుట్టమే'' ఇంట్లోకొస్తూ అంది రాధమ్మ మొఖం చాటంత చేసుకుని.

''ఏఅబ్బాయే'' రికార్డు రాసుకుంటున్న అరుణ అడిగింది.

''స్వామి... మీనాన్న తరపున బంధువు. రాకపోకల్లేక దూరమైపోయాయి చుట్టరికాలు. కుర్రాడుమాత్రం రత్నం అనుకో''

రాధమ్మకీమధ్య ఒంట్లో బావోటంలేదు. తన కాలూ చెయ్యా బాగుండగానే పిల్లనో ఇంటిదాన్ని చేస్తే, హాయిగా కన్నుమూయొచ్చని ఆవిడ తాపత్రయం.

అరుణ స్నేహితురాలు స్వప్నకి పెళ్ళయిందని విన్నప్పటినుంచీ ఆమె ఆరాటం ఎక్కువయింది. కూతురి గురించి గుసగుసలు చెవినబడినప్పటినుంచీ ఆందోళన అధికమయ్యింది.

మగదిక్కు లేదు గనుక తామందరికీ లోకు

వనీ, వూరికే తాటాకులు కడతారనీ కళవళప డి, తన ప్రయత్నాలు తీవ్రం చేసింది. కొన్ని సంబంధాలు చూసింది కూడా. కానీ 'కానీ కట్నం' ఇవ్వలేదు గనుక అవన్నీ ఎండమావు లయ్యాయి. కట్నంకోరని కుదురైన కుర్రాడి కోసం వెతగ్గా స్వామి ఆవిడ దృష్టిలో పడ్డాడు.

"అతడు మంచివాడేకానీ, కొంచం బ్రాకెట్టు పిచ్చివుంది" అరుణ అంది.

"పెళ్ళైతే అన్ని పిచ్చిలూ పోతాయే. నన్నడి గితే ఆడదక్షత లేకపోతే మగవాళ్ళలాగే తయా రవుతారంటాను. కన్నతల్లి మీదా, కట్టుకున్న భార్యమీదా ఆధారపడివుంటాయే మగవారి స్వ భావాలూ, ప్రవర్తనలూ. అందుకే అంటారు మగాడు బాగుపడినా, చెడిపోయినా ఆడదే కారణమని. అంతెందుకూ నా సంగతేమ య్యిందో చూడరాదూ!" చీరకొంగుతో కళ్ళూ, ముక్కూ తుడుచుకుంది.

"గతాన్ని తవ్వుకుని లాభమేమిటమ్మా వూరుకో"

"అంతేలే... నువ్వైనా తెలివిగా ప్రవర్తించి, నీ సంసారాన్ని చక్కదిద్దుకుంటావని చెబుతు న్నాను. ఎప్పుడో అప్పగింతలనాడు చెప్పాల్సిన నాలుగు మాటలూ ఇప్పుడే చెప్పేస్తున్నాను. అప్పటిదాకా వుంటానో వుండనో అని..."

"అమ్మా!" అరుణ కళ్ళు అశ్రుపూరితాల య్యాయి.

"నిజమేనే... ఎంత ప్రయత్నించినా ఏదీ కలిసిరావట్లేదు. నాలుగక్షింతలు వెయ్యకుండానే వెళ్ళిపోతానేమోనని దిగులుగా వుంది..."

"అవేం మాటలమ్మా"

"మాటలు కాదే. కడుపు కోతలు. మీనాన్నే వుంటే... ఆమె కంఠం రుద్ధమయ్యింది.

గోడకి తగిలించిన భర్త ఫొటో అందుకుని కొంగుతో తుడుస్తూ అంది-

"ఈ ఫొటోని జాగ్రత్తగా చూసుకోమ్మా. ఎప్ప టికైనా నాకోసం గాకపోయినా, నీకోసమైనా మీ నాన్న తిరిగొస్తారు. ఎప్పుడో నువ్వింతవ్వుడు వెళ్ళేరు. నిన్ను గుర్తుపట్టగలరో లేదో. నువ్వు ఆయన్ని గుర్తించలేవు. భగవంతుడు దయద లిస్తే మిమ్మల్ని ఈ ఫొటోయే కలపాలి...."

తల్లి ధోరణికి విస్తుబోయింది అరుణ. ఎప్పు డూ పట్టుమని పదిమాటలు మాట్లాడని తల్లికి వాళేమయ్యిందో అర్థంకాలేదు.

"ప్రాణప్రదంగా దాస్తానమ్మా. నువ్వు నిశ్చింతగా వుండు. నాన్న మనల్ని వెదు క్కుంటూ తప్పకుండా వస్తారు"

అలా అంటుంటే ఆమె కనుకొనల్నుంచి రెండు కన్నీటిబొట్లు రాలిపడ్డాయి.

ఎంత చల్లనిమాట చెప్పేవు తల్లీ. నూరేళ్ళు చల్లగా వర్థిల్లు! నిజంగా నీనోటి చలవని మీనాన్న తిరిగొస్తే నిన్నప్పగించి నిశ్చింతగా కన్నుమూస్తాను.

"అమ్మా!"

"చావంటే భయమెందుకే పిచ్చిదానా. అంతా పోవాల్సిందే. కాదంటే కాస్త వెనకా ముందూ అంతే. మీ నాన్న చాలా మంచివార మ్మా. నిజంగా దేవుడనుకో. నీకేలోటూ రానివ్వ రు. నన్ను క్షమించమని చెప్పు అరుణా- నీమాట కాదనరు..."

అరుణ మాట్లాడలేదు. తల్లి మాటలామెలో ఏదో తెలీని భయాన్ని పుట్టిస్తున్నాయి.

"నువ్వు మాత్రం నీకాపురాన్ని పచ్చగా నిలు పుకోతల్లీ. మీనాన్న గుణాలు పుణికిపుచ్చుకున్న దానివి. తెలివైందానివీను. అయినా నాగోలనా దికదా. నాబిడ్డ అందరి ఆడపిల్లలకన్నా అన్నిటా ముందునిలుస్తుందన్నదే నాకు మిగి లిన నిశ్చింత. భగవంతుడు నీలాటివారిక న్యాయం చెయ్యడమ్మా. చేసిన్నాడు భగవంతు డు కాలిబూడిదైపోతాడమ్మా..."

ఆమె కంఠం వణికింది. కన్నీళ్ళు జలజలా రాలాయి.

'ఇదోరకపు నంది ప్రేలాపనకాదుకదా?' అని వణికిపోతూనే వారించసాగింది.

"అమ్మా!" భయంగా అరిచి వాటేసుకుంది అరుణ.

కాని రాధమ్మ వాక్ప్రవాహం ఆగలేదు. ఏదే దో చెబుతూనే హెచ్చరిస్తూ బుజ్జగిస్తూ ధైర్యంచె బుతూ విలపిస్తూ అనురాగం ఒకలబోస్తూనే వుంది.

ఆమాటలు వింటూ తనకి తెలీకుండానే

కన్నీరు కారుస్తూ తల్లి ఒడిలో తలపెట్టుకుని నిద్రపోయింది అరుణ.

మెలకువ వచ్చి చూసేనరికి తల్లి ఒళ్ళుకాలిపోతోంది.

★ ★ ★

ఆఫీసునుంచి వచ్చిన ప్రభాకర్‌కి టీకప్పు 'అందించింది స్వప్న.

"గుడ్... ఇల్లాలువుంటే ఇంటాయనదంతా రాజభోగమే అంటారిందుకే. ఇదివరకు ఆఫీసునుంచి వునూరుమంటూ వస్తే పలకరించే వారేవుండేవారుకాదు. ఇప్పుడు పలకరింపూ టీ ఆపైన..."

"ఇంక ఫుల్‌స్టాప్ పెట్టేసి టీ ఎలావుందో చెప్పండి"

"అమోఘం! అమృతం అనుకో"

"ఆహా— అమృతం తమరెప్పుడు త్రాగేరో"

"తొలిరాత్రినుంచీ నీ అధరామృతం త్రాగుతూనే ఉన్నానుకదా డియర్"

"ఛీపొండి— మీకు బొత్తిగా సిగ్గులేదు"

"ఆడవాళ్ళకి సిగ్గే సింగారమన్నారుగాని మగవారికన్లేదోయ్"

"మీరందురుగాన్లెండిగాని ముందర్జంటుగా ఈ సరుకులు కావాలండీ" ఓ లిస్టు అందిస్తూ అంది.

గట్టిగా చదివాడు.

"ఒక టేబుల్‌ఫాన్, ఒకటేబుల్, సోఫా, టీపాయ్, డబుల్‌కాట్ బెడ్, ప్రెషర్‌కుక్కర్, గేస్ స్టౌ, సామాన్లు పెట్టుకోడానికి ఇనుప షెల్ఫ్, టేబుల్ క్లాత్స్, డోర్ కర్టెన్స్, ఇంతేనా ఇంకా కావాలా?"

"ఇంకా చాలాచాలా కావాలండీ. ముందివి కొనుక్కుంటే ఇల్లు అందంగా వుంటుంది. ఎవరైనా వచ్చిచూసినా హంగుగా వుంటుంది. ఈ మాత్రమైనా లేకపోతే చూసినవాళ్ళు లేబర్ క్లాసనుకోరూ? తర్వాత టీవీ, స్కూటరూ, స్టీలు బీరువా, ఫ్రిజ్ మొదలైనవి కొందాం"

ఎంతో తేలికగా చెబుతోన్న భార్యవంక విడ్డూరంగాచూశాడు గుడ్లప్పగించి.

చిన్నగా నిట్టూర్చి అడిగాడు- "నాజీతమెంతో తెలుసా స్వప్నా?"

"పదకొండొందలో పన్నెండొందలో అని..."

"తెలుసుకదా- పీయఫ్‌కీ, ఇన్స్యూరెన్సుకీ, ఫెస్టివల్ ఎడ్వాన్స్‌కీ పోను చేతికొచ్చేది వెయ్యి రూపాయలు. ఇంటికీ పాలకీ వెచ్చాలకీ బస్సుకీ నెలకెంత ఖర్చవుతుందో తెలుసా? నిజంచెబుతున్నాను. అప్పుచెయ్యకుండా ఏనెలకానెల సరిపెట్టుకుంటే అదే గొప్ప. అయినా ప్రతినెలా ఎంతోకొంత మిగుల్చుకోకపోతే బట్టల ఖర్చూ, డాక్టరు ఖర్చూ, ప్రయాణాల ఖర్చూ భరించటం సాధ్యంకాదు"

తలొంచుకుంది స్వప్న. ఆమె మొఖంలో కత్తివేటుకి నెత్తురుచుక్కలేదు. కళ్ళల్లో సన్నని కన్నీటిపొర లీలగా కదుల్తోంది.!

"నిన్ను నొప్పించాలని చెప్పడంలేదు స్వప్నా. నీకు సంసారపు ఖర్చుగురించి ఒక ఐడియా లేదుగనుక నీకేదోలా అన్పించడం సహజం. కొన్నాళ్ళుపోతే అన్నీ అలవాటైపోతాయి. అలాగని ఏమీకొనననడంలేదు. వీలునిబట్టి అన్నీ కొనుక్కుందాం. ఫేన్‌ని వాయిదాలపద్ధతిలో తీసుకుందాం. ఈనెలలో ప్రెషర్‌కుక్కర్ కొనుక్కోవచ్చులే. టేబులూ, మంచంలాంటి సామాగ్రి మీవాళ్ళు పెట్టాలి. మావయ్యగారు పెట్టేవరకూ ఓపికపట్టక తప్పదు. ఇకనుంచి నెలజీతమంతా నీచేతిలో పోస్తాను. ఇక పెత్తనమంతా దేవిగారిదే. అప్పుచెయ్యాల్సిన పరిస్థితిరాకుండా చూస్తే ధన్యుడ్ని!"

చిన్నగా నవ్వేడతడు.

అతడితో శృతికలపలేకపోయిందామె.

ఆమెకళ్ళముందు తన స్వప్నలోకం ప్రత్యక్షమై మెల్లగా చెరిగిపోయింది. అంతలో రాజశేఖర్ ఇల్లూ, ఇంటిలోని ఫర్నిచరు గల దృశ్యం కదలి కరిగిపోయింది.

తనేదో వూబిలో కూరుకుపోతున్నట్టుగా వుంది. ఆకాశపు శిఖరంమీద సగర్వంగా నిల్చున్న తనసెవరో వెనకనుంచి అగాధంలోకి త్రోసేసినట్టుగా వుంది స్వప్నకి.

"ఏవిటోయ్ అలా నీరుకారి పోతున్నావ్. ఏవోకొన్ని లగ్జరీ సామాన్లు లేనంతమాత్రాన మనకేంలోటు వచ్చెయ్యలేదులే. ఈ మాత్రపు

ఆదాయం కూడా లక మాడిపోతున్నవాళ్ళు నవాలక్షమంది వున్నారు సిటీలో. సుఖమన్నది డబ్బులోనూ, సామాన్లలోనూ, కార్లలోనూ, మేడ ల్లోనూ లేదు స్వప్నా. తృప్తిలో వుంది. వున్నదాని కి తృప్తిపడుతూనే మరింతగా ఎదగడానికి మరిన్ని ఎత్తుల్ని అధిరోహించడానికి ప్రయ త్నించాలితప్ప 'అయ్యోలేదే' అని అసంతృ ప్తితో నిరాశతో కృంగిపోకూడదు- కమాన్ డార్లింగ్..." అంటూ ఆమెని కౌగిల్లోకి లాక్కు న్నాడు ప్రభాకర్.

ఆమె కళ్ళనుండి రెండు వేడి కన్నీటిబొట్లు రాలి అతడి భుజంమీదపడి చెదిరిపోవడం అతడు గమనించలేదు.



ఆ వాళంతా రాధమ్మ చలిజ్వరంతో బాధప డుతూనే వుంది. సాయంత్రానికి జ్వరం తీవ్ర మయ్యింది తప్ప తగ్గలేదు.

వున్నట్లుండి ఆమె నోటినుంచి గురగుర శబ్దం రావడంతో భయపడుతూ సమీపించి తల్లిని పిలిచింది అరుణ.

చెయ్యిఎత్తి ఏదో చెప్పడానికి విఫలయత్నం చేస్తోందావిడ. మూతివంకర్లు పోతోంది.

భయంతో వణికిపోయింది అరుణ. డాక్టర్ని పిలవడానికి గబుక్కున వీధిలో కెళ్ళిందో లేదో దేవుల్లా స్వామి కన్పించాడు.

"మా అమ్మకి రాత్రినుంచి చలిజ్వరం. ఇప్పుడసలు మాటాపలుకూ లేకుండా కట్టెలా అయిపోయింది. మీరు కొంచెం పక్కవీధిలోని డాక్టర్ని పిలుస్తారా"

"అరె అలాగా - నన్ను పిలవకపోయారా" అంటూ పరుగున వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు.

రాధమ్మని పరీక్షించాక అన్నాడు- "పక్ష వాతం వచ్చింది కుడిభాగమంతా... "

అవాక్కయ్యారిద్దరూ.

"మన ప్రయత్నించేద్దాం. కాని పరిస్థితి చూస్తోంటే కోలుకోవడం కష్టమనిపిస్తోంది..."

"అలాగనకండి డాక్టర్. ఎంత డబ్బు ఖర్చ యినా సరే... మా అమ్మని బతికించండి. మా అమ్మలేకపోతే ఒంటరివాన్నైపోతాను డాక్టర్" బావురుమంది అరుణ.

"వూరుకోమ్మా... నా శక్తిలోపం లేకుండా కృషిచేస్తానంటున్నాగా"

ఇంజెక్షన్‌చేసి మందులు రాసిచ్చి వెళ్ళిపో యాడు డాక్టర్.

అరుణకి సాయంగా వుండిపోయాడు స్వా మి.

వారికీ తమకీ మధ్య దారప్పోగులాంటి బంధుత్వం వుందనికాదు. ఆమె మీదున్న అభిమానంవల్లా కాదు. అలాంటి స్థితిలోనే అనారోగ్యంతో తీసుకుని తీసుకుని తల్లి చనిపో యినప్పుడు తనకండగా ఎవరూలేరన్న భావం అతడ్ని కట్టిపడేసింది. ఆ రకంగా తన తల్లి ఆత్మ సంతోషిస్తుందన్న పిసరంత ఆశ ఆపేసింది.

నిజానికతడు లేకపోతే శవంలావున్న తల్లిని చూస్తూ అరుణ ఒంటరిగా వుండలేక పోయేది కూడా.

రాధమ్మ ఆ రాత్రంతా యమయాతన అను భవిస్తూనే వుంది. నిరంతరం ఆమె కళ్ళు పాత జ్ఞాపకాలు గుర్తొచ్చి కాబోలు వర్షిస్తూనే వున్నాయి. అరుణనీ స్వామినీ దగ్గరగా చూ సినప్పుడు మాత్రం ఆమె కళ్ళలో మెరుపులు వెలిగాయి. ఏదేదో చెప్పాలని ఆరాటపడుతూ ఏమీ చెప్పలేక సతమతమవుతూ భర్త ఫొటోని గుండెల్లో దాచుకుని విలపిస్తూ వుందామె.

తెల్లవారటంతోనే ఆమె బతుకూ తెల్లవారి పోయింది.

భోరున ఏడుస్తోన్న అరుణని ఓదార్చడం స్వామికి సాధ్యంకాలేదు.

★ ★ ★

గన్నవరం విమానాశ్రయంలో శ్రీరామ్‌కోసం నిరీక్షిస్తున్నారు రాణీ రాజారావు దంపతులూ.

రాణి ఆంగ్లోఇండియన్లా అలంకరించు కుంది. రాజారావు సూట్‌ధరిస్తే భానుమతి పట్టుచీర ధరించింది.

"ఏవండీ... కొంపదీసి అతగాడు ఏదొర్సాని తోనో దిగడు కదా?" భర్త చెవికొరికింది భాను మతి.

"ఛా... అలాటివాడు కాదే"

"ఎవరు చెప్పగలర్లెండి. మగవారి బుద్ధులు ఆడదాని కొంగు తగిలేసరికి మారిపోతాయి. అయినా అతగాడక్కడ ఇన్నాళ్ళు మడిగట్టు కుని కూర్చున్నాడనేవిటి. ఆ దేశంలో పెళ్లీగిళ్ళీ వుండవటకదా. అంతా ఇష్టంవచ్చినట్లు హావివ రనల్లేకుండా తిరుగుతారంట కదా"

"నువ్విలాటి కాకమ్మ కబుర్లు ముందే నమ్ము తావ్"

"మీలాటి మగాడ్ని కట్టుకున్నందుకు నమ్మ కేంజేస్తానూ" నిష్ఠూరంగా అంది.

"ష్... ఎవరైనా వింటే పల్లెటూరి బగ్గిరాయ లనుకుంటారు"

కొంచెం తగ్గి అంది... "అయినా మనం అతగాడ్ని దేశం వంపించకుండా వుండా ల్సిందండీ. ఆ దేశాలు తిరిగొచ్చినవాళ్ళు బు ద్ధిగా పెళ్ళాంతో కాపురం చేస్తారనుకోను. అయినా ఈ దరిద్రపుగొట్టు సంబంధం వద్దండీ ఏ కలెక్టర్నో చూడండీ అని నెత్తీ నోరూ కొట్టుకున్నాను. వింటేగా! అయినవాడు చితికి పోయాడూ అంటూ చేరదీసి నెత్తికెక్కించుకు న్నారు. రేపెన్ని వేషాలేస్తాడో పిల్లనెంత బాధపె డతాడో తలచుకుంటే గుండె తరుక్కుపో తోంది..."

"చాలుచాల్లే... అమ్మాయి వింటుందన్న ఇంగితమన్నాలేదు" కసిరారాయన.

వారి సంభాషణ విని నవ్వుకుంది రాణి.

తనని త్రోసి రాజనడానికి బావకెన్ని గుండె లుండాలి! అసలు తననికాదంటే బతకని స్తుందా? ఇంపాజిబుల్. తన పిచ్చికానీ తన నెందుక్కాదంటాడు? తనకోసం తన ద్వారా సంక్రమించే ఆస్తికోసం తన అడుగులకు మడుగులొత్తడూ? తన చుట్టూ వుపగ్రహంలా తిరగడూ? తనని నెత్తినపెట్టుకుని పూజించ డూ?

తను అక్షరాలా రాణి!

హాయిగా నిట్టూర్చిందామె.

ప్లేన్ లేండవుతున్నట్లు ఎనౌన్స్ చేశారు ముగ్గురూ పూలదండలు చేతబట్టి మేకప్ సరిచూసుకుని అటెన్షన్లో నిలబడ్డారు.

విమానం వచ్చి ఆగింది.

ఒక్కొక్కరూ దిగుతున్నారు.

ఫుల్‌సూట్‌లో హుందాగా ఆరోగ్యంగా వున్న శ్రీరామ్‌ని చూసి ఆనందపడిపోయారంతా.

అతడ్ని చూసి ఉత్సాహతరంగమై లేచి 'హాయ్' అని అరిచింది రాణి.

అతడుకూడా దొరసాని లేకపోవడంచూసి మహదానందపడిపోయింది భానుమతి.

రాజారావు తృప్తిగా గర్వంగా చూశారు కా బోయే అల్లుడ్ని.

పూలదండలతో సాదరంగా ఆహ్వానించారు శ్రీరామ్‌ని.

"ఇవన్నీ ఎందుకు మావయ్యా. హలో రాణీ హౌ ఆర్యూ?"

"ఫైన్"

"అన్నట్టు అత్తయ్యా మీ ఆరోగ్యం బావోలే దని ఆ మధ్య రాణి రాసింది- ఇప్పుడెలా ఉంది?"

ఏనుగెక్కిందావిడ. "బానేవుంది నాయినా ప్రయాణం బాగా సాగిందా?"

"ఓ బ్రహ్మాండం. మావయ్యా! మీ ఆరోగ్యం, బిజినెస్సూ ఎలా వున్నాయ్? కాంట్రాక్టులు చేస్తున్నారా మానేశారా? ఇదివరక్కన్నా కొంచెం చిక్కినట్టున్నారు"

"డాక్టర్ కళ్లకంతా రోగుల్లానే కన్పిస్తారుగాని పదపద" ముందుకడుగేస్తూ అన్నారు రాజా రావు.

"కమాన్ రాణీ-యూ ఆర్ ఎక్స్‌ట్రీమ్‌లీ బ్యూ టిఫుల్. ముగ్ధమనోహరంగా వున్నావనుకో" ఆమె భుజం మీద చెయ్యివేసి ఆప్యాయంగా నొక్కాడు.

ఆమె గర్వంగా ఫీలయ్యింది. "నీకో గుడ్ న్యూస్, కాని ఇప్పుడు కాదు. సాయంత్రం రిసెప్షన్లో చెపుతాన్లే"

"అబ్బో-అప్పటిదాకా సస్పెన్స్ భరించడంఎలా? సీక్రెట్‌గా నా చెవిలో చెప్పెయ్. నువ్వు చెప్పినట్టే యాక్ట్ చేస్తాను"

"ఆ పప్పులేం నా దగ్గర ఉడకవ్"

"చచ్చేం"

దారి పొడవునా ఇద్దరూ ఎడతెరిపి లేకుండా కబుర్లూ విశేషాలూ చెప్పుకుంటూండటం చూసి మురిసిపోయారు రాజారావు దంపతులు.

ఇంటికెళ్లగానే రాణికోసం తను తెచ్చిన కాస్మెటిక్స్, కెమేరా ఇచ్చాడు. అలాగే అత్తమామలకూడా తెచ్చిన బహుమతిలిచ్చాడు శ్రీరామ్.

అదేరోజు సాయంత్రం హోటల్లో రిసెప్షన్ ఏర్పాటు చేశారు రాజారావు. స్థానిక ప్రముఖులూ, స్నేహితులూ, పరిచయస్తులూ కుటుంబాలతోసహా తరలి వచ్చారు.

పార్టీకొచ్చిన ఆడామగా అంతా చుక్కల్లో చంద్రుడిలా వెలిగిపోతున్న శ్రీరామ్‌నీ అతడి పక్కన తారలా మెరిసిపోతున్న రాణినీ చూసి ముచ్చటపడిపోయి 'చక్కని జంట', 'అదృష్టవుంటి' అని పొగిడేశారు.

మ్యూజిక్ కార్యక్రమం ప్రారంభమవుతుందనగా రాజారావు ఓ ప్రకటన చేశారు.

జూన్ 28న రాణీ-శ్రీరామ్‌ల వివాహమనీ, జులై పదిన హైదరాబాద్‌లో తను నిర్మించిన రాణీ నర్సింగ్‌హోం ప్రారంభోత్సవమని హర్షధ్వానాల మధ్య చెప్పి అందర్నీ ఆహ్వానించాడు.

"ఇదేనా స్వీట్‌న్యూస్?" శ్రీరామ్ అడిగాడు రాణిని.

"ఏం స్వీట్‌గా లేదా?" కొంటెగా చూసింది.

"హాట్ హాట్‌గా ఉంది తప్ప స్వీట్‌గా లేదు-నౌ ఐ వాంట్ స్వీట్"

"వెయిటర్ని పిలుస్తానుండు"

"అహహ-ఆ స్వీట్ కాదు డార్లింగ్..."

"మరి?"

"ఓ స్వీట్ కిస్ మైడియర్ మిస్"

"యూ నాటీ...!"

★ ★ ★

విషాదం, సానుభూతి మనుమల్ని దగ్గర చేస్తాయని స్వామి అరుణ విషయంలో మరోసారి రుజువయ్యింది.

రాధమ్మ అంత్యక్రియల్ని దగ్గరుండి నిర్వర్తించి అరుణకి కొండంత అండగా నిలిచాడా కష్టకాలంలో.

దానివల్ల ఇద్దరూ మానసికంగా బాగా దగ్గరయ్యారని చెప్పాలి.

అతన్లో బ్రాకెట్ పిచ్చోడ్నేగాక మంచి మనిషినీ మానవతామూర్తినీ కార్యశీలినీ దర్శించింది అరుణ. అతడి విషయంలో తను తీసుకున్న నిర్ణయానికి గర్వించింది కూడా.

ఆమెలో మంచినీ, చదువునీ మాత్రం చూసిన అతడు అంతులేని అసహాయతనీ, ఆర్ద్రహృదయాన్ని కూడా చూశాడు. తనామెని ప్రేమిస్తున్న సంగతి అరుణకి సూచాయగానూ, రాధమ్మకి స్పష్టంగానూ చెప్పేడు కూడా.

కాని నిన్నగాక మొన్న శవం వెళ్ళిన ఇంట్లో పెళ్ళి వూసెలా ఎత్తగలడు!

అందుకే "మీరిహ ఒంటరిగా ఉండటం మంచిది కాదు..." అన్నాడు.

"కాని ఆదరించగల బంధువుల్లేరు. పైపు పాసయ్యాను గనుక ఉద్యోగ ప్రయత్నాలు చేస్తాను. అమ్మ మిగిల్చిన ఆస్తి మిషన్ ఉంది కదా. మిషన్ చక్రం తిరిగినంత కాలం తిండికి లోటుండదు"

"సరే-మీకేం కావాల్సినా నేననేవాడ్ని ఉన్నానని మర్చిపోవద్దు- జాగ్రత్తనుమా"

తరచూ వచ్చి యోగక్షేమాలు విచారిస్తున్నాడు స్వామి. ఉద్యోగప్రయత్నాలు తీవ్రంగా చేస్తోంది అరుణ.

వారిని రంగుటద్దాల్లోంచి చూశారు కొందరు. వారిద్దరిమధ్యా ఏదో ఉందని ప్రచారం చేశారు. అంతవరకూ గుసగుసలు సాగిన ప్రచారం ఇప్పుడేకంగా కథారూపం ధరించింది.

గోరుచుట్టుమీద రోకలిపోటులా ఇంటి యజమాని ఇల్లు ఖాళీచేసెయ్యమన్నాడు అరుణని. ఆమెవల్ల తన ఇంటికి చెడ్డపేరు వస్తుందని అతడి భయం.

ఉద్యోగం రాగానే వెళ్ళిపోతానని ఒక్కనెల

ఓపిక పట్టమని బతిమాలగా ఒప్పుకున్నాడు మాట తప్పకూడదని హెచ్చరించి.

లోకులచూపులూ, సూటిపోటు మాటలూ, చేతుల త్రిప్పుళ్ళూ, మూతలవంకర్లూ మౌనంగా భరిస్తోంది అరుణ. నరంలేని నాలుక కూస్తోన్న కూతలు గుండెల్ని కోస్తోంటే పళ్లబిగువున భరిస్తోంది.

ఒకసారి సహనం నశించి తానూ, స్వామీ తల్లి సంవత్సరికం వెళ్లగానే పెళ్లిచేసుకుంటా మని చెప్పేసింది.

రంకునేర్చి నమ్మబొంక నేర్వదా అని నవ్వేశా రంతా!

వారి కుక్క మొరుగుళ్ళు పట్టించుకోవడం అనవసరమనుకుంది. కాని మరోగండం ఇంటి మీదకొచ్చి పడుతుందనుకోలేకపోయింది.

ఒకరోజు రాత్రి నలుగురైదుగురు తాగివచ్చి ఏదేదో పేలుతూ తలుపులు బాదేరు.

గజగజా వణికిపోయిందామె. ఇరుగుపొరుగు వచ్చి సహాయపడతారని చూసిందిగాని ఒక్కరూ రాలేదు. వాళ్ళూ భయపడ్డారేమో!

"తలుపు తియ్యవే భామా నాభామా..."

"వూరికేకాదు పిల్లా పచ్చ నోట్లిస్తాం"

"నిషాదిగిపోతోంది హుషారివ్వవే పిల్లా"

మాటలు! పాటలు! గోల! తలుపు చప్పుళ్ళు!

ధైర్యం కూడదీసుకుంది అరుణ. తనునోరు నొక్కుకుని భయపడుతూ కూర్చున్నంతకాలం వాళ్ళు మరింత రెచ్చిపోవడం భావ్యమనుకుంది. సహనాన్నిక్కూడా హద్దువుందనుకుంది.

ఒక నిశ్చయానికొచ్చి కిటికీ తలుపు తెరిచింది.

"ఓహో— ముందు బేరం సెటిల్ చేసుకుందామంటావా- అలాగే" అంటూ వచ్చేరు కిటికీ పక్కకి.

గుప్పిళ్లతో కారం తీసుకుని వారికళ్లల్లో పోసింది.

క్రిందపడి దొర్లేరిద్దరు. మిగతా వాళ్ళు రెచ్చిపోయారు. సీసాని కిటికీమీదకి విసిరేశాడొకడు. సమయానికి అరుణ తప్పుకుందిగాని లేకపోతే చాలా ప్రమాదం జరిగిపోయేది.

అంతా కలిసి తలుపుల్ని బద్దలుగొట్టడానికి సిద్ధమయ్యారు పచ్చిబూతులు తిడుతూ.

ఏంచెయ్యాలో వాళ్లనెలా ఎదుర్కోవాలో తోచ లేదామెకి.

ఇంతలో ఎవరో పోలీసులొస్తున్నారని అరిచారు. రౌడీమూక కాళ్లకి బుద్ధిచెప్పింది.

పోలీసులొచ్చి తన ఇంటిమీద దాడిచేస్తే... పెణం మీంచి పొయ్యిలోకి...

కంపించిపోయింది అరుణ.

ఒక మహిళ రెండుదశాబ్దాల పాటు ఏకఛత్రాధిపత్యంగా పాలించిన దేశంలో ఒక ఒంటరి ఆడదానికి ఇంట్లో వున్నా రక్షణలేని దౌర్భాగ్య పరిస్థితి!

"అరుణా— నేను స్వామిని. నీకేం భయంలేదు- తలుపుతియ్యి"

గబుక్కున తలుపుతీసి అతడ్ని వాటేసుకుంది. బేలగా ఏడ్చేసింది.

"పోలీసులు..."

"ఆపదలో వుండగా రావటం వాళ్లకలవాటు లేదులే- నేనే అలా గోలచేశాను"

అభినందనగా చూసిందామె.

అవాళ తన జోస్యం ఫలించి బ్రాకెట్టు తగిలింది. క్లోజింగ్ అంకెవచ్చేవరకూ వుండి మిత్రులకి టీలూ, టిఫిన్లూ ఇప్పించి వస్తోంటే అరుణ ఇంటిముందరి గలాభా చూశాడు.

"సమయానికి నేను రాబట్టిగాని లేకపోతే ఏమయ్యేదో అనూహ్యం. ఇక మీరు ఒంటరిగా వుండటానికి వీల్లేదు. మీకెప్పట్నుంచో ఓ సంగతి చెప్పాలనుకుంటున్నాను..."

"చెప్పొద్దు... మీ మనస్సు భాష నాకు తెలుసు"

"కాని మనస్సొక్కటే ప్రధానంకాదుకదా. మీరు డిగ్రీచదివారు. నేను ఇంటర్ ఫెయిలైనవాడ్ని"

"డిగ్రీలు జీతాలకి కొలమానాలేగాని జీవితాలక్కాదు"

"నాకు సరైన వుద్యోగం కూడా లేదు"

"కావొచ్చు... కూలినగోడలు కూలినట్టే వుండి

పోవు. మళ్ళీ కొత్తగోడలు లేస్తాయి. ఇద్దరిలో ఎవరికి చక్కని వుద్యోగం వచ్చినా సంసారచక్రం చక్కగా తిరుగుతుంది.

"అదృష్టలక్ష్మి వెదుక్కుంటూ వస్తే మోకాలొడ్డే దరిద్రుడ్నికాదు. కాని మీరింకోసారి ఆలోచిస్తే మంచిది" ఆమె తనింట అడుగుపెట్టిన వేళా విశేషంవల్ల బ్రాకెట్టు లక్ష్మి కరుణిస్తే కన్నుమూసి తెరచేలోగా తను లక్షాధికారైపోయి ఆమెని సుఖపెట్టడూ-- అనుకుంటూ అన్నాడు.

"బాగా ఆలోచించిగాని ఒక నిర్ణయానికిరాను. వచ్చేక మరి దానికి తిరుగుండదు. ఈనాటి నానిర్ణయం గురించి రేపు విచారించాల్సిరాదని నా విశ్వాసం. ఏమొచ్చినా చక్కదిద్దుకోగలమన్న ఆత్మస్థైర్యం నాకుంది"

ఆ మాటలకీ వాటి వెనుకనున్న ఆమె మేధకీ అబ్బురపడకుండా వుండలేక పోయాడు స్వామి.

మర్నాడు కేవలం పాతికరూపాయల ఖర్చుతో దైవసన్నిధిలో దంపతులయ్యారు అరుణాస్వామీ.

ప్రెస్సులోని పనివారూ, స్నేహితులూ వచ్చి వధూవరుల్ని నిండుమనస్సుతో ఆశీర్వదించారు. ఆ ఇద్దరిజీవితాలూ ఒక మలుపు తిరిగాయి.

★ ★ ★

ఒకటో తారీఖు సాయంత్రం ఆఫీసునుంచి వస్తూనే మల్లెపూల పొట్లంతోబాటు జీతాన్ని స్వప్నచేతిలో పెట్టాడు ప్రభాకర్.

"మీ దగ్గరే వుంచకపోయారా" మొహమాటానికందామె.

"ఏంఫర్లేదులే... ఇవాల్టినుంచి ఆర్థికశాఖ నీది. లోటు బడ్జెట్ రానివ్వకు మరి" నవ్వేడు.

"రానివ్వను... చూస్తారుగా మీకన్నా ఎంత బాగా మేనేజ్ చేస్తానో, నెలనెలా ఎన్ని ఐటమ్స్ కొంటానో"

"లేదు... ఉపవాసాలుండకుండా నెల గడిస్తే అదే పదివేలు"

"ఆ గొడవ నాకొదిలెయ్యండి. నేవచ్చి ఇరవై రోజులైనా సిటీలో ఏదీ చూడలేదు. వచ్చే ఆదివారం ఆటోలో జూ, మ్యూజియం, చార్మినార్, బిర్లామందిరం అన్నీ చూసేద్దాం"

"ఆటోమీదెళ్ళి? ఎంత ఖర్చవుతుందో తెలుసా? వంద కాగితం"

"మీ వెప్పుడు బీదర్పులే! నా ఖర్మకొద్దీ పిసినిగొట్టునిచ్చి చేశారు"

అతడా మాటలకి హర్ట్ అయ్యాడు- "పరిస్థితి అర్థంచేసుకోకుండా-"

"మీరు చేసుకున్నార్లెండిబోడి! పెళ్లానికి సిటీ చూపించడానిక్కూడా లెక్కలేసేవాళ్ళని మీరొక్కర్నే చూశాను"

"సర్లే- పెత్తనం నీకిచ్చానుగా. నీ ఇష్టం వచ్చినట్లు అఘోరించు"

ముఖం ఎర్రగా చేసుకుని మంచానికడ్డంగా పడుకుని మొఖం పక్కకి తిప్పేసుకున్నాడు.

ఇదేవిటిలా జరిగిందని విస్తుబోయింది స్వప్న. పెళ్లై రెండునెలలు కాలేదు అప్పుడే కీచులాటలు... ఇదా తను వూహించుకున్న సంసారం? అయినా తనే అనవసరంగా నొప్పించింది. ఆచితూచి ఖర్చుపెట్టమంటే తనింకోరకంగా అర్థం చేసుకుని...

"సారీ అండీ... కోపం వచ్చి ఒళ్ళు తెలీక వాగేశాను"

తలత్రిప్పి చూశాడు.

అందమైన ఆమె ముఖం దయనీయంగా కన్పించింది. విషాదరేఖలు, అమాయకత్వమూ పోటీపడుతున్నట్లన్పించింది.

అతడి కోపం మంచులా కరిగిపోయింది.

కొత్తగా పెళ్లై వచ్చిన భార్యకోరిన చిన్నచిన్న కోరికల్ని కూడా తీర్చకుండా కోప్పడటం ఏంసబబు అని పశ్చాత్తాపడ్డాడు.

"నేనూ తొందరపడ్డాన్లే. నీ సరదాల్నీ కోరికల్నీ నేనుగాకపోతే ఇంకెవరు తీరుస్తారు చెప్పు? రేపు పిల్లల ఝంఝాటం తయారయ్యాక ఎలాగూ ఖుషీ చెయ్యలేం. ఈ వారమే వెళ్ళి సిటీ అంతా చూసేద్దాంలే"

"ఒక్కసారే చూసి చేతిలోవున్నదంతా అవ్వగొట్టుకోవడం ఎందుకులెండి. సిటీ బస్సు మీదెళ్ళి ఒకటొకటి చూసేద్దాం"

"అయితే కోపం పోయినట్టేనా? ఓసారి

నవ్వాలి... ముత్యాల జల్లు కురిసినట్టు నవ్వాలి...''

''ఏం? ఏరుకుందామనా?'' నవ్వుతూ అంది.

''ఏరుకుని ముత్యాలరావుని అవుదామని''

''మీరెంత మంచివారో'' అమాంతం ముద్దు పెట్టేసుకుంది.

అనుకున్న ఆదివారం రానే వచ్చింది.

చక్కగా తయారైన స్వప్నని చూసి రెప్ప వెయ్యడం మర్చిపోయాడు ప్రభాకర్.

''వీనస్‌లా మూర్తీభవించిన సౌందర్యంలా వున్నావు స్వప్నా''

''నేను మామూలు స్త్రీని కాదు అప్సరాంగిని'' అన్నట్టుగా నవ్వింది. ''నాలాంటి దేవత దివినుంచి దిగి రావటం మీ అదృష్టం, మీ తపఫలం అని గ్రహించి నన్నారాధించండి. నా స్వప్నలోకాన్ని నిజం చెయ్యండి'' అన్నట్టుగా చూసింది.

''నీ అందాన్ని త్రాగుతూండి పోవాలని వుంది''

''తీరిగ్గా త్రాగుదురుగాని ముందు పదండి''

చెట్టాపట్టాలేసుకుని బస్టాపు దగ్గరికెళ్ళారు. డబుల్ డెక్కర్ ఎక్కేరు. పైనుంచి క్రింది



దృశ్యాల్ని వింతగా గర్వంగా చూస్తుండిపో యిందామె.

టాంక్‌బండ్ మీద బస్సు దిగారు.

సూర్యుడు డ్యూటీ ముగించుకు వెళ్ళిపోడా నికి సిద్ధపడుతూనే ఓసారి టాంక్‌బండ్ మీది అమ్మాయిల్ని చూసి పోదామని కాబోలు ఆగా డు. అతడి దృష్టినాకర్షించాలని కాబోలు పిల్ల గాలి పిల్లిమొగ్గలేస్తోంది.

ఆ ఇద్దర్నీ పట్టించుకోగల తీరిక లేదు అక్కడ చేరిన జంటలకి.

చిన్నకార్లలో స్కూటర్లమీదా బస్సుల్లో ఎంద రో ఆడామగా పిల్లా పాపా వస్తున్నారు. వారిలో జంటలే ఎక్కువగా కన్పించారు స్వప్నకి.

వారినీ, వారి వాహనాలనీ, వారు కట్టుకున్న వస్త్రాలనీ, ధరించిన నగలనీ, వారి ఫాషన్లనీ, వారి సంతోషాన్నీ చూస్తూ వాళ్ళెంత అదృష్ట వంతులోనని మధనపడింది స్వప్న. తనూ వాళ్ళలా తలెత్తుకుని తిరగ గలిగినరోజు ఎప్పు డొస్తుందో కదాని తపన పడింది.

"ఏవిటి స్వప్నా... ఏవిటాలోచిస్తున్నావ్?"

"ఆ స్కూటర్లమీదా కార్లలోనూ వచ్చేవాళ్ళ ంతా లక్షాధికార్లేనంటారా?"

"వాళ్ళూవుంటారు- ఆఫీసర్లూ బిజినెస్ మెన్ వారి పిల్లలూ అన్నిరకాలవాళ్ళూ వుంటా రు"

ఐస్‌క్రీమ్ కొన్నాడు ఇద్దరికీ.

"మీకు ప్రమోషన్ ఎప్పుడొస్తుందండీ" వున్నట్టుండి అడిగింది.

"ఈ ఏడాది రావొచ్చు. మా ఆఫీసులో కొన్ని సెక్షన్లు పెంచుతున్నారు"

"అబ్బ- ఇంకో అయిదారునెలల్లో ఆఫీసర్రై పోతారన్నమాట. జీతం మూడువేలు వస్తుందా? కారు ఇస్తారా?"

ఆమె పరమానందాన్ని విస్మయంగా చూశా డు.

"ఆఫీసర్నవుతానని ఎవరు చెప్పేరు?"

"ఒకరు చెప్పేదేమిటి? ప్రమోషన్ వస్తే అవ్వరా?"

"అవుతాను- కానిప్పుడు కాదు. ఇప్పుడు యూడీసీనవుతాను. ఏడెనిమిదేళ్ళకి సూప రింటెండెంటు. ఆ తర్వాత రిటైరయ్యే ముందు ఆఫీసర్రైతే అవుతాను"

మూర్ఛపోబోయి నిలదొక్కుకుంది. "ని... నిజమా(...?" కంపిస్తూ అడిగింది.

తలాడించాడు అపరాధభావనతో. ఆమె కళ్ళల్లో కన్నీటిపొర కదలటంచూసి కృంగిపో యాడు.

పెళ్లైన మరుసటిరోజునుంచీ కూడా ఆమె ఆశలూ, ఆకాంక్షలూ గమనిస్తూ ఆమెనర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆమె అక స్మాత్తుగా గొప్పవాళ్లయిపోయి ప్రపంచంలోని సౌఖ్యాలన్నిట్నీ జుర్రేసుకోవాలని ఆశిస్తూ కల లుకంటూ స్వర్గానికి నిచ్చెన్లు వెయ్యజూసే వూహాజీవి అని ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నాడు. అందువల్లే ఆమె వాస్తవికతతో రాజీపడలేక అసంతృప్తితో కుళ్ళిపోతోందని గ్రహించి నిట్టూర్చాడు. ఆమె ఆశల్ని నిజం చెయ్యలేని తన అసమర్థతకి సిగ్గుతో చితికిపోతున్నాడు ప్రభాకర్!

"మీరేమైనా పరీక్షలకి కట్టి పాసైతే త్వరత్వ రగా ప్రమోషన్లొచ్చి ఆఫీసర్రై పోవచ్చా?" ఏదో గుర్తురాగా అడిగింది.

పేలవంగా నవ్వాడు.

"ఎక్కౌంట్స్ పరీక్షలు పాసవ్వొచ్చు. యమ్మే చెయ్యొచ్చు. లా చదవ్వొచ్చు. కాని డిగ్రీల దారి డిగ్రీలదే ప్రమోషన్ల దారి ప్రమోషన్లదే. ఒక ఆఫీసరు రిటైరైతే తప్ప మరొకరికి ప్రమోషన్ రాదు. అదైనా సీనియారిటీనిబట్టి ఇస్తారు"

ఆమె వుత్సాహమంతా చప్పగా చల్లారిపో యింది. ఏడుపు తన్నుకు రాబోతోంటే నిగ్ర హించుకుంటూ "బోర్‌గా వుంది. వెళ్ళిపోదాం" అంటూ లేచింది ~~ తిన్న ఐస్‌క్రీమ్‌ని విసిరేస్తూ.

"అంతా బోర్ కొట్టినప్పుడే ఇక్కడికొస్తారు..."

అతడి మాటలు పట్టించుకోకుండా బస్టాపు వైపు నడిచింది.

తన గుండెల్లో బ్రద్దలవుతోన్న బడబాగ్నుల గురించి అతడికెలా ఏమని చెప్పగలదు? మీ గుమాస్తాగిరి వుద్యోగాలంటే మీ బదుగు బతు కులంటే మీ నత్తజీవితాలంటే తనకసహ్యమని

ఎలా చెప్పగలదు? తను స్వర్గంనుంచి నరక కూపంలోకి జారిపడి వూపిరాడక విలవిల్లాడుతున్నానని ఎలా చెప్పగలదు?

మౌనంగా అనుసరించాడు ప్రభాకర్.

★ ★ ★

హైదరాబాద్‌లో ప్రారంభించబోయే నర్సింగ్ హోమ్‌కి కావాల్సిన సరంజామా ఏర్పాటు చేసుకునొచ్చాడు శ్రీరామ్.

"హల్లో- వచ్చేవా రామ్. నీకోసం ఎదురుచూస్తోంటే నాకళ్ళు కాయలు కాశాయి తెలుసా?" బుంగమూతి పెట్టింది రాణి.

"పువ్వులు కన్పిస్తున్నాయిగాని కాయలెక్కడా కన్పించడంలేదే" ఆమె కళ్ళల్లోకి చూస్తూ నవ్వేడు.

"డాక్టర్లతో వచ్చిన చిక్కే ఇది"

"సారీ సారీ... సరదా కన్నాన్లేగాని అలా షికారుకెళ్ళొద్దాంపద"

"ఒన్ మినిట్..."

ఫాషన్ మేగజైన్లోని డిజైన్‌ని చూపించి కుట్టించిన మినీస్కర్ట్ పైపు డ్రెస్ ధరించి కాస్త అతిగా అలంకరించుకుని వచ్చింది రాణి.

ఆమెవంక అదోలా చూస్తూ- "చీరలోవున్న అందం ఇంక దేన్లోనూ వుండదు రాణీ" అన్నాడు.

"అమెరికా వెళ్ళొచ్చినా నీ టేస్ట్ మాత్రం అమ్మమ్మలదే" అంటూ గట్టిగా నవ్వేసింది.

మరి రెట్టించలేదతడు.

కారు స్టార్ట్‌చేస్తోంటే అంది "ఎక్కడికి వెళ్దాం... క్లబ్బుకా?"

"కాదు- ప్రకృతిని దర్శించడానికి"

"భలే జోక్. ప్రకృతిని చూసేదేమిటి?"

"నీ మనస్సునడిగిచూడు"

"నీరస వాతావరణం నాకునచ్చదుబాబూ" టేప్‌రికార్డర్ ఆన్‌చేసింది. పాశ్చాత్య సంగీత ఝరి వారిమీదకురికిందొక్కసారి.

"ఓహ్... ఈగోల వినీవినీ చెవులు దిమ్మెక్కిపోయాయి" అంటూ ఆఫ్‌చేసి "శాస్త్రీయ సంగీతపు కాసెట్లు లేవా?" అనడిగాడు.

"ముసలాళ్ళ టేస్టులు మనదగ్గరుండవు"

"పోనీలేగాని ఏమైనా కబుర్లు చెప్పు. కాలేజీ గురించీ, ఫ్రెండ్స్ గురించీ"

"ఫ్రెండ్స్ అంటే గుర్తుకొచ్చింది. నా ఫ్రెండ్ అరుణలేదూ- అది ఆఫ్టాల్ ఓ ప్రెస్‌వర్కర్ని పెళ్ళిచేసుకుంది. అందగత్తెనని మురిసే స్వప్న గర్వమూ అణిగిపోయిందిలే. దాని మొగుడు టైపిస్టు..."

"స్నేహితుల గురించి అలా హీనంగా మాట్లాడకూడదు రాణీ"

"ఏంస్నేహితుల్లెద్దూ. నాకూడా తిరిగితే గొప్పవస్తుందనీ, చిరుతిళ్ళు దొరుకుతాయనీ వచ్చినవాళ్ళేగానీ సిసలైన ఫ్రెండ్స్‌కాదు"

"అది మన దృక్పథాన్నిబట్టికూడా వుంటుందిలే"

"అదేమిటి?"

"అది నీకర్థంకావడానికి టైమ్‌పడుతుందిలే. అరుణా, స్వప్నా నీక్లోజ్ ఫ్రెండ్సని లెటర్స్‌లో రాశావుకదా"

నాలికకరుచుకుందామె. "వాళ్ళు ఫ్రెండ్సేలే..."

"పాపం అరుణకి సరైన భర్త దొరకలేదన్నమాట"

"గంతకి తగ్గ బొంత"

"మన నర్సింగ్‌హోంలో పనిచెయ్యడానికి నమ్మకమైనవాళ్ళు కావాలికదా. వాళ్ళిద్దరికీ వుద్యోగాలిద్దాం. ఆరకంగా నీ ఫ్రెండ్స్‌కి చేయూతనిచ్చినట్లవుతుంది"

"నేలకి పోయేది నెత్తికి రాసుకోవడం ఎందుగ్గానీ- ఇటెక్కడికి రామ్. ఊరి బయటికి ఎందుకు?"

"చెప్పేనుగా ప్రకృతి..."

"బోర్!"

"త్వరగా వెళ్ళిపోదాంలే"

నిర్మానుష్యప్రదేశంలో కారునాపాడు శ్రీరామ్.

ఒకపక్కన ఎత్తయిన కొండలు. మరోపక్కన మామిడితోటలు. మధ్యన సరస్సు. సరస్సులో కలువలు. కొండలమాటున అస్తమిస్తోన్న సూరీడు. పక్షుల కిలకిలా రావాలు. ఆహ్లాదంగా వీస్తోన్న గాలి, పైన నీలాకాసం.

"ఓహ్... ఎంతబావుంది! ఎంత ప్రశాంతంగా, పారవశ్యంగా వుంది" విహరిస్తూ అన్నాడు.

"చాన్నాళ్ళకి చూసినందున అలా అన్పిస్తోందిగాని ఇందులో అందమేముంది రామ్" అయిష్టంగానే అతడితోబాటు తిరుగుతూ అంది.

"అందాన్ని కళ్ళతో కాదు మనస్సుతో చూడాలి"

"ఒక్కోసారి నీ భాష అర్థంకాదురామ్"

ఆగి ఆమెవంక చూశాడు- "ప్రయత్నించు"

"అంత ఓపిక లేదుగాని అమెరికా కబుర్లు చెప్పురామ్. అక్కడన్నీ హైబిల్డింగ్సేనటకదా. రోడ్లు అద్దంలా వుంటాయిట. అన్ని పనులూ మెషీన్లే చేస్తాయిట. కార్లు చాలా స్పీడుగా నడుపుతారట..."

"అక్కడంతా మెకానికల్ లైఫ్. ఎప్పుడూ బిజీ బిజీ. తన గొడవ తప్ప పక్కవాడి గోల కూడా పట్టదు. ఒకరకంగా ఒంటరిబతుకులనుకో. ఎన్నో సౌకర్యాలున్నా అవి మానవ సంబంధాల్ని అంతకంతకీ తుంచేస్తున్నాయని చెప్పాలి. ఆ సంస్కృతీ, ఆ వాతావరణం నాకు నచ్చలేదురాణీ. మనకోసం చెమ్మగిల్లు నయనమూ, మనకోసం తపించే హృదయమూ లేకపోతే బతుక్కి అర్థంవుండదుగదా"

అయోమయంగా-కించిత్తు పిచ్చిగా చూసింది. అమెరికాలో అన్నాళ్ళువున్నవాడు రాంబోలా డేరింగ్‌గా డేషింగ్‌గా మేన్లీగా ప్రవర్తించక ముసలమ్మకబుర్లు చెబుతాడేమిటీ అనుకుంది. పేదింటివాళ్ళకి గొప్పింటి బుద్ధులు త్వరగా రావనుకుంది. అతణ్ణి తను బాగా మార్చాలనుకుంది.

"ఇంక వెళ్దాం రామ్..."

"అంత తొందరెందుకు? ఈ వాతావరణం నచ్చలేదా? అసలీ పచ్చని ప్రకృతిమధ్య పట్టుచీర కట్టుకుని వయ్యారంగా మయూరంలా నువ్వు నడిస్తే దివినుండి భువికి దిగివచ్చిన గంధర్వకన్యకాబోలని నేను పులికించిపోతూ నిన్ను గాఢ కౌగిలిలో బంధించి నీ అధరాలని చుంబించి అమృతపానం చేసి అమరలోక విహారం చెయ్యనారాణీ..."

ఆమె చుబుకాన్నెత్తి పట్టుకుని ఆమె కనురెప్పల మీద తమకంగా చుంబించాడు. "ఐ లైక్యూ... ఐ లవ్యూ... ఐ లివ్ ఫర్ యూ రాణీ..."

మైమరచిపోయింది. వెన్నలా కరిగిపోయి కౌగిల్లో ఇమిడిపోయింది.

తననతడు పొగిడాడనుకున్నందున కాబోలు ఆమె గుండెలు తృప్తితో ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతున్నాయి.

కొన్ని నిమిషాలు కరిగిపోయాయి.

చిర్నవ్వు నవ్వుకుంటూ విడిపోయి కారువైపు నడిచారిద్దరూ.

"చక్కని తెలుగుసినిమా చూద్దాం. ఫామిలీ టైపు సెలక్టుచెయ్యి రాణీ"

"సినిమాహాలుకి వెళ్ళి చూద్దామా?"

"ఊఁ... ఏం?"

"అలగాజనంతో కూర్చుని చూడాల్సిన ఖర్మ మనకేమిటి. వీసీపీ వుందిగా. ఇంట్లో మహారాజులా చూద్దాం. బ్రహ్మాండమైన ఇంగ్లీష్ ఫిల్మ్ కేసెట్స్ వున్నాయి రామ్. ఇంగ్లీషు యాక్టర్ల స్టైలూ, యాక్షనూ టెక్నిక్కూ-ఓహ్ అద్భుతమనుకో. తలకిందులుగా తపస్సుచేసినా మనవాళ్ళకి రావవి"

ఆమె ధోరణి తెలుసుగనుక చక్కని కుటుంబగాథా చిత్రం చూడాలన్న కోర్కెని అణిచేసుకున్నాడు శ్రీరామ్.

"అన్నట్టు చెప్పడం మరిచాను రామ్... డాడీ మనకోసం మారుతీకారు కొంటున్నారు"

"ఐసీ-నీకు డ్రైవింగ్ వచ్చుకదూ?"

"నాస్కిల్లేమిటో ఇప్పుడే చూపిస్తాను" డ్రైవింగ్‌సీట్లో కూర్చుంటూ అంది.

"చీకటిపడుతోంది... ఇప్పుడొద్దులే"

"భయపడకు రామ్. అమెరికా రోడ్లమీద కూడా సేఫ్టీగా డ్రైవ్ చేసేగల్ను..."

మరివద్దన్నా వినదని తెలుసు గనుక వూరుకుండిపోయాడు.

కారునామె ఆఘమేఘాల మీద పరిగెత్తించడం చూసి "రాణీ- ప్లీజ్- అంత స్పీడొద్దు....." అంటూ వారించాడు.

కానీ ఆమె విన్లేదు. మరింత వేగం

పెంచింది.

"సీ రామ్... హౌ ఈజ్ మై డ్రైవింగ్"

ఫోజుకొట్టింది. కానింతలో ఆమె వూహించనివిధంగా పక్క రోడ్లోంచి మోటారు సైకిలొచ్చింది. అమ్మయ్యో అనుకునేంతలో ఆమెకారు వెళ్ళి మోటారుసైకిల్ని గుద్దేసింది.

కెవ్వున కేకేసి మూర్ఛబోయింది రాణి.



"ఏమండీ... అలమార్లో బ్యాంకు చలానా, డబ్బు వుంటాయి చూడండి. ప్రెస్‌కి వెళ్తూ వెళ్తూ బ్యాంకులో జమకట్టండి" వంటింట్లోంచి అంది అరుణ.

"అలాగే- నువ్వేమైనా పరీక్షలకి కడుతున్నావా?"

"నేనుకాదు మీరే కడుతున్నారు" చీర కొంగుతో చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

"నేనా?!" నిర్ఘాంతపోయాడు.

"అక్షరాలా మీరే. ఇంకా ఎన్నాళ్ళా ప్రెస్‌లో అరవచాకిరి చేస్తారు? పరీక్షలు పాసైతే కాస్త మంచి వుద్యోగం సంపాదించుకోవచ్చుగా"

"అదిసరేగాని కాలేజీ మానేసి నాలుగేళ్ళయ్యాక ఇప్పుడేం చదవగలను- నామొఖం!

"ఇంటర్లో మీకు మిగిలిందల్లా ఇంగ్లీషే కదా. కొన్ని నోట్సులు కూడా సంపాదిస్తున్నానండి"

"ఇంగ్లీషులో నేననలే పూర్. పరీక్షలకింక మూడునెలల టైమ్ కూడా లేదు. ఫీజు దండుగ తప్ప వుపయోగముండదు. నన్ను ఇబ్బందిపెట్టకు అరుణా"

"మీరలా అంటే ఎలా. మహా మహా డిగ్రీలున్నవాళ్ళే రోడ్లని సర్వే చేస్తూ తిరుగుతున్నరోజులివి. మీరు ఇంటర్ కూడా పాసవ్వకపోతే ఎలాగండీ? మీకిప్పుడు గాభరాగా అన్పించొచ్చుగాని చదవటం మొదలుపెడితే అంతా తేలికే అన్పిస్తుంది. మీరింకేం అడ్డుచెప్పక ఫీజు కట్టేయ్యండి- మిమ్మల్ని పరీక్షకి తయారు చేసి పాసయ్యేట్లు చూసే బాధ్యతనాది... సరేనా?"

స్వామి మరి మాట్లాడలేకపోయాడు.

ఆమె తనమీదెంతో నమ్మకంతో గట్టిగా చెబుతోంటే కాదన్లేకుండా వున్నాడు. పైగా ఒకప్పుడు తనని చదివించేవారు లేరే అని విలపించాడు. ఇప్పుడు అవకాశం వెదుక్కుంటూ వస్తే వదులుకోవడం అవివేకమన్పించింది.

అసలామెకీ ఆలోచనెందుకొచ్చిందో! ఏ పుట్టలో ఏపాముందో ఎవరికి తెలుసు? రేపేం జరిగినా జరగొచ్చు!

నిజానికి అరుణని పెళ్ళిచేసుకున్నాక తన జీవితగమనమే మారిపోయింది. ఎన్నడూ ఎరుగని ఆప్యాయత, ఆదరణా చవిచూస్తున్నాడు. గంజిఅన్నంతో కడుపు నింపుకోవాల్సిన అగత్యం తప్పింది.

వీటినిమించి తన బాగుకోరుతూ అనుక్షణం వేయికళ్ళతో కనిపెట్టుకుని చూసే దేవత లభించింది. ఆమె తనజీవితంలో ప్రవేశించడంతో తనపద్ధతి... కాదు తనే మారిపోయాడు. ఇదివరకట్లా బక్కనాగన్నలా లోతుకుపోయిన కళ్ళతో లేడు. ఆరోగ్యంగా హుషారుగా వుంటున్నాడు.

'పెళ్లయ్యాక గురుడు పూలరంగడైపోయాడు' అని ప్రెస్‌లో చెప్పుకుంటున్నారంటే తన దశ తిరిగిందని తెలీడంలేదూ?

అందుకని అరుణ చెప్పినట్టు ఇంటర్ పరీక్ష రాస్తే మంచిది. ఆమెకూడా ఎంతో సంతోషిస్తుంది. తనకోసం ఇన్నిచేస్తున్న ఆమెకోసం ఈమాత్రం చెయ్యలేడా?

"అలాగే అరుణా... నీపట్టుదల చూస్తోంటే నాకూ పరీక్షరాయాలనే అన్పిస్తోంది"

ఆకాశం అందినంత సంబరపడిపోయిందామె- "మీరెంత మంచివారండీ" అంది.

ఆమె కళ్ళలో వెలుగుల్ని విరజిమ్ముతున్న ఆనందజ్యోతుల్ని చూసి ఆశ్చర్యపోతూనే సంతోషించాడు.

"ఇకనుంచీ డ్యూటీ అవ్వగానే ఇంటికొచ్చేయండి. రోజుకో గంట చొప్పున చదవాల్సిందే"

"అలాగే... నీమాట కాదనగలనా- చెప్పు?"

"నామాట మీమాట అనికాదు ఎవరిది మంచి మాటైతే అదివినాలి మనం"

"అలాగే" చొక్కాతొడుక్కుంటూ అన్నాడు.

"ఇవాళ పదిహేనోతారీఖు కదూ- మీకు జీతాలిస్తారనుకుంటాను"

"ఇస్తారు... ఏమైనా కొనితేవాలా?"

"రేపు ఏకంగా అన్నీ కొందాంలెండి"

"సరే"

బ్యాంకులో డబ్బుకట్టేసి ప్రెస్సుకెళ్ళేడు.

సాయంత్రం డ్యూటీ అయిపోయాక మిగిలిన వర్కర్స్‌తోబాటు యజమాని గదిలోకెళ్ళాడు స్వామి జీతంతీసుకోడానికి.

మిగిలినవాళ్ళు జీతాలు తీసుకొంటోంటే అతడు మాత్రం అక్కడున్న వీక్లీ తీసుకొని 'వారఫలాలు' కాలమ్ తిరగేశాడు. అతడు ప్రతివారం విడవకుండా వాటిని చూస్తుంటాడు. తన భవిష్యత్తు గురించి ముందే తెలుసుకోవాలని చాలామందిలానే అతడికీ ఆతృత !

చూస్తున్నవాడల్లా వులిక్కిపడ్డాడు. కళ్ళు నలుపుకుని మళ్ళీ చూశాడు.

ఆకస్మిక ధనలాభం!

అంటే బ్రాకెట్టులో మహాలక్ష్మి కరుణిస్తుందన్నమాటే!

అతడి గుండెల్లో ఆనందాశ్వాలు కదనుతొక్కాయి.

జీతం అందుకుని బయటికొచ్చాడు- హుషారుగా ఈలవేసుకుంటూ.

జేబులో డబ్బు పెట్టుకుంటుంటే బ్యాంకులో చెల్లించిన చలానా తాలూకు కౌంటర్ ఫాయిల్ తగిలింది.

అతడి హృదయం ఆర్ద్రమయింది.

తనకోసం-తన ఉన్నతికోసం ఎంతగా తపిస్తోంది అరుణ! ఏ జన్మలోని అనుబంధమో ఇది! తన జీవితపథాన్నే మార్చేస్తోన్న ఆదేవతకి-ఆ అమృత హృదయికి తిరిగి తనేం చేయగలుగుతున్నాడు? ఏమీలేదు!

నిట్టూర్చాడు.

జీతంలోంచి పదో పరకో తీసి బ్రాకెట్టు ఆడితే? తగిలితే చీరకొని బహూకరించొచ్చు. అరుణకి తెలీకుండా పైడబ్బులొచ్చినప్పుడల్లా బ్రాకెట్టు ఆడుతూనే ఉన్నాడుగాని ఈమధ్య అంతగా కలిసి రావట్లేదు. ఎవరో అన్నట్లు ఇలా దెబ్బతీసి తీసి పరీక్షించి పరీక్షించి ఒక్కసారే కటాక్షించొచ్చు. అంతవరకూ ఓపిగ్గా తను నిరీక్షించాలంతే!

"తగిలింది...తగిలింది..."

ఆలోచిస్తూ నడుస్తోన్న స్వామి అదిరిపడి చూశాడు.

లాటరీ పిచ్చోడు! ఏవో కాగితాలు చూసుకుంటూ అరుస్తున్నాడు!

"లాటరీ తగిలింది. లక్ష...లక్ష వచ్చేసిందిరా. నేను లక్షాధికార్ని. అష్టాష్ట...లక్షాధికార్ని...ఆ... మేఘాలయ తగిలిందిరా వెధవా-ఒక కోటి...కోటి రూపాయలు తగిలిందిరా...కోటీశ్వరుణ్ణిరా... కోటీశ్వణ్ణిడ్ని...డబ్బు...నోట్లు...అంతా డబ్బే...డబ్బే..."

గబగబా రోడ్డుమీది కాగితం ముక్కలన్నీ భుజానికి తగిలించుకున్న చిరుగుల సంచిలో కుక్కుకోసాగాడు!

కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టన్పించింది స్వామికి.

గబగబా అతణ్ణి దాటేశాడు.

నర్సింములు కిళ్ళీబడ్డీ దగ్గరాగాడు. అటూ ఇటూ ఊగిసలాడి వెళ్ళి బ్రాకెట్ చార్ట్ అందుకున్నాడు. ఎన్నడూ లేనిది రెండురకాలుగా లెక్క వేసినా ఒకే అంకె వచ్చింది.

వారఫలాలు గుర్తొచ్చాయి.

తన జాతకం మారబోతోంది! ఈ అవకాశాన్ని చేజార్చుకోకూడదు! వందరూపాయలు కాసేస్తే? ఎనిమిది వేల రూపాయలు- రేపు తెల్లారేసరికి తన చేతిలో ఫెళఫెళమని వెలుగుతాయి!

కాని...అరుణ...!

తన గురించేమనుకుంటుందో? ఓవక్కన షార్ట్‌హేండ్ నేర్చుకుంటూనే మిషన్‌మీద బట్ట లు కుట్టీ, ఎంబ్రాయిడరీ చేసీ పైసాపైసా కూడబెడుతోంటే తనిలా జూదమాడటం సబ బేనా?

నిజమేకాని చూస్తూ చూస్తూ ధనలక్ష్మినెలా కాదనగలడు. వారఫలాల్లో ఆకస్మిక ధనలాభ మని స్పష్టంగా రాశాక...పైగా వచ్చిన డబ్బంతా తమకోసమే ఉపయోగిస్తాడు కదా!

మరేమీ ఆలోచించకుండా 'రెండూ మూడు' మీద వందరూపాయలు కాసేశాడు.

"ఏంటి గురూ... నెంబరు తెలిసిపో యిందేంటి. పెళ్లయ్యాక సీన్తారే మారిపో యింది"

నర్సిములు మాటలకి నవ్వొచ్చేశాడు.

పూర్తి జీతం జేబులో లేకుండా ఇంటికెళ్ళి అరుణకి మొఖమెలా చూపించగలడు? డబ్బే మైందని ఆమె అడిగితే జవాబేం ఇవ్వగలడు?

ఊహూ-ఏమైనా ఆమెకి తెలీనివ్వకూడదు. అంటే ఇప్పుడింటికెళ్ళకూడదు. ఈ రాత్రికెలా గోలా ఎక్కడో అక్కడ గడిపేసి రేపు ఎనిమిది వెలా తీసుకెళ్ళి ఆమెని ఆశ్చర్యంలో ముంచె త్తెయ్యాలి!

ఫస్ట్ షో సినిమాకెళ్ళాడు. అతడి దృష్టి సినిమా మీదలేదు. మాటిమాటికీ బయటికెళ్ళి ఓపెనింగ్ అంకె వచ్చిందేమో కనుక్కుంటూనే ఉన్నాడు.

ఎట్టకేలకు అంకెవచ్చింది.

అయిదు!

స్వామి కళ్ళు గిర్రునతిరిగాయ్. పడబోయి నిలదొక్కుకున్నాడు.

గుండెలు బద్దలైపోతున్నాయి. చెవుల్లో రించలేనంత హోరు. కన్నీళ్ళు వర్షంలా కురుస్తున్నాయి.

పాతిక లంఖణాలు చేసినవాడిలా అయిపో యాడు.

తనెంతో శ్రమతో శ్రద్ధతో కట్టుకున్న ఆశాసౌ ధాలన్నిట్నీ తనకళ్ళెదుటే పునాదుల్తో పెక లించి శకలాల్ని దూరంగా విసిరేసినట్టు తల్ల డిల్లిపోయాడు.

ఇంటికెళ్ళడానికి మనసొప్పలేదు. అరుణ మొహం మళ్ళీ జన్మలో చూడలేనన్పించి విల పించాడు. గుండెల్ని వ్రక్కలు చేస్తోన్న బాధని భరించడం ఎలాగో తెలీలేదు.

ఆలోచిస్తూ ఆక్రోశిస్తూ అడుగులేస్తోంటే బ్రాందీషాపు కళకళలాడుతూ కన్పించింది.

ఓసారో మిత్రుడు తన పెళ్లి సందర్భంగా ఆ షాపులోనే బ్రాందీ ఇప్పించాడు తనకి. కొంచెం తాగేసరికి మరేమయ్యిందోగాని భళ్ళున వాంతి చేసుకున్నాడప్పుడు.

ఇప్పుడు మళ్ళీ తాగితే? ఈ నరకయాతన మర్చిపోవడానికదే సరైన మందు!

మరేమీ ఆలోచించకుండా లోపలికి నడిచా డు స్వామి.

★ ★ ★

రాణికి పెద్దగా దెబ్బలు తగల్లేదు. కాని అతిగా భయపడిందేమో రెండ్రోజులుగ్గాని కో లుకోలేకపోయింది.

ఆమె గురించి శ్రీరామ్ ఎంతగా ఆందోళన పడ్డాడో చెబుతోంటే వింటూ కూర్చుంది హాస్పి టల్ గదిలో.

ఆమెకన్నా అతడికెక్కువగా దెబ్బలు తగి లాయని, అయినా ముందు రాణికి ట్రీట్ మెంట్ చేసేవరకూ అతడూరుకోలేదనీ నర్సు చెప్పిన మాటలు నెమరువేసుకుంది.

ఓసారి అర్ధరాత్రివేళ మెలకువ వచ్చి చూ సేసరికి తనమీదికి ఒంగి కలవరంగా చూస్తూ కన్పించాడు రామ్.

తనంటే రామ్‌కి ఎంత ప్రేమ!

"రామ్‌లాంటి భర్త లభించబోవటం నీ అదృష్టం బేబీ" రాజారావు అన్నారు.

"అవునమ్మాయ్. కంటికి రెప్పలా కాపాడే భర్తకన్నా భార్యకి కావల్సిందేమీ వుండదు"

"ఏమిటివాళ మమ్మీ డాడీ ఒకేపాట పాడు తున్నారు" నవ్వింది రాణి.

"ఎవరి పాట రాణీ" అంటూ వచ్చాడు శ్రీరామ్.

"నీపాటే. నిన్ను ఒకటే పొగిడేస్తున్నారు మమ్మీ డాడీ"

"భలేవారేగాని మోటార్ సైకిలిస్టెలా వుంది అంకుల్?"

ఆయన తడబడ్డారు. "ఇట్సాల్ రైట్... పెద్దగా దెబ్బలు తగల్లేదు. వెంటనే డిశ్చార్జి చేసేశారు. అతడిదే తప్పని, రాంగ్‌సైడ్ నుంచి వచ్చాడని పోలీసులంటున్నారు"

రాజారావువంక సాభిప్రాయంగా చూశాడు. ఆయన తలొంచుకున్నారు. అంతా మేనేజ్ చేసేశారని గ్రహించి నిట్టూర్చాడు.

"నేను డాక్టర్ని అంకుల్. అతణ్ణి హాస్పిటల్లో అడ్మిట్ చేసింది నేనే. అతడి పరిస్థితెలాటిదో నాకు తెలీదూ... నిజం దాయటానికి ప్రయత్నించకండి"

"నాకన్నా ఆ బికారే ఎక్కువైనట్టున్నాడు" రాణి అంది.

"ఛఛా - అదేం మాట రాణీ. యూఆర్ మైలైఫ్. అతడు మన వల్ల ప్రమాదంలో చిక్కుకున్నాడు గనుక అతణ్ణి గట్టుచేర్చడం మన డ్యూటీ కదా."

"అదంతా డాడీ చూసుకుంటార్లే"

"అవునురామ్. లీవిట్. మీ మేరేజ్‌కి ఏర్పాట్లుచేసేస్తున్నాను. ముహూర్తం మార్చాల్సిన అవసరంలేదు కదా"

"అఫ్‌కోర్స్... కాని ఒక్కటి చెప్పు అంకుల్- అతడు నిజంగా కోలుకున్నాడా?"

సూటిగా అడిగేనరికి తడబడ్డారు- "అరె - తొమ్మిదవుతోందప్పుడే. అర్జంటు పని వుంది. తర్వాత మాట్లాడుకుందాంలే. లేనిపోని ఆలోచనలతో బుర్రపాడు చేసుకోవద్దు. ఇలాటి ఘటనలిక్కడ మామూలేలే. డోంట్‌టేకిట్ సీరియస్లీ"

రాజారావు దంపతులెళ్ళిపోయారు హడావుడిగా.

విగ్రహంలా నిలబడిపోయాడు.

అయితే ఆ అభాగ్యుడి బతుకు రాణి కారుచక్రం కిందపడి సమాప్తమై పోయిందన్న మాట!

షాక్ లా అన్పించి కూలబడిపోయాడు.

"రామ్ - ఇలా నా దగ్గరికి రా...."

ఆమె పక్కన బెడ్‌మీద కూర్చున్నాడు. అతడి చేతిని తనచేతుల్లోకి తీసుకుని నిమురుతూ అంది- "యాక్సిడెంట్ అయినప్పుడెంత భయపడ్డానో చెప్పలేను రామ్. నా ప్రాణం పోతుందేమో అన్పించిందనుకో"

"చుప్" ఆమె నోరు మూసేశాడు.

"ఐలవ్యూ లైక్ ఎనీథింగ్. నీకేమైనా అయితే భరించలేను డార్లింగ్"

"రియల్లీ ఐయామ్ లక్కీ"

ఆమె చేతినందుకుని ముంజేతిమీద గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు శ్రీరామ్.

రాణి నరాలన్నీ వీణతీగల్ని మీటగా జుమ్మని శబ్దం వచ్చినట్టుగా ఝల్లుమని స్పందిస్తూ నినదించాయి.

ఒక అపురూప ఆనందాన్నీ సంతృప్తినీ పారవశ్యాన్నీ అనుభవించారిద్దరూ.

రూమ్‌లోకి నర్సు రావడంతో సర్దుకుని దూరంగా జరిగారు.

నర్సు బాండేజ్ మారుస్తోంటే గది బయటికి నడిచి సిగరెట్ వెలిగించాడు శ్రీరామ్.

మోటారు సైకిలిస్ట్ గుర్తొచ్చాడు. అతడి గుండెలు బరువెక్కాయి.

జాగ్రత్తని చెప్పినా, వేగం వద్దని వారించినా వినకుండా తలతిక్కగా ప్రవర్తించి యాక్సిడెంట్ చేసింది రాణి.

ఆమె తన జీవనసహచరికాబోతోంది కొన్నిరోజుల్లో.

తన బతుకు కారుని యాక్సిడెంట్ల పాలుచెయ్యకుండా క్షేమంగా, సుఖంగా నడపగలదా?

మిలియన్ డాలర్స్ క్వశ్చన్!

★ ★ ★

గదిలోకొచ్చి చూసింది అరుణ- స్వామి నిద్ర నటిస్తూ పడుకున్నాడు. నిట్టూర్చి వంటింట్లోకెళ్ళిపోయింది.

ఆమె నిట్టూర్పులు గుండెల మీద సమ్మెట పోట్లలా తగిలాయి. విలవిల్లాడాడు స్వామి.

రాత్రి ప్రవర్తనకి సిగ్గుతో చితికిపోయాడు.

బ్రాకెట్టు తగల్లేదని డిప్రెషన్‌కి లోనై పీకలదాకా బ్రాందీ తాగేశాడు.

షాపు కట్టేస్తున్నామని హెచ్చరించాక వదు

తూ లేస్తూ ఇంటికొచ్చి తలుపులు బాదేశాడు. ఆమె తలుపులు తీసిందో లేదోగాని గుమ్మం దగ్గర కుప్పలా కూలిపోయాడు. ఆ తర్వాతేం జరిగిందో తనకి తెలీదు!

అరుణ తన గురించి ఏమనుకుని వుంటుందో! బ్రాకెట్టు పిచ్చోడే కాదు తాగుబోతు అనుకుని అసహ్యించుకుంటోందేమో! ఛా- ఎంత దారుణంగా ప్రవర్తించాడు. తను నిజంగా బ్రాకెట్టు పిచ్చోడే!

లాటరీ పిచ్చోడు గుర్తొచ్చాడు.

ఒళ్ళు జలదరించింది.

తనిలాగే ఇదే బలహీనతతో బ్రాకెట్టు చుట్టూ ప్రదక్షిణచేస్తూపోతే ఏదో ఒకనాడు అతనిలా పిచ్చెక్కి....

కంపించిపోయాడు. కన్నీళ్ళు పొంగివచ్చాయి.

అరుణని క్షమించమని అడగాలనుకున్నాడు. ఆమె క్షమించకపోతే తనకి మనశ్శాంతి వుండదన్పించింది. ఇంకెప్పుడూ బ్రాకెట్టు అంకెలవంక కన్నెత్తి కూడా చూడనని నమ్మజెప్పాలనుకున్నాడు.

కాని... ఆమె ముఖంలోకి చూడటానికి ధైర్యం చాలటంలేదు!

"పదవుతోంది... ప్రెస్‌కి వెళ్ళరా"

తను నిద్రపోవటంలేదని, ఆమె గ్రహించేసిందని అర్థమైపోయింది స్వామికి.

గబుక్కున లేచికూచున్నాడు.

ఆమె అతడివంక చూడకుండా లోపలికెళ్ళిపోయింది.

మనస్సు కలచివేసినట్లయిపోయింది. తప్పుచేసినవాళ్ళా తలవంచుకునివెళ్లాడు ఆమె వెనుకే. ఆమె వుదాసీనత భరించరానిదిగా వుందిమరి. రాత్రిపనికి గట్టిగా చివాట్లేసివుంటే ఎంతో హాయిగావుండేది. కానిఆమె ఏమీ జరగనట్టే ప్రవర్తిస్తూ మౌనంగా చిత్రవధ చేస్తోంది!

"రాత్రి జరిగిందానికి సిగ్గుపడుతున్నాను. నన్ను క్షమించు అరుణా"

ఆమె మాట్లాడలేదు.

రాత్రి అతడిస్థితి చూసి బేలగా ఏడ్చేసింది. ఇంకెన్ని దురలవాట్లకి బానిసౌనని క్రుంగిపోయింది. అతడి జేబులోని బ్రాకెట్టు రసీదు మీది అంకె కంటపడేసరికి ఆమెకంతా అర్థమైపోయింది.

బ్రాకెట్లో ఎదురుదెబ్బతగిలేసరికి భరించలేక తాగేశాడనుకునేసరికి అతడి మీదెంతో సానుభూతి కలిగింది.

బ్రాకెట్లూ లాటరీలు ఇతర జూదాలూ సామాన్యుణ్ణి ఇట్టే ఆకర్షించి బుట్టలోవేసుకుంటాయని ఆమెకు తెలుసు, ఆ సాలెగూడు నుంచి బయటపడటం తేలికైనపనికాదనీ తెలుసు. కాని అనేకసార్లు ఎదురుదెబ్బతగిలేక కూడా గుణపాఠం ఎందుకు నేర్చుకోరో ఆమెకర్థంగాదు.

అతడీ దెబ్బతో ఆ పిచ్చికి స్వస్తిచెబితే సంతోషమే. లేకపోతే???

రాత్రంతా వరివరివిధాల వరితపించింది!

తటపటాయిస్తూనే మళ్లీ అన్నాడు "ఇంకెప్పుడూ అలాచెయ్యనని ఒట్టేస్తున్నాను..."

అయినా తలెత్తి అతడివంక చూళ్లేదు అరుణ.

తలొంచుకుని చెప్పేడు "అలా జరుగుతుందనుకోలేదు. ఏ అయిదో వదో బ్రాకెట్టు మీద కాద్దామని, తగిల్తే నీకు చీరకొందామని వెళ్లేను. తీరా అంకె అనుకూలంగా కన్పించేసరికి, గ్రహబలం అనుకూలంగావుందని చదివేసరికి వందరూపాయలు కాసేశాను. అదృష్టం వరిస్తుందనీ, ఎనిమిదివేలొస్తాయనీ ఆశపడ్డాను. ఆ డబ్బుతో ఏ వ్యాపారమో ప్రారంభించి నిన్ను సుఖపెట్టాలనుకున్నాను. కానీ..."

ఆడపిల్లలా కన్నీళ్లుపెట్టుకునేసరికి మరి బింకంగా వుండలేకపోయిందామె. కాలిన ఇనుమును కావల్సినట్టు మలచుకోవడం తేలికనుకుంది.

"కష్టార్జితపు సొమ్ములో తృప్తివుంది. విలువ వుంది. అయాచితంగా కలిసొచ్చిన డబ్బు తృప్తినివ్వదు - దాహాన్ని పెంచుతుంది. అత్యాశని రగుల్కొల్పుతుంది. ఇంకా ధనవంతుడివి కావాలని ప్రోత్సహించి మధ్యలో వచ్చిందీ చేతిలోవున్నదీ మొత్తం హారతి కర్పూరంలా హరింపజేస్తుంది. కష్టపడి సంపాదించిన

డబ్బు విషయంలో అలా జరగదు. ఎంచే తంటే దానివెనుక శ్రమవుంది గనుక!"

మేష్టారు చెబుతోన్న పాఠాన్ని శ్రద్ధగా వినే పిల్లాడిలా వింటున్నాడు స్వామి.

"బ్రాకెట్టు తగిలి నాలుగువేలొస్తే దాంతో జీవితం సుఖంగా గడిచిపోతుందా... లేదే. ఆ సొమ్ముతో ఏమైనా కొనుక్కుంటే అందులో తృప్తి వుంటుందా... వుండదు. మనకాళ్లమీద మనం నిలబడితే కష్టపడి చదివి పాసైతే వుద్యోగంలో వున్నతికి చేరుకుంటే విజయాలు సాధిస్తే - అందులో వుంటుంది సుఖమూ తృప్తీ మధురిమా అన్నీను. ఆఖరికి నెలల పిల్లాడి సంగతే చూడండి. మనం పట్టుకుని నిలబెట్టినప్పటికన్నా తనంతటితను ఏదోటిపట్టుకుని నిలబడ్డప్పుడు అధికంగా సంతోషిస్తాడు. సాధనలోవున్న ఆనందం సాధించినప్పుడే తెలుస్తుంది...."

రెప్పవేయడం మరిచాడతడు.

"దాహాన్ని నీళ్ళు తీర్చగలవుగాని నెయ్యి తీర్చలేదు. నీళ్ళలాటిది తృప్తి. అదిలేనప్పుడు ఎంత డబ్బున్నా వ్యర్థమే. ఎన్ని ఆస్తులున్నా మనస్సుకి శాంతివుండదు..."

"నిజమే అరుణా... ఎండమావులవెంట పరుగెత్తానిన్నాళ్లూ. మన ఈ చిన్నిస్వర్గంలోనే శాంతీసుఖం వున్నాయనుకోలేకపోయాను. ఇంకెప్పుడూ నువ్వు నొచ్చుకునేట్టు ప్రవర్తించను. నీ మాటకాదనను... నువ్వు గీచిన గీటుదాటను"

నవ్విందామె. "గుడ్డిగా అనుసరించడమూ మంచిదికాదు"

"నువ్వు నిజంగా విజ్ఞానఖనివి అరుణా. ఇన్నాళ్లూ రాయిలావున్న నేను నీ సాహచర్యంతో ఇక రత్నంలా ప్రకాశిస్తాను చూడు. నీ చేయూతతో నీవు గర్వించేంతవాణ్ణవుతాను. నన్ను నమ్ము అరుణా" ఆమె చేతిలోచెయ్యివేస్తూ ఆవేశంగా అన్నాడు.

తృప్తి నిండిన కళ్లతో చూస్తూ "నమ్ముతానండీ. మిమ్మల్ని నమ్మికోరి పెళ్లిచేసుకున్నదాన్ని- ఈ మాత్రం నమ్మలేనా?" అంది.

ఆమె కళ్ళు చెమ్మగిల్లటంచూసి తల్లడిల్లిపోయాడు.

"ఇంకెప్పుడూ కళ్లనీళ్లు పెట్టుకోకు అరుణా. నేను బతికుండగా నువ్వు కళ్ళనీళ్లు పెట్టుకోకూడదు - పెట్టుకోవాల్సిన పరిస్థితి రానివ్వను అరుణా"

దృఢస్వరంతో అన్న భర్తవంక ప్రశంసాపూర్వకంగా, ప్రేమగా చూసింది అరుణ.

అతనిలో ఆమెకి నూతనవ్యక్తి కన్పించాడు!

★ ★ ★

పోస్ట్‌మాన్ అందిచ్చిన ఖరీదైన శుభలేఖని చూస్తూనే 'రాణిపెళ్లన్నమాట' అనుకుంది స్వప్న.

శ్రీరామ్ పేరుకింద 'ఫారన్ రిటర్న్‌డ్' అని రాసిఉండటం చూసేసరికి ఆమె గుండెలు మూలిగాయ్.

రాణి చాలా అదృష్టవంతురాలు. పుట్టడమే బంగారు చెంచా నోట్లో పెట్టుకుని పుట్టింది. ఇప్పుడు ఫారన్ వెళ్లొచ్చిన గొప్ప డాక్టర్ భర్తగా లభిస్తున్నాడు!

తనూ వుంది - ఎందుకూ?!

తన అందం చూసిఎందరో మూర్ఛబోయేవారు. ప్రేమలేఖలు రాసి ప్రేమిస్తున్నామని చొంగకార్చేవారు. సినిమాల్లోకెళితే నెంబర్ ఒన్‌వి అవుతావని స్నేహితురాళ్ళు పొగిడారు. ఆరడుగులవాడూ, ఇంపాలా కారున్నవాడూ నీ సౌందర్యం చూసి అమాంతం మోహించి పెళ్లాడేస్తాడని తన అభిమాన రచయిత్రి నవలలు హామీ ఇచ్చాయి. తన మంచి మనస్సు చూసి డబ్బూ దాబూ వున్నవాడు సహృదయంతో స్వీకరిస్తాడని ఎన్నో సినిమాలు భరోసా చెప్పాయి.

అవన్నీ విని, చదివి, చూసి తనెన్నో కలలు కంది. ఏకంగా ఒక వ్యూహ సామ్రాజ్యాన్నే నిర్మించుకొంది.

కానేమయింది?

రాజశేఖర్ విలన్లా నవ్వేడు.

ప్రేమచొంగగాళ్ళు మొఖాలు చాటేశారు.

గొప్పింటివాళ్లు కట్నాలకోసం తమకంటే గొప్పవారి వంక ఆశగా ఆబగా చూడసాగారు.

ఆఖరికి తన రాత ఇలా కాలిపోయింది. కలలు కన్నీటి మడుగయ్యాయి. ఆశల ఆకు

లు రాలి మోడైపోయింది తను!

వెక్కి వెక్కి ఏడ్వబోయింది కానింతలో పక్కింటావిడ రావడంతో బలవంతాన నిగ్రహించుకొంది.

"శుభలేఖ బాగుందే... ఎవరి పెళ్ళండీ?"

"నా ఫ్రండ్ రాణిది. మీకు చెప్పేనో లేదో వాళ్ళు చాలా గొప్పవాళ్ళు. నేను రోజూ రాణి కార్లోనే కాలేజీకివెళ్లేదాన్ని..."

"అలాగా. అయితే మీరు పెళ్లికి వెళ్లి తీరాలన్నమాటే"

"వెళ్ళాలేమిటి వెళ్తాను"

"అరె... మీ ఫ్రెండ్‌వాళ్ళాయన సిటీలోనే ఆసుపత్రి తెరుస్తున్నారండీ. అయితే మీకిక డాక్టర్ ఖర్చు లేనట్టే"

నవ్వి వూరుకుంది ఏమీ అర్థంకాక. ఆమె వెళ్లాక చూసింది. శుభలేఖ వెనుక ఆసుపత్రి ప్రారంభోత్సవ వివరణలూ ఆహ్వానమూ వుంది!

అయితే వాళ్ళూ ఇక్కడే వుండబోతున్నారన్నమాట!

మనస్సు చేదుగా అయిపోయిందెందుచేతో.

ఇంతలో ఏదో ఆలోచనొచ్చింది.

తరచూ తను రాణి ఇంటికి వెళ్ళొస్తూంటుంది గనుక ఆమె భర్తతోనూ వారింటికొచ్చే ప్రముఖులతోనూ పరిచయం కలుగుతుంది. దాంతో తన పరపతి పెరిగిపోతుంది. అప్పుడెవరైనా రాకుమారుడో లేక రాణి భర్తో తన సౌందర్యానికి ముగ్ధుడై తన చుట్టూ తిరిగినట్టు ఏవేవో వూహించుకుని మానసిక తృప్తి ననుభవించింది స్వప్న!

ప్రభాకర్ ఆఫీసు నుంచి రాగానే ఎదురెళ్లి రాణి పెళ్లి గురించీ, రాణితో తన స్నేహం గురించీ, రాణి భర్త గురించీ గొప్పగా చెప్పేసింది.

"ఆమె మన పెళ్లికి వచ్చినపుడు చూసే వుంటాను"

"అర్జంటు పనుండి పెళ్లికి రాలేకపోయిందండీ. ఏమండీ... మనిద్దరం పెళ్లికెళ్దాం. అబ్బెబ్బే- మీరొద్దు, నేనొక్కదాన్నీ వెళ్తాను. పనిగా మావాళ్ళని కూడా చూసి వస్తాను"

మొఖాన గంటుపెట్టుకున్నాడు ప్రభాకర్.

"ట్రెయిన్‌కి రిజర్వేషన్ ఎప్పుడు చేయిస్తారు?"

"ప్రయాణానికీ ప్రెజంటేషన్‌కీ చాలా ఖర్చవుతుంది స్వప్నా. పెళ్లికి మానేసి ఆసుపత్రి ప్రారంభోత్సవానికి అటెండవుదాం"

"పోనీ మీరో వందరూపాయల్విండి. వచ్చేప్పుడు మా నాన్ననడిగి తీసుకుంటాను డబ్బు"

దెబ్బతిన్నట్లు చూశాడు.

"అంటే ఏవిటి నీ వుద్దేశం? వీలుకాదంటే వినవేం?" కోపంగానే అన్నాడు.

"మీ బీదార్పులెవరికి తెలీవులెండి. మీ ఆఫీసులో ఎవరో వడ్డీకిస్తారన్నారుగా. వాళ్లదగ్గర తీసుకోండి. వచ్చే నెలలో వాళ్ల మొఖాన కొడదాం"

"నీ విలాసాలకీ ప్రయాణాలకీ ఛస్తే అప్పు చెయ్యను"

"అబ్బో... విలాసాలట! పెళ్లయి ఇన్నాళ్లయినా ఓ చీర కొన్నారా? ఓ పెద్ద హొటల్‌కి తీసుకెళ్లారా? హు... పైగా నేను విలాసాలకి ఖర్చుపెట్టేస్తున్నానట! ఈయన్ని కట్టుకున్న భాగ్యానికి రెండు పూటలా భోజనమేగగనం. ఇంక విలాసాలు కూడానా!" హేళనగా అంది.

"ఛీ- నోర్మూయ్" ఆమె అంటే అసహ్యం వేసిందతడికి.

"మూస్తానండీ- పెళ్లాన్ని స్నేహితురాలి పెళ్లికి పంపలేరుగాని నోరుమూయ్యటానికి చేతులొస్తాయ్... మగమహారాజుకదూ!" నిరసనగా అంది.

"ఇంక కట్టిపెట్టు. సంస్కారంలేని చదువు చదివేవు- వెధవచదువు" అసహనంగా అరిచాడు.

"మీరు నా చదువునేం దెప్పనక్కర్లేదుగాని మీరు చేస్తున్న నిర్వాకమేమిటో తెలుసుకోండి. పెళ్లాం అంటే వండి వార్చే వంట మనిషీ పనిమనిషి అనుకుంటున్నార్తప్ప దానికో సరదా షికారూ ముద్దూ మురిపెం కావాలనెప్పుడైనా ఆలోచించారా? మిమ్మల్నని లాభం ఏవిట్లెండి- మీకిచ్చి చేసి మావాళ్ళు నాగొంతు కోశారు!" కన్నీళ్ళు చిప్పిల్లగా పైటకొంగుతో మొఖం కప్పుకుని రోదించసాగింది స్వప్న.

"ఇప్పుడేం కొంపలంటుకుపోయాయనీ ఏడ్పు... ఛీ ఛీ- ఇది ఇల్లు కాదు నరకం. నువ్వు ఇల్లాలివి కాదు రాక్షసివి"

విసురుగా బయటికి నడిచాడు ప్రభాకర్.

అతడి మనస్సు వుడికిపోతోంది.

తను స్వతహాగా సున్నిత మనస్కుడు. ఎన్నడూ ఎవరిచేతా చిన్నమాట అన్పించుకునెరగడు. అటువంటిదివాళ స్వప్న ఎన్నందీ! ఎంత హీనంగా తీసిపారేసిందీ!

తన మంచితనాన్ని లోకువగా భావిస్తోంది. తనెంతగా సర్దుకుపోవాలని చూస్తొంటే అంతగానూ అద్భుతగుల్తోంది.

స్వప్నది నేలవిడిచి సాముచేసే తత్వం. అందంగా వుందని చేసుకున్నాడుగాని ఆమె అందమైన శరీరంలో నింగికెగరాలని చూసే కోరికలున్నాయని వూహించలేకపోయాడు. ఆమె కోరుకున్నట్లుగా తనూ తన సంపాదనా లేకపోయేసరికి పిచ్చెత్తినట్లు ప్రవర్తిస్తూ ఇల్లు నరకం చేస్తోంది. లేకపోతే పెళ్లయి పదిరోజులు కాలేదు అప్పుడే రోషాలూ ఏడ్పులూ రాద్ధాంతాలూనా?!

వికల మనస్సుతో అశాంతిగా అటూ ఇటూ తిరిగితిరిగి ఇరానీ కేఫ్‌లో దూరాడు.

చాయ్‌కి ఆర్డరిచ్చాడు.

స్వప్న ఏం చేస్తోందో అన్న ఊహ వచ్చింది. ఆ ఉత్తరక్షణాల ఏదో అనుమానమొచ్చి అతణ్ణి గట్టిగా చుట్టేసింది.

ఆమెకి అభిమానం జాస్తి. పైగా దుడుకు మనస్తత్వం. జరిగినదానిగురించి పంతానికి పోయి ఆత్మహత్యకి తలపడలేదు కదా?

అతడికి ముచ్చెమటలు పోశాయి. కాళ్ళూ చేతులూ వణకసాగాయి.

రెండు గుక్కల్లో టీ తాగేసి పరుగులాంటి నడకతో ఇంటికెళ్ళాడు.

ఇంట్లో శ్మశాన శాంతి తాండవిస్తోంది.

గాభరాగా స్వప్నకోసం వెదికాడు.

మంచం మీద ముసుగుపెట్టి కదలక మెదలక పడుకుని ఉందామె. తన పిలుపుకామె బదులు పలికేకగాని ప్రభాకర్ గుండెలు కుదుటపడలేదు.

ఆరాత్రంతా మూగవాళ్ళలా ప్రవర్తించిన ఆలుమగలు మూడోనాటికిగాని పూర్తిగా రాజీపడలేకపోయారు.

★ ★ ★

"స్వామిగారూ..."

పళ్లన్నీ బయటపెట్టి నవ్వుతూ కిళ్ళీబడ్డీలోంచి లేచొచ్చాడు నర్సిములు.

ఇదివరకు 'గురూ' అని పిలిచి రిక్షావాళ్ళతో సమానంగా తననీ చూసే అతడిప్పుడు మన్నిస్తూ మాట్లాడుతున్నాడు!

కొత్తగా ఫీలయ్యాడు స్వామి.

"బొత్తిగా కొట్టుకేసి రావట్లేదు. మమ్మల్ని మర్చిపోనారేంటి. మరో కొట్టుకాడికెల్తున్నారా?"

"అబ్బెబ్బే-అలాంటిదేం లేదు. బ్రాకెట్టాడటం పూర్తిగా మానేశాను"

"నువ్వాదొద్దుగాని మాకు అంకె చెప్పు గురూ" కూర్చున్న రిక్షావాళ్ళు లేచొచ్చారు.

అదృష్టరేఖలు అరచేతుల్లో ఉంటాయంటారు. దానర్థం గీతల్లో అదృష్టం ఉంటుందని కాదు. చేతిపనిలో ఉంటుందని. అంచేత కష్టపడి పనిచేస్తే ఫలితం ఉంటుందిగాని బ్రాకెట్టు అంకెల్ని నమ్ముకుంటే మిగిలేది బూడిదేనని చెప్పాలన్పించింది స్వామికి. కాని చెప్పలేదు. చెబితే మెట్ట వేదాంతమని నవ్వుతారు. నిన్నటి బ్రాకెట్టు పిచ్చోడు ఇవాళ సన్యాసియై వేదాంతం బోధిస్తున్నాడ్రా అని నవ్వుకుంటారు!

"బ్రాకెట్టు మీదా లాటరీల మీదా నమ్మకంపోయింది. నేనైనా మీరైనా కష్టాన్ని నమ్ముకోవడం మంచిది" అనేసి వెళ్ళిపోయాడు.

విస్తుపోయారంతా. మిగతావాళ్ళు కూడా అతళ్ళా మారిపోతే తన ఆదాయం గోవిందకొడుతుందని కంగారుపడి నవ్వేశాడు నర్సిములు.

"ఈ పోకులెన్నాళ్ళో నేనూ చూడకపోను. బ్రాకెట్లోనూ వ్యభిచారంలోనూ తాగుళ్లోనూ రాజకీయాల్లోనూ ఒకసారి దిగినోళ్ళు మళ్ళీ బయటపడాలంటే తాతలు దిగిరావాలి. ఒకేల నాల్రోజులు దూరంగా ఉన్నా మళ్ళీ అందులో దూరకపోతే నిద్దరట్టదు. నీలాటోళ్ళని బోల్డు

మందిని చూశాను. నువ్వు మళ్ళీ బ్రాకెట్లోకి దిగకపోతే నాకుడి చెవి తెగ్గోసుకుంటానొరేయ్. ఇలాటి వాటికాడ మహామహా కొమ్ములు తిరిగినో ళ్ళే ఓడిపోయారు. ఇంక నువ్వెంత గురూ పిల్లకాకివి!''

నర్సిములు మాటలకి అవుననన్నట్లు తలాడి స్తూ నవ్వేరంతా.

★ ★ ★

ఇంకో వారం రోజులు గడిస్తే కాని జీతాలు చేతికిరావు.

స్వప్న చేతిలోని డబ్బంతా ఖర్చయిపో యింది. ఆఖరికి కాపురానికొచ్చే ముందు చేతి ఖర్చుకని తల్లి ఇచ్చిన సొమ్ము కూడా అయిపో యింది. కావాల్సిన సరుకుల లిస్టు మాత్రం చాలా పెద్దది. అవి కొంటేగాని ఈ వారం గడవదు.

అంతా అగమ్యగోచరంగా ఉందామెకి. ప్ర భాకర్‌కి తెలిస్తే గేలి చేస్తాడనే పక్క భయంగా ఉంది.

ఇలా గొర్రెతోక జీతంతో పైసాపైసాకీ వెనకా ముందాలోచిస్తూ వెధవబతుకు బతకాలితప్ప వేరే విమోచనామార్గం లేదన్పించి దుఃఖం పొంగిరాసాగింది.

సాయంత్రం భోజనాలయ్యాక ప్రభాకర్ ఏదో పుస్తకం చదువుకొంటోంటే సమీపించింది.

రాణి పెళ్లికెళ్తాను వందరూపాయలిమ్మన్న ప్పుడు అతడు చేసిన రాద్ధాంతం గుర్తొచ్చి భయపడుతూ అంది- "చేతిలోని డబ్బంతా అయిపోయిందండీ..."

"అప్పుడేనా?"

తలూపింది. "ఇంకో ముప్ఫయ్ నలభై రూ పాయలైనా..."

బుసలు కొట్టబోయే కోపాన్ని నిగ్రహించుకు న్నాడు.

కాపురం కొత్త. బాధ్యతలు కొత్త. బడ్జెట్ కొత్త. ఆమెని నిందించడం మర్యాదకాదనుకున్నా డు.

"అత్యవసర పరిస్థితి వచ్చినప్పుడు ఉప యోగపడుతుందని బ్యాంకులో వంద రూపా యలు దాచాన్లే. రేపది తెచ్చిస్తానుగాని వచ్చే నెల నుంచి మరింత ప్లాన్డ్‌గా ఖర్చుపెట్టాలి"

ఊహించని అతడి ప్రవర్తనకి పొంగిపో యింది. "మీదెంత ముందు చూపండీ" అని పొగిడేసింది.

ఇరుగమ్మా పొరుగమ్మలు చేబదుళ్ళ గు రించీ, అప్పుసప్పుల గురించి రావటం పోవటం, వాళ్ళలో వాళ్ళు తగవులాడుకోవడం, అప్పులాళ్ళు వచ్చి అరవడం-వగైరా కబుర్లెన్నో చెప్పేసింది ఉత్సాహంగా.

"వాయిదాల పద్ధతిలో ఫేన్ తీసుకుందామ నుకున్నాంకదా. ఇవాళో షాపులో మాట్లాడివ చ్చాను. రేపెళ్ళి నచ్చింది తెచ్చుకుందాం. నెలనెలా యాభై రూపాయలు కట్టాలిమరి"

"కట్టేద్దామండీ. ఈ ఇంట్లో గాలిఆడక ఛస్తు న్నాననుకోండి. నాసంగతెలా ఉన్నా చూసేవా ళ్ళ కంటికైనా కాస్తహంగుగా కన్పించాలి కదండీ. ఓ టేబులూ, సోఫా, డబుల్‌కాట్ బెడ్డూ లాటివి లేకపోతే ఏంబావుంటుంది చెప్పండి. పైగా కనీసం వచ్చే సంవత్సరమైనా పోర్టబుల్ టీవీ కొనుక్కోవాలి. ఆఖరికి ప్యూన్లుగా పనిచేస్తు న్నవాళ్ళు కూడా టీవీలు కొనేసుకుంటున్నారు కదండీ ఖర్మ!"

"కాలూ చెయ్యీ కూడదీసుకున్నాక ఒక్కొ క్కటీ కొనుక్కుందాంలే"

ఆమాటలకి ఎక్కడలేని సంతోషమూ కలి గింది స్వప్నకి. చాటంత అయిన ఆమె ముఖం చూసి ప్రభాకర్ కూడా సంతోషంగా ఫీలయ్యా డు.

"అన్నట్టు పైచదువుల గురించి ఆమధ్యన న్నావుగా. దాని గురించి ఎంక్వైరీ చేశాను స్వప్నా. నైట్ కాలేజీలో యమ్మే చేస్తే బావుంటుందనుకుంటున్నాను. ప్రమోషన్ ఇచ్చేప్పుడు పోస్టుగ్రాడ్యుయేషన్‌కి కొంచెం వెయిటేజి ఇస్తార్ట. అదిగాకపోయినా వేరే ఉద్యో గాలకి ప్రయత్నించొచ్చు. బ్యాంకు సర్వీసులాటి వాటికి వయస్సెక్కువైపోయినా ఏ లెక్చరర్‌గానో వెళ్ళొచ్చు... ఏమంటావ్?"

లెక్చరర్ అన్న పదం చెవినబడేసరికామె కళ్ళు మిలమిలా మెరిశాయి.

"అబ్బ... ఎంత తీయని వార్త చెప్పేరండీ. వెంటనే నైట్ కాలేజీలో జేరిపొండి. మీకు

తప్పకుండా లెక్చరర్ జాబ్ వస్తుందండీ'' ఉత్సాహంగా అంది. మనస్సులో రాజశేఖర్ కదలగా 'బోడి' అనుకుంది నిరసనగా.

''ముందు ఎంట్రన్స్ ఎగ్జామ్ రాయాల్లే. రేపో ఎల్లుండో అప్లికేషనూ అవీ తెస్తాను'' ఆమె ఉత్సాహం చూసి పున్నమిజాబిలిని చూసిన సంద్రంలా ఉప్పొంగిపోతూ అన్నాడు ప్రభాకర్.

ఇక స్వప్న ఆనందం గురించీ, అప్పుడే రెక్కలువిప్పేసిన ఊహా విహంగాల గురించీ వర్ణించడమంటే వెన్నెలని నిర్వచించడమే అవుతుంది!



**రా**ణి పెళ్లి చాలా ఆడంబరంగా అట్టహాసంగా జరిగింది. ఆమె తండ్రి రాజారావు డబ్బుని మంచినీళ్ళలా ఖర్చుపెట్టారని చెప్పాలి.

పెళ్లి ఎంత ఘనంగా జరిగిందో ఆతర్వాత ఊరేగింపుకూడా ఓడలా అలంకరించిన జీపు మీద బ్యాండు మేళంతో మందుగుండు సామగ్రి ప్రేలుళ్ళతో గొప్పగా జరిగింది.

పెళ్లిపందిళ్ళు విప్పకుండానే నర్సింగ్ హోం ప్రారంభోత్సవానిగ్గాను హైదరాబాదు పయనమయ్యారంతా.

ప్రారంభోత్సవానికి రాజారావు ముఖ్యబంధువులూ, స్నేహితులూ, శ్రేయోభిలాషులూ వచ్చారు. ప్రారంభోత్సవం చేసేది మంత్రిగారుగనుక ఆయన అనుచరవర్గమంతా తరలివచ్చింది.

స్వప్నని తీసుకొచ్చిదింపి ఏ నెంబరు బస్సెక్కి తిరిగి ఇంటికెళ్ళాలో చెప్పి ఆఫీసుకెళ్ళిపోయాడు ప్రభాకర్.

చుక్కల్లో చంద్రుడిలా తను వెలగాలని మగాళ్ళంతా తన పరిచయభాగ్యానికి పోటీపడాలని ఆశించి ప్రత్యేకంగా అలంకరించుకుంది స్వప్న. గంధపుచెక్కతో చేసిన రాధాకృష్ణుల బొమ్మని కొన్నారు రాణికి బహూకరించడానికి.

స్వప్న వచ్చేసరికి రిబ్బన్ కత్తిరించడం అయిపోయింది. మీటింగు ఏర్పాట్లలో ఉన్నారంతా. హడావిడిగా తిరుగుతూనే ''వచ్చేవా...కూర్చో'' అని ఆమెని పలకరించి వెళ్ళిపోయింది రాణి.

ఆ ప్రాంతపు లేడీస్ క్లబ్ ప్రెసిడెంటూ సెక్రటరీ తదితర సభ్యులూముందేవచ్చి రాణిని తమ క్లబ్బులో చేర్చుకున్నారు. వాళ్ళంతా ప్రముఖుల భార్యలూ, కోడళ్ళూ, కూతుళ్ళూ అవడంతో వాళ్ళతో తిరగటమే ఓ స్టేటస్ సింబల్‌గా భావించి పూనుకు తిరగసాగింది రాణి.

స్వప్నతో మరికాస్సేపు మాట్లాడాలనివుంది రాణికి. కాని లేడీస్‌క్లబ్ వాళ్ళెవరైనా ఆమె ఎవరూ, ఆమె భర్త ఏంచేస్తారు అని అడిగితే అవమానమని ఆ ప్రయత్నం విరమించింది.

ఆ నిర్లక్ష్యానికి కృంగిపోయింది స్వప్న. సిటీలో తెలునున్నవాళ్ళులేరని ఇదైపోతున్న సమయంలో దేవుళ్ళా వచ్చేవే అని ఆదరిస్తుందనుకుంటే...!

నిట్టూర్చింది.

ఆడామగా అంతా తన అందాన్ని ప్రశంసాదృక్కుల్తో చూస్తూండటం ఒక్కటే ఓదార్పుగా ఉందామెకి?

సభ మొదలయింది. విదేశంలో స్థిరపడక ఇక్కడికొచ్చి ప్రాక్టీసుచేస్తున్నందుకు శ్రీరామ్‌నంతా అభినందనలతో ముంచెత్తారు.

''నా శక్తివంచన లేకుండా రోగులకి సేవచేస్తాను. సాధ్యమైనంత తక్కువ ఫీజుతో ఎక్కువమందికి సేవచెయ్యడమే నా లక్ష్యం-నాధ్యేయం'' అని ప్రకటించాడు డాక్టర్ శ్రీరామ్.

తర్వాత 'మంద'తోబాటు అయిష్టంగానే డిన్నర్లో పాల్గొంది స్వప్న.

తను తెచ్చిన ప్రెజంటేషన్ ఇచ్చి వెళ్ళిపో

దామని రాణికోసం చూసిందిగాని ఆమె ఎక్కడా కన్పించలేదు. తిరిగి తీసుకెళ్తే ప్రభాకర్ నవ్వేగేలిచేస్తాడని అయోమయంగా తచ్చాడుతోంటే "హలో - డిన్నర్ తీసుకున్నారా మేడమ్" అంటూ పలకరించాడు శ్రీరామ్.

"రాణి లేదాండీ?"

"ఇంతక్రితమే ఇంటికెళ్ళింది. బైదిబై మీరు రాణిఫ్రెండా?"

"అవునండీ ఇద్దరిదీ ఒకే ఊరు. నిన్న మొన్నటివరకూ కలిసి చదువుకున్నాం"

"మీ పేరు స్వప్న...అవునా?"

గుండెలు ఝల్లుమన్నాయ్. ముఖం ఎర్రగా కందిపోతోంటే సిగ్గుపడింది.

"మీ గురించి రాణి చాలారాసిందిలెండి లెటర్స్‌లో. రండి... నా కన్సల్టింగ్ రూమ్‌లో కూర్చుందాం" నౌకరుకేదో సైగచేసి రూమ్‌లోకి నడిచాడు.

మౌనంగా అనుసరించింది స్వప్న

"ఈ ప్రెజంటేషన్ రాణికిద్దామనీ..."

"అలాగా ఇంటికెళ్ళి ఇవ్వండి. అశోకనగర్లో వుంటున్నాం. మా కారు రాగానే వంపిస్తాను వెళ్దురుగాని!"



అక్కడికెళ్ళినా ఇంతకంటే మంచి ఆదరణ లభించదని అంది "తర్వాత వస్తానెండి. మీరుకాస్త రాణికిస్తే..."

"ఎంతమాట" అని అందుకుని "ఇఫ్ యూ డోంట్ మైండ్..." అంటూ పేకింగ్ విప్పేడు.

చందనపు రాధాకృష్ణుల్ని చూసి పరమానందపడిపోయాడు.

"ఫెంటాస్టిక్... బ్రహ్మాండంగా వుంది మీ సెలక్షన్. రాధాకృష్ణులంటే నాకు చాలా ఇష్టం. వారిలా ప్రతి జంటా అనురాగడోలికల్లో వూగాలని ఆశిస్తాను. మీ అభిరుచికి అభిమానానికి థాంక్స్ ఎలాట్. మీరేమీ అనుకోనంటే ఈ విగ్రహాన్ని నా స్వంతం చేసేసుకుంటాను. ఐ మీన్... ఈ టేబుల్ మీద నా కళ్ళెదుట వుంచేసుకుంటాను"

"మీ ఇష్టం" పొంగిపోతూ అంది.

అతడు పట్టుబట్టడంతో కూల్‌డ్రింక్స్ తీసుకోకతప్పలేదామెకి.

"మీలాంటి మంచిస్నేహితులుండటం రాణి అదృష్టం. మీరు నాకిలా పరిచయమవడం నా అదృష్టం. అప్పుడప్పుడు వస్తూంటారు కదూ. ఈసారి మీవారిని తీసుకురండి. మీలాంటి అందాలరాశిని స్వంతంచేసుకున్న ఆయన్ని చూడాలని క్యూరియాసిటీగా వుంది" నవ్వుతూ అన్నాడు.

సిగ్గులమొగ్గై ' శలవు తీసుకుంది.

ఇంటికి తిరిగొచ్చి దుస్తులైనా మార్చుకోకుండా పక్కిళ్ళకెళ్ళి డాక్టర్ శ్రీరామ్ గురించెంతో గొప్పగా చెప్పింది.

క్రితంరోజు వరకూ వాళ్ళకి రాణి గురించి మాత్రమే చెప్పింది. ఇవాళ రాణి భర్త గురించే చెప్పింది!

ప్రభాకర్ ఆఫీసు నుంచి వస్తూనే "ఏవండోయ్ నీ ఫ్రెండు- లోపలికి రానిచ్చిందా లేదా" అన్నాడు హాస్యంగా.

"లోపలికి రానివ్వకపోవడానికి వాళ్ళు మీలా సంకుచితాలుకాదులెండి. డాక్టర్ శ్రీరామ్ ఎంత గొప్పవ్యక్తి అనుకున్నారూ. అలాటివాళ్ళని పుస్తకాల్లో తప్ప ఎక్కడా చూడమనుకుండి. రియల్లీ ఐడియల్ మేన్ అనుకోండి. మనమిచ్చిన కానుకని పొగిడి తన టేబుల్ మీద అందరికీ కనబడేలా పెట్టుకున్నాడండీ. ఫారన్ వెళ్ళొచ్చానన్న గర్వం పిసరంతైనా లేదంటే నమ్మండి. చాలా సరదా మనిషి. ఆయన్తో మట్లాడుతోంటే ఎంతో ఆహ్లాదంగా అన్పించిందనుకోండి. రాణి చాలా లక్కీ ఫెలో..." ఫుల్‌స్టాపులూ కామాలూ లేకుండా చెప్పుకుపోతోందామె.

ముఖాన గంటుపెట్టుకొని అనహనంగా వింటున్నాడు ప్రభాకర్.

ఆమె శ్రీరామ్‌ని అతిగా పొగట్టం భరించరానిదిగా వుందతడికి. పరోక్షంగా ఆమె తనని ఎత్తిపొడుస్తోందనుకుని ఇన్ఫీరియారిటీ ఫీలవసాగాడు.

ఆ గొడవలో తనకి యూడీసీగా ప్రమోషన్ వచ్చిందన్న సంగతి చెప్పడానికి మనస్సు కలిసి రాలేదు.

★ ★ ★

స్వామి మంచి మార్కుల్తో ఇంటర్మీడియట్ పాసయ్యాడు. వార్త తెలీగానే "చూశారా- మీరు పాసవ్వగలనా అన్నారు. ఇప్పుడెన్ని మార్కులొచ్చాయో చూడండి" అంది అరుణ.

"ఇది నీ గొప్ప తప్ప నా ప్రతిభ కాదు"

"మీలో ప్రతిభ లేకపోతే మీరు పట్టుదలతో కృషిచెయ్యకపోతే నేనుకాదుకదా బ్రహ్మదేవుడైనా ఏం చెయ్యాలేడు"

"నీతో వాదించలేనుగాని టైపు నేర్చుకుంటూ వుద్యోగప్రయత్నాలు చేస్తాను" పరీక్ష పాసవడంతో పెరిగిన ఆత్మవిశ్వాసంతో అన్నాడు.

"మీచేత ఇంటర్‌కి కట్టించింది చిల్లరమల్లర వుద్యోగాలు చెయ్యడానికా? భలేవారే... ముందు మీరో డిగ్రీ తీసుకోవాలి!"

"నువ్వు కష్టపడుతోంటే నేను..."

"మీరలా ఆలోచించవద్దు. రోజురోజుకీ మీరెదుగుతోంటే ఆ సంతోషం ముందు ఆ సంతృప్తి ముందు ఈ శ్రమ ఏపాటిది చెప్పండి?"

అతడు మరి మాట్లాడలేకపోయాడు.

ఇది జరిగిన మూణ్రోజులకి అరుణకి వుద్యోగం వచ్చింది. హైదరాబాద్‌లోని ఓ మెడి

-- ... అనుకున్నారు మన.

"ఛలో హైదరాబాద్" స్వామి నవ్వేడు ఆనందపడిపోతూ.

"అక్కడైతే మీ చదువు మరింత బాగా సాగుతుంది"

"ఏదైనా వుద్యోగం చేస్తూ నైట్ కాలేజీలో చదివితే?"

"అదేం కుదరదు. ఏదో డిగ్రీ తీసుకుంటే చాలదు. క్లాస్ రావాలి. వీలైతే డిస్టింక్షన్‌తో పాసవ్వాలి. అందుకోసం మీ దృష్టిపూర్తిగా చదువుమీద కేంద్రీకరించాలి..." ఖండితంగా చెప్పేసింది.

"కాని నలుగురూ... భార్య సంపాదిస్తుంటే తింటూ కూర్చున్నాడని..."

"లోకులు కాకులండీ. వాళ్ళగోల మనకనవసరం. మనం ఎవరికోసమో బ్రతకటంలేదు. మనకోసం బతుకుతున్నాం. రేపు మీరు ఉన్నతోద్యోగులైతే ఆనందించేదీ మీ సంపాదన అనుభవించేదీ నేనూ మనపిల్లలూగాని వాళ్ళు కాదుకదా"

"సరే... నీ ఇష్టం. నేను మట్టిలో కూరుకుపోయిన శిలని. దానిని బయటికి తీశావు- శుభ్రం చేశావు. దానినో చక్కని స్థానంలో ఉంచావు. అంతటితో ఊరుకోక దానినో అందమైన శిల్పంగా చెక్కుతానంటున్నావు. సరే... అలాగే కానియ్యి- మధ్యన నేనెందుకు కాదనాలి?"

"మీలాంటి అర్థంచేసుకునే భర్త లభించడం నా అదృష్టం" అతడి గుండెలమీద వాలిపోతూ అంది అరుణ.

"మరి నేనేమనుకోవాలి?" ఆమెని పొదివిపట్టుకొని అన్నాడు స్వామి చిరునవ్వు చిందిస్తూ.

ఆమె చిరునవ్వుతో సమాధానమిచ్చింది.

అతడామె బుగ్గలమీద తిరిగి జవాబు రాశాడు.

మరి వారంరోజులకి హైదరాబాదు ప్రయాణమయ్యారు క్రొంగొత్త ఆశలతో ఆకాంక్షలతో!

★ ★ ★

ఎవరో తరుముకొస్తున్నట్టుగా ఆఫీసునుంచి బయటపడి గబగబా అడుగులేసుకుంటూ రెండు మలుపులు తిరిగి కాకా హొటల్లో దూరాడు ప్రభాకర.

పైన ఫాన్ తిరుగుతున్నా చెమటలుపోస్తున్నాయ్. కాళ్ళు వణుకుతున్నాయ్. చుట్టూ బెదురుచూపులుచూస్తూ మాటిమాటికీ కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటున్నాడు.

అతడికి తన పాంటు జేబెంతో బరువుగా ఉంది. అందులో ఏదో పాముపిల్ల ఉన్నట్టు భయపడిపోతున్నాడు. ఆసలా సంగతి తలచుకుంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తోంది.

తనివాళ ప్రప్రథమంగా లంచం తీసుకున్నాడు!

నీతిగా నిజాయితీగా ప్రిన్స్‌పుల్డ్‌గా బతకాలనుకున్న తను వాటికి తిలోదకాలిచ్చి దిగజారిపోయాడు.

వాట్ ఎ ఫాల్ రియల్లీ!

ఇలా జరుగుతుందని తన జీవితం ఇక్కడ ఇలా మలుపు తిరుగుతుందని కలలోకూడా అనుకోలేదు. కానంతా కథల్లోలా జరిగిపోయింది.

వెంకటప్పయ్య కంట్రోల్డ్ ఐరన్‌కోటా పర్మిట్ కోసం ఆఫీసు చుట్టూ తన చుట్టూ తిరుగుతున్నాడు.

తనిప్పుడు టైపిస్టు కాదు- యుడీసీ. ప్రమోషన్ వచ్చి రెండ్రోజులైంది. జీతం వంద రూపాయలే పెరుగుతుందని విని స్వప్న పెదవి విరిచేసరికి డీలాపడిపోయాడు. ఆమెని తృప్తి పరచాలని తననో గొప్పవ్యక్తిగా చూసేలా ఏదోటి చెయ్యాలన్న బలమైన కోరిక తనలో అప్పుడే గాఢంగా నాటుకుంది కూడా.

వెంకటప్పయ్య ఫైలు తన దగ్గరుండటంతో అతను తనని కేంటీన్‌కి తీసుకెళ్ళి ఆసీట్లో వారికీ తనకీ మధ్యగల అండర్ స్టేండింగ్ గురించీ, ఇచ్చిపుచ్చుకోటాల గురించీ వివరించాడు. ఆ సాంప్రదాయాన్ని కొనసాగిస్తానని హామీ ఇచ్చాడు.

కాని తను లొంగలేదు. తన దగ్గర అలాటి పప్పులు ఉడకవని ఖచ్చితంగా చెప్పేశాడు. అతడేదో చెప్పబోతేంటే కేకలేశాడు కూడా.

తలొంచుకువెళ్ళిపోయి మళ్ళీ ఇవాళ

వచ్చాడు. అంతక్రితమేమీ జరగనట్టే మాట్లాడాడు. ఆఫీసరు వాటా ఆఫీసరుకి సమర్పించేశానన్నాడు. తను ఫైలుమీద నోటుపుటప్ చెయ్యకపోయినా పనైపోతుందనీ, కాదంటే కొంచెం ఆలస్యమవుతుందన్నాడు.

తను ఆలోచనలోపడ్డాడు. తను నిమిత్తమాత్రుడయినప్పుడు తన వాటాని కాదనటం అవివేకమన్పించింది. సరిగ్గా అప్పుడే స్వప్న దృష్టిలో గొప్పవాడిగా నిలవాలనీ, ప్రశంసలందుకోవాలనీ అనిపించింది. అందుకిదే అదనని ప్రలోభ పడ్డాడు.

తనేమీ పెదవి విప్పలేదు. అయినా అనుభవజ్ఞుడైన వెంకటప్పయ్య ఎవరూ చూడకుండా అయిదువందల నోట్లున్న కవర్ని జేబులో కుక్కేసి "పాలముంచినా నీటముంచినా నీదే భారం" అన్చెప్పి అదృశ్యమైపోయాడు.

వెన్నులోంచి వణుకుపుట్టుకురాగా ఆందోళనతో కంపించిపోయాడు.

అతడు కన్పిస్తే తిరిగిద్దామని చూశాడు. ఎవరైనా నోట్లు చూస్తారేమోనని కంగారుపడి దాచేశాడు. వెంకటప్పయ్య ఫైలుమీద అనుకూలంగా రాసేసి ఆఫీసరు దగ్గరికి పంపించి వచ్చేశాడు.

వెయిటర్ రాగా టీ చెప్పేడు ప్రభాకర్.

అయిపోయిందాన్ని గురించి మర్చిపోయి ఇంకెప్పుడూ అలాటిపని చెయ్యకూడదని లెంపలేసుకున్నాకగాని మనస్సు కుదుటపడలేదు.

పెళ్ళయి ఇన్నాళ్ళైనా ఒక్క చీరా కొన్లేదని స్వప్నదెప్పటం గుర్తొచ్చి అబిడ్స్‌కెళ్ళాడు. రెండొందలుపెట్టి చీరకొన్నాడు. స్వీట్స్ కొని ఇంటికెళ్ళాడు.

గబగబా పాకెట్‌విప్పి చీర బయటికి తీసింది స్వప్న.

"ఫైబర్ పాలియస్టరా? బాగుందండీ. రంగూ డిజైనూ కూడా బాగున్నాయి. మీకూ చీరల సెలక్షన్ తెలుసే" అంది చేటంత మొహం చేసుకుని.

ఆమె అడక్కపోయేసరికి రేటెంతో తనే చెప్పేశాడు.

"అలాగా. ఇంత ఖరీదైన చీర మన పక్కవాళ్ళకి లేదండీ. పైగా కొత్త వెరైటీ"

గబగబావెళ్ళి ఇరుగుపొరుగుకి చూపించి వచ్చింది.

"అంతా బాగుందన్నారండీ. ఆ కమల యితే కుళ్ళిపోయిందనుకోండి. ఈసారి కంచి పట్టుచీర కొనరూ?" గోముగా అడిగింది.

"అలాగే" అనేశాడు. చీరకి డబ్బెక్కడిదని ఆమె అడగలేదని విస్తుపోయాడు. అడిగితే జవాబివ్వడం కష్టం అని తనకే సర్దిచెప్పుకున్నాడు.

"సినిమాకెళ్దామండీ. కొత్తచీర కట్టేసుకుంటాను"

తలాడించాడు.

"అబ్బ... ఎంత తేలిగ్గా ఒప్పేసుకున్నారు. ఇవాళ మీరు చాలామారిపోయారు. నాకే కొత్తగా కనిపిస్తున్నారంటే నమ్మండి. మీరు ఎప్పుడూ ఇలాగే ఉంటే ఎంత బావుణ్ణు"

వెర్రిగా నవ్వేశాడు ప్రభాకర్.

అందంగా అలంకరించుకుని వచ్చిన ఆమెని చూసి "రంభా? ఊర్వశా? మేనకా? లేక ఆ ముగ్గురి అపూర్వకలయికా?" అనుకున్నాడు.

"నువ్వు చాలా బాగున్నావు స్వప్నా" ముద్దుపెట్టుకోడానికి ఒంగుతూ అన్నాడు.

"ఇప్పుడు కాదు...మేకప్పు చెరిగిపోతుంది, చీర నలిగిపోతుంది"

అల్లరిగా నవ్వింది. ఆనందరథం ఎక్కినట్టు పొంగిపోయాడతడు.

సినిమాహాలు ముందు ఆటో దిగారు. లోపలికెళ్తోంటే జీపు పక్కన నిలబడ్డ వాళ్ళ ఆఫీసర్ పిలిచాడు తప్పట్లు కొట్టి.

పరుగునెళ్ళి విష్ చేశాడు-ప్రభాకర్ సన్నగా కంపిస్తూనే.

"ఏమోయ్...ప్రమోషన్ రావటం అప్పుడే కొత్తసీటుకి అలవాటుపడటం జరిగిపోయిందన్నమాట."

"సార్..." నీళ్ళు నమిలాడు.

"వెంకటప్పయ్య ఫైలుమీద నువ్వురాసిన నోట్ చూశాన్లే"




# జండు బామ్
## జలుబు, తలనొప్పి, బాధల్ని క్షణంలో పోగొట్టేది.

పనులూ ఆగిపోకూడదు, తలనొప్పీ పోవాలి. అందుకోసం జండు బామ్. తలనొప్పి మాత్రమే కాదు, జలుబు-రొంప, నడుం నొప్పి, కీళ్ల నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు, వీటన్నిటి నుంచి ఉపశమనాన్నిస్తుంది. ఇటువంటి ఇంకే ఇతర బామ్ కన్నా కూడా ఎంతో ఎక్కువ ప్రభావం గలది.

రంగు లేనిది కావడం వల్ల మరకలు పడతాయేమోననే భయం లేదు. జిడ్డు లేనిది కావడం వల్ల, మీరు ఇంట్లోనైనా, బయటనైనా మాలిష్ చేసుకోవచ్చు. పైగా ఇది సువాసన గలది కూడా.




జండు బామ్‌ని తక్కువ మోతాదులో వాడితే చాలు. అంచేత ఇది పొదుపైనది. కోమలమైన చర్మాన్ని కూడా లాలిస్తుంది. అందుకే తల్లులంతా తమ కుటుంబం కోసం జండు బామ్ కావాలంటారు. కొనేటప్పుడు, సీసా మీద ఎర్ర సీల్‌ని చూసి మరీ కొనండి.

**5, 10, 30, గ్రాములలో దొరుకుతోంది.**

**జండు బామ్ నొప్పి హరించే బామ్**

ULKA-Z-1-89 TEL

అదిరిపడి చూశాడు.

"ఏవిటోయ్ అలా మొదటిసారిగా దొంగతనం చేసినవాళ్ళలా వణికిపోతావ్" జోక్ వేసినట్టు గట్టిగా నవ్వేశాడాయన.

"అది కాదాసర్...మరి...."

"కాగితంమీద కలంపెట్టేముందు బాగా ఆలోచించాలి. హరిమీద గిరివడ్డా గిరిమీద హరివడ్డా పొట్టి సంతకాలవాళ్ళూ పొడుగు సంతకాల వాళ్ళూ ఇరుక్కోకూడదు. రేపొది వారం ఇంటికిరా ఓసారి"

"అలాగేసార్"

"హుషారుగా ఉండవోయ్ కొత్తగాపెళ్లైనవాడివి"

థియేటర్లోకి వెళ్ళి కూర్చున్నాక అడిగింది "ఆయనెవరండీ పెద్ద ఆఫీసర్లా ఫోజు కొడుతున్నాడు? మీరు చిత్తం అంటూ చేతులు నలుపుకుంటూ నిలబడ్డారేం?"

ఎంబ్రాస్సింగ్‌గా ఫీలై "ఆయనవల్లే నాకుద్యోగం వచ్చిందిలే" అని అబద్ధమాడేశాడు.

సినిమా చూసి బయటపడుతోంటే స్కూటర్‌మీద భార్యానమేతంగా కనిపించాడు రామ్మూర్తి.

పలకరించాడు ప్రభాకర్.

స్కూటరాపి "మా ఇంటికి రావడానికి నీకు తీరికే లేదన్నమాట" అన్నాడు. తిరిగి స్వప్నతో అన్నాడు- "నాపేరు రామ్మూర్తమ్మ. వీడి ఫ్రెండ్‌ని. ఈవిడ నామిస్సెస్ అరవింద. మావాడొట్టి పిసినారి. మీరెలా వేగుతున్నారో ఏమో. అంచేత వాడొద్దంటున్నా వినకుండా నువ్వేవాణ్ణి మా ఇంటికి లాక్కురావాలి"

"అలాగే అన్నయ్యగారూ- మీరు కూడా మా ఇంటికి రావాలి"

"ఆహ్వానం అందిందిగా- రెక్కలు కట్టుకునొచ్చేస్తాం. కాని ముందు మీర్రావాలి సుమా" ఆడవాళ్ళు మాట్లాడుకొంటోంటే "హెూం డిపార్ట్‌మెంటుకి తెలీకుండా మందుపార్టీ ఇచ్చి ప్రమోషన్ వచ్చిందని చెప్పొద్దుట్రా రాస్కెల్" అన్నాడు రామ్మూర్తి.

"ఇస్తాన్లేగాని ప్రమోషన్ గురించి నీకెవరు చెప్పార్రా?"

"నీకోసం మీ ఆఫీసుకి ఫోన్‌చేస్తే ఓ పక్షి చెప్పేళ్ళే. నువ్వే పార్టీతో కలిసి కేంటీన్‌కెళ్ళేవని కూడా చెప్పేడు. బంగారు గుడ్లు పెట్టే సీట్ అటగా... గుడ్‌లక్. ఇక శాఖాహారినని మడిగట్టుకుని కూర్చోకు. నాలుగురాళ్ళు సంపాదించి సుఖపడాల్సిన సీజన్ ఇదేరా"

నవ్వి గుడ్‌బై చెప్పేడు.

"మీ ఫ్రెండ్ ఆఫీసరా?" స్వప్న అడిగింది.

"వాడిమొఖం... యల్డీసీ!"

"మరి ఆ స్కూటరూ, ఆవిడమెళ్ళో బంగారుగొలుసూ, బంగారు గాజులూ... బాగా వున్నవాళ్ళా?"

"అదేంకాదులే. రెండు చేతులా సంపాదిస్తున్నాడు" నవ్వబోయాడుగాని నవ్వు రాలేదు.

గాఢంగా నిట్టూర్చిందామె.

చిత్రంగా చూశాడతడు.

"ఆర్టీవో ఆఫీసులో పనిచేస్తున్నాట్టకదా. మీ ఆఫీసుకన్నా వాళ్ళ ఆఫీసు మంచిదన్నమాట" ఒక నిమిషమయ్యాక అంది.

"మా ఆఫీసూ పాడి ఆవేలే. స్మాల్‌స్కేల్ ఇండస్ట్రీస్‌కి లైసెన్సులిస్తాం. ముడిసరుకులకి కోటాలిస్తాం. కాని ధైర్యంచేసి మరీ పాలు పితుక్కోవాలి"

"మరి చెప్పరేం" ఎగిరిగంతేసిందామె.

"ఈరోజుల్లో పైపాటు సాధారణమైపోయిందండీ. వాళ్ళపని చేసినందుకు వాళ్ళు సంతోషంగా ఇస్తున్న బహుమానాన్ని మన మెందుక్కాదనాలి. మీకంతగా భయంగా ఉంటే ఇంటికిరమ్మనండి- నేను మాట్లాడతాను. ఇలాటప్పుడే నొల్లుకోవాలి. మా అమ్మకూడా మీలాగే కబుర్లు చెప్పి మానాన్నని లంచాలు పుచ్చుకోనివ్వలేదు. మా నాన్నతోటివాళ్ళంతా స్వంత ఇల్లు కట్టేసుకుంటే మా నాన్నింకా అద్దె ఇంట్లోనే కాలక్షేపం చేస్తున్నారు. మా నాన్నే గనుక రెండో చేత్తో కూడా సంపాదించి వుంటే నాకింతకంటే క్లాసైన సంబంధం వచ్చేది. ఏ డాక్టర్నో ఇంజనీర్నో చేసుకునేదాన్ని...!"

ప్రభాకర్ మొహం నల్లబడింది కానామె గ్రహించలేదు. సంబరపడుతూ చెప్పుకుపోసాగింది—

"శ్రీరామ్‌గారు మనల్ని మళ్ళీ రమ్మన్నా ఎందుకెళ్ళలేదనుకున్నారు? ఖరీదైన బట్టలూ ఫర్నిచరూ నౌకర్లూ— ఓహ్... వాళ్ళది ఇంద్ర భోగం! వాళ్ళ ముందు మనం ముష్టివాళ్ళలా వుంటాం. వాళ్ళనెందుకు మనింటికి పిలవలేదో తెలుసా? వారి పనివారిల్లులావుంటుంది మన ఇల్లు. ఒక సోఫా టీవీ ఏమీలేకుండా నామోషీగా ఉంటుంది!

"మీరు మీ ఫ్రెండ్‌లా మారితే ఫర్నిచర్ కొనుక్కోవచ్చు. మంచి ఇంట్లోకి మారొచ్చు. స్కూటర్ కొనుక్కోవచ్చు. చక్కని ఫ్లాట్ కొనుక్కోవచ్చు. అమరసుఖాలనుభవించొచ్చు. మీరేం ఇదవ్వకండి. మూడో కంటివాడికి తెలీకుండా నేను చక్కబెడతానుగా"

ఆమె మాటలకి ధైర్యం రాగా మెల్లగా అన్నాడు- "నన్ను మరీ చవటగా జమకట్టకు మరి. ఇవాళ నీకు చీరెలా కొన్నాననుకున్నావ్? ఓ పెద్దమనిషి అయిదొందలు నా జేబులోపెట్టేసి పోయాడు!"

బ్రహ్మానందపడిపోయింది స్వప్న.

"చూశారా- నెలరోజులు అరవచాకిరీ చేస్తే చేతికొచ్చేది వెయ్యి రూపాయలే. నాలుగు ముక్కలు గీకితే అయిదొందలొచ్చిపడ్డాయి. మీరు దాన్ని తీసుకోకపోతే ఇంత ఖరీదైన చీర మీరు జన్మలో కొనగలిగేవారా... చెప్పండి? ఇందాకే అనుమానమొచ్చింది మీలో ఏదో మార్పు వచ్చిందని. మీలో ఇంతమంచి మార్పు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉందండీ. నా కలలన్నీ నిజమై తీరతాయండీ"

రోడ్డుమీదున్నారన్న సంగతి మరచి గబుక్కున అతడి బుగ్గమీద ముద్దుపెట్టేసుకుంది.

"మిమ్మలెవ్వరైనా అనుమానిస్తారని భయపడకండి. మన జాగ్రత్తలో మనముంటే మనల్నెవరూ పట్టుకోలేరు. అయినా డబ్బున్నవాళ్ళకి సలాముచేసే రోజులండీ. ఆ డబ్బెలా సంపాదించారన్నది ఎవరికీ అక్కర్లేదు. ఒకవేళ ఎవరికైనా మీమీద అనుమానమొస్తే డబ్బుతో వాళ్ళ నోళ్ళు మూయించొచ్చండీ. అబ్బ... ఎన్నాళ్ళకెంత గొప్పవార్త చెప్పారు!"

అతడి చేతులమీద ముద్దులవర్షం కుర్పిస్తోంటే ఎంతో గొప్పగా గర్వంగా ఫీలయ్యాడు ప్రభాకర్. ఆమె తన విలువ గుర్తించి ప్రశంసిస్తోంది- అంతకంటే తనకేం కావాలి?

ఆటోని పిలిచి ఎక్కారు.

నీటిలోని చేప ఎన్ని నీళ్ళు తాగిందో ఎవరికీ తెలీదు. తమ సంగతీ అంతే! ఆయన కొంచెం పిరికిగనుక పార్టీలని ఇంటికిరమ్మని తనే ముగ్గులుపెట్టాలి. వీలైతే వస్తువుపేర తీసుకుంటే సరి. పుట్టింటి నుంచి తెచ్చుకున్నట్టు చెప్పుకోవచ్చు.

అప్పుడు ఇన్నాళ్ళూ ఊహల్లోనే ఉండిపోయిన తన సౌధం భువికి దిగివస్తుంది. తామిద్దరూ రతీమన్మథుల్లా ఆనందామృతాన్ని జుర్రుకుంటారు. స్కూటర్‌మీద షికార్లు కొడతారు. బంధువులూ స్నేహితులూ తమ భాగ్యాన్ని చూసి కుళ్ళిపోతారు.

రాజశేఖర్ ఏడ్చేస్తాడు- అదృష్టదేవతని దూరంచేసుకున్నానే అని.

రాణి కూడా అంతే. ఆసుపత్రి ప్రారంభోత్సవంరోజున సరిగ్గా మాట్లాడనందుకు క్షమాపణ చెబుతుంది.

'నీకెన్ని తెలివితేటలే తల్లీ' అని అమ్మ మెచ్చుకుంటుంది...

కళ్ళముందు పంచరంగుల కలలు కదుల్తోంటే ప్రభాకర్ మీదికి ఒదిగిపోయింది.

ఆ రాత్రి స్వప్న ప్రభాకర్ గాఢపరిష్వంగంలో అనురాగాంబుధిలో ఆనందసాగర తరంగమాలికల్లో ఓలలాడింది. సుఖాల అంచులు చవిచూసింది.

అతణ్ణి మన్మథసామ్రాజ్యానికి మహారాజుని చేసింది.

తొలిరేయికన్నా మధురరాత్రిగా గడిచింది వాళ్ళకారాత్రి.

★ ★ ★

రాణికి నెల తప్పిందని తెలిసి శ్రీరామ్ ఎంత పొంగిపోయాడో రాణి అంతగానూ కృంగిపోయింది.

ఆమెకిప్పుడే తల్లి కావడం ఇష్టం లేదు. అందం కరిగిపోయి చీకేసిన మామిడి టెంకలా తయారవుతుందేమోనని ఆమె భయం. పైగా క్లబ్ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొలేనని ఆమె ఆందోళన.

రాణిని లేడీస్ క్లబ్ సెక్రటరీగా ఈమధ్యనే ఎన్నుకున్నారు. అప్పట్నుంచీ క్షణం తీరిక ఉండటం లేదామెకు. ఎవరెవర్నో కలుసుకోవడం, ఆహ్వానించడం సన్మానాలూ, మీటింగులూ, సాంఘిక సేవ పేరిట ఫొటోలూ- ఓహ్... అంతా హడావిడే!

మంత్రుల కలెక్టర్ల సెక్రటరీల ఇతర ప్రముఖ అధికారుల భార్యల్తో పరిచయాలూ స్నేహాలూ అధికమయ్యాయేమో తన స్టేటస్ మరింత పెరిగి పోయిందని విజృంభిస్తోందామె. దానికితోడు ఒకరకమైన కీర్తిదాహం కూడా పట్టేసుకుంది. ఇక దాంతో స్వంత డబ్బు క్లబ్బు కోసం సభ్యుల పార్టీల కోసం, ఖర్చుపెట్టేస్తూ వారి ప్రశంసలు పోగేసుకుంటోంది!

అందుకే తను గర్భవతినని తెలీగానే ఎబార్షన్ చేయించుకుంటానంది.

ప్రతి స్త్రీ మాతృమూర్తి కావాలని తహతహలాడుతుంది. తొలిసారిగా నెల తప్పినప్పుడు అలౌకిక ఆనందపు డోలికల్లో వూగిపోతుంది. దానికితోడు రాణి వయస్సు కూడా గర్భధారణకి అనుకూలమైంది. అటువంటప్పుడిలా ప్రకృతి విరుద్ధంగా ఎలా ప్రవర్తిస్తోందో అర్థంగాక తల కిందులైపోతున్నాడు శ్రీరామ్.

అతడెంతో నచ్చచెప్పాడు గాని విదిలించేసింది- "గర్భం ధరించడం ధరించకపోవడం అన్నది నాయిష్టం... నా హక్కు" అంది.

తనమాట వినదని రూఢి అవడంతో ఫోన్ చేసి అత్తమామల్ని పిలిచాడు.

స్వీట్సూ పళ్లూ పట్టుకుని వచ్చిన తల్లీ తండ్రిని చూసి మ్రాన్పడిపోయింది రాణి. ఇది శ్రీరామ్ నిర్వాకమే అనుకుని అతడివంక నిరసనగా చూసింది.

"మూడో నెలా? ఆరోగ్యం బాగానే వుందికదా. ఇక్కడుంటే వెర్రి మొర్రి ఆలోచనలొస్తాయిగాని మనింటికి పద. ఏకంగా పురుడు పోసుకుని వద్దువుగాని".

"ఇప్పుడా మమ్మీ? మైగాడ్! అవతలెన్ని పనులూ ఎన్ని కార్యక్రమాలు' నోనో. రాలేను మమ్మీ"

"రాకపోతే పోనీలేగాని ఎబార్షన్ లాంటి పనులు తలపెట్టకు మరి. మనవణ్ణో మనవరాలినో ఎత్తుకోవాలని మేం ఎదురుచూస్తోంటే నువ్విలా అనడం ఏం బావులేదు బేబీ" రాజారావు అన్నారు నిష్ఠూరంగా.

"నా వయస్సెంతనీ అప్పుడే పిల్లా పీచూ అని వూరేగడానికి?!"

"ఏ వయస్సుకా ముచ్చటన్నారు. మెడ నిండేక ఒడి నిండాలని చూస్తుందే ప్రతి ఆడదీనూ"

"నీదంతా పాతచింతకాయ పచ్చడి. ఇంటి పనులు తప్ప బయటి పనులు లేనికాలం గనుక ఎప్పుడు పిల్లలు పుడతారా అని చూసేవారు. ఇప్పుడు కాలం మారిపోయింది. స్త్రీ వుద్యోగాలూ సద్యోగాలూ చేస్తోంది. సంఘసేవ చేస్తోంది. రాజకీయాలు నడుపుతోంది. ఇంకో నాలుగైదేళ్లదాకా ఫ్రీగా వుందదలిచాను మమ్మీ. పిల్లల రంధి ఇప్పుడే నాకొద్దు"

"ఈ ఒక్కసారికీ మా ఇష్టప్రకారం కానీ రాణీ! మళ్లీసారి నీ యిష్టం. లేకపోతే శ్రీరామ్ కూడా నొచ్చుకుంటాడు. పుట్టే బిడ్డని మాదగ్గర పెంచుతాంలే- నీ కాళ్లకి బంధంకాదు" అని నచ్చచెప్పేరు రాజారావు.

మరి కాదన్లేకపోయింది రాణి.

ఏనుగెక్కినంత సంబరపడిపోయారంతా.

"ఈ రెండ్రోజులుగా నీ పద్ధతి చూస్తున్నాంగదా. కాస్త ఇంటిపట్టునుండటం అల్లుడి మంచీ మర్యాదా కనుక్కోవడం కూడా చెయ్యాలి బేబీ క్లబ్బు తోడిదే లోకమనుకుంటే ఇల్లూ, ఇంట్లోవాళ్లూ అదుపు తప్పే ప్రమాదముంది. చదువుకున్నదానివి. నీకింతగా చెప్పక్కర్లేదనుకో. ఎమైనా పరిస్థితి తెలుసుకుని ముందు ఇల్లు చక్కబెట్టుకోవడం నేర్చుకో. తర్వాత నీ యిష్టం మరి" అని చెప్పేరు తండ్రి వెళ్లేముందు.

రాణికి విపరీతమైన కోపం వచ్చేసింది. మహా మహావాళ్లంతా తననీ తన కార్యక్రమాలనీ పొగుడుతోంటే వీళ్లు వంటింట్లో పడివుండమంటారేమిటని రెచ్చిపోయింది.

"నేను చదువు లేని మొద్దునీ, పల్లెటూరి బగ్గిరాయినీ కాదు. ఏది ఎప్పుడు చెయ్యాలో, ఏది ఎలా చక్కదిద్దుకోవాలో ఒకరిచేత చెప్పించుకోవాల్సిన స్థితిలో లేను" అనేసి

ముఖం తిప్పేసుకుంది.

అవాళ్టినుంచి రాణి ప్రవర్తనలో చిర్రుబుర్రు లెక్కువవడం చూసి ఖిన్నుడైపోయాడు శ్రీరామ్.

చిన్నప్పుడే తల్లి ప్రేమని పోగొట్టుకున్నాడత ను. తన భార్య తనని తల్లిలా లాలించాలనీ, సేదతీర్చాలనీ ఎంతగానో ఆశిస్తూ వచ్చాడు.

భార్య తన సమయాన్నంతా తన కోసమే వెచ్చించాలనీ, తనకే లోటూరాకుండా కంటికి రెప్పలా చూసుకోవాలనీ, ఆసుపత్రినుంచి అలసి రాగా కాఫీ ఇచ్చి సేదతీర్చాలనీ, సాయంత్రంవేళ షికార్లు వెళ్లడానికి చక్కగా తయారవ్వాలనీ, భోజనం సరదా కబుర్లతో చెయ్యాలనీ, పిల్లల్ని కని ఇంట్లో ఆనంద దీపాలు వెలిగించాలనీ... ఇలా ఎన్నెన్నో వూహించుకున్న అతడికి అనుక్షణం ఎదురుదె బ్బే తగుల్తోంది.

పెళ్లికి ముందు తన సాహచర్యం కోసం ఆరాటపడింది రాణి. తనని వదిలి క్షణం ఉండేది కాదు. ఇప్పుడేకంగా తనని విస్మరించి ప్రవర్తిస్తోంది. ఊహించనంత వేగంగా మారిపో యిందామె.

ఆమె లోకం వేరు. ఆమె షికార్లు వేరు. ఆమె దృష్టి వేరు. ఆమె పార్టీలూ వ్యాపకాలూ వేరు. వాటిలో తనకి స్థానం లేదు. ఎప్పుడైనా లభించినా అది కేవలం రాణి భర్తగానే- కే వలం అలంకారప్రాయంగానే.

తను ఆసుపత్రికి వెళ్లిపోయేక ఆమె లేస్తుంది. తను లంచ్‌కొచ్చేసరికి ఆమె క్లబ్బులో వుంటుంది. సాయంత్రం వచ్చేసరికి ఏ ఫంక్షన్ కో, ఎవర్నో కలుసుకోడానికో వెళ్లిపోతుంది. తిరి గెప్పుడో రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతానవ స్తుంది. అలసివుంటుందేమో వస్తూనే మంచం ఎక్కుతుంది. ఆమె డైరీలో తనతో మాట్లాట్టానికి సమయమే లేదు!

ఆమె పద్ధతి చూస్తోంటే శ్రీరామ్‌కి అయోమ యంగా అశాంతిగా వుంటోంది. గుండెల్లోని బాధని మరొకర్తో చెప్పుకుని హృదయభారం తగ్గించుకోవాలని తహ తహగా వుంది.

అటువంటప్పుడు స్వప్న గుర్తొస్తూంటుంది. ఆమె వస్తే బావుణ్ణనుకుంటాడు. ఆమె చందమామలా చక్కనైనదేకాదు వెన్నెల్ని పంచే చల్లనిది కూడానని అతడి అభిప్రాయం. ఆమె ఎడ్రస్సు రాణినడిగి కనుక్కుందామను కుని కూడా ఆమె అనుమానిస్తుందని విర మించాడు.

రాజారావుగారు చదివిస్తాననప్పుడు లొంగ కుండా వుండివుంటే ఎలావేలా మెడిసిన్ పూర్తి చేసి స్వప్నలాంటి ప్రేమమయిని అర్ధాంగిని చేసుకుని సుఖించేవాడని అప్పుడప్పుడూ విచారిస్తున్నాడు కూడా.

తన ప్రమేయం లేకుండా చకచకా జరిగిపో తున్న మార్పుల్ని చూస్తోంటే తనలో సెలవేస్తు న్న అశాంతిని చూస్తోంటే తను కొత్తగా పెళ్లైన వాడా అన్న సందేహం కలుగుతోంది డాక్టర్ శ్రీరామ్‌కి!

★ ★ ★

అరుణా వాళ్ళు ఖైరతాబాదులో వుంటున్నా రు.

పనిని దైవంగా భావిస్తుందామె. అందుకే అతితక్కువకాలంలో అధికారుల ప్రశంసలూ సహోద్యోగుల అభినందనలూ ప్లస్ అసూయ లూ మూటగట్టుకుంది.

తన పనిని మెచ్చి మేనేజర్ ఎడ్వాన్స్ ఇంక్రిమెంట్ ఇస్తే కుళ్లిపోయి గుసగుసలాడిన కొందరు వుద్యోగుల్ని చూసి జాలిపడింది అరుణ.

నోటితో నవ్వి, నొసటితో వెక్కిరించారు కొంద రు.

కాని ఆమె పనినీ ఏకాగ్రతనీ విషయ పరిజ్ఞానాన్నీ నశ్శీలతనీ ప్రత్యక్షంగా చూసి నాలిక్కరచుకున్నారు; మనస్ఫూర్తిగా పొగిడా రు.

ఆఫీసులోనే కాదు ఇంటి చుట్టుపక్కలవాళ్లు కూడా మొదట అపార్థమే చేసుకున్నారు.

స్వామి అమీర్‌పేటలోని కాలేజీలో చేరి రోజూ సైకిల్‌మీద వెళ్లొస్తుండటం చూసి ము క్కుమీద వేలుంచుకున్నారు పనిలేని కొందరా డవాళ్ళు.

భార్య వుద్యోగంచేసి సంపాదిస్తోంటే భర్త పోకులలొలకబోస్తూ చదువుకుంటాడా?

ఇలాటిచిత్రం ఎక్కడైనా వుంటుందా?

బుగ్గలు నొక్కుకున్నారు కొందరు.

ఇంకొందరు "అక్కా తమ్ముళ్లనుకున్నాను పిన్నీ" అన్నారు అతితెలివిగా.

"ఏంజేస్తుందిలే పాపం. పెళ్లాట్టానికెవరూ ముందుకురాకపోతే అతగాణ్ణుంచుకుని చదివి స్తోంది పాపం"

"చూస్తూవుండు... అతగాడికేగనుక పెద్దవుద్యోగంవస్తే ఏ వన్నెల విననకర్రనే పట్టుకుని ఎగిరిపోతాడు" అని నవ్వేరు మరికొందరు.

వారిమాటలూ నవ్వులూ భరించరానివిగా వున్నాయి. అయినా నవ్వేన నాపచేనే పండుతుందని ధైర్యంగా నిలబడింది అరుణ.

కాని స్వామి తేలిగ్గా సమాధానపడలేకపోయాడు.

ఇరుగుపొరుగువాళ్ళు తనకి కనీసమర్యాద ఇవ్వకపోవడమేగాక అదోలా చూడటం వెకిలిగా నవ్వటం వెటకారంగా మాట్లాడుకోవడం చూసి చాలా మధనపడ్డాడు.

చదువుమానేసి ఏదైనా వుద్యోగం చూసుకుందామనీ, కనీసం పార్ట్‌టైం జాబ్ అయినా చేద్దామనీ అనుకున్నాడు. అరుణ ససేమిరా వీలుకాదంది.

"మనం వాళ్లకోసం బతుకుతోంటే వాళ్లన్నట్టూ అనుకున్నట్టూ వుండొచ్చు. అప్పుడు దానికో అర్థం వుంటుంది. అలాగానప్పుడు కూడా వాళ్లనుకున్నట్టే వుండాలనుకుంటే మనమనుకుంటున్నట్టు వుండలేం" అంది నిష్కర్షగా.

ఏనుగూ కుక్కల సామ్యం గుర్తుతెచ్చుకోమంది. దృష్టిని చదువుమీద మరింతగా కేంద్రీకరించమంది. మిగతాకాలాన్ని లైబ్రరీలో గడిపి ఐ.క్యూ పెంచుకోమంది. ఆటలాడి స్పోర్టివ్ స్పిరిట్‌ని పెంపొందించుకోమంది.

కాదన్లేకపోయాడు స్వామి.

ఆమె తనచేత ఏ లక్ష్యాన్ని సాధించాలనుకుంటున్నదీ తెలును. అందుకనుగుణంగానే ప్రతి అవకాశాన్నీ వినియోగించుకుంటోంది. పునాది గట్టిచేసుకోమంటోంది. మహాసముద్రాన్ని లంఘించడానికి సమాయత్తమవమంటోంది.

ఆమె సారథి; తను పార్థుడు.

ఆమె చెప్పినట్లు నడచుకోవటమే తామిద్దరికీ శ్రీరామరక్షనుకున్నాడు. మళ్ళీ ఎప్పుడూ వెనుకంజ వెయ్యలేదతడు!

వాళ్లు తామాశించినట్టు వుడుక్కోకపోయేసరికి నోళ్ళు నొప్పెట్టి వాళ్లసంగతి వదిలేశారు ఇరుగమ్మా పొరుగమ్మా.

కాని వారి మగాళ్లు వదల్లేదు.

అరుణా స్వామీ ఒకరికొకరు సాయపడుతూ చిలకాగోరింకల్లా మసల్తుండటం చూసి అబ్బురపడ్డారు. అంతటితో ఊరుకోక "ఆవిడ్నిచూసి బుద్ధితెచ్చుకోండి" అని మందలిస్తున్నారు!

అవాళ స్వామి అరుణకన్నా ముందొచ్చాడు. తాళంతీసుకుని లోపలికెళ్లోంటే పక్క పోర్షన్లో వుంటోన్న సోఫియా వచ్చింది నవ్వుతూ.

ఆమె ఏదో ఆసుపత్రిలో నర్సుగా పనిచేస్తోందని తెలును. ఫేషన్ ఎక్కువని మనిషిని చూస్తేనే తెలుస్తుంది. ఆమెకి తమతో ఏమి పనో అనుకుంటూ "అరుణ ఇంకా రాలేదండీ" అన్నాడు.

"అరుణగారి గురించి కాదండీ..." మోహంగా చూసింది.

విసుగ్గా చూశాడు స్వామి.

కలవరపడి సర్దుకుంది— "వీక్లీలూ నవలలూ వున్నాయేమోనని..."

"హిందూవుంది. కాంపిటేటివ్‌సక్సెస్ రివ్యూలాంటివే వున్నాయి"

"అవెందుకు— ఏమైనా రొమాంటిక్ బుక్స్..." కొంటెగా నవ్వింది.

"సారీ... లేవు—"

ఏదో కిందపడినట్టు ఒంగుని చుట్టూ వెదికి లేచింది. ఆ ప్రయత్నంలో పైట జారవిడిచింది కావాలనే.

అతడిలో తనక్కావల్సిన రియాక్షన్ రాలేదు సరికదా పక్కకి తిరిగి "నాకు పనుంది" అన్నాడు.

ప్రవరాఖ్యుళ్ళే నాదగ్గర పల్టీకొట్టారు. ఇక నువ్వెంతలే. ఈబింకమెన్నాళ్ళో చూస్తాన్లే— వెళ్ళిపోతూ అనుకుందామె!

★ ★ ★

ఫోన్ మోగగా రిసీవర్ ఎత్తి "హలో" అంది రాణి.

"నేను రాణీ... నీ రామ్‌ని. ఒసారొచ్చి లేడీ డాక్టర్‌చేత చెకప్ చేయించుకోకపోయావా"

"వస్తాన్లెద్దురూ. ఈమాత్రానికే ఫోన్ చెయ్యాలా?"

"అదేమిటి డియర్... నీఆరోగ్యంకన్నానా!"

మరి మాట్లాడలేకపోయిందామె.

"ఇంకో గంటలో వస్తాను. ఎక్కడికీ వెళ్ళొద్దు డియర్"

"దేనికి?"

"మనం షికారుకెళ్ళి ఎన్నాళ్ళయిందో తెలుసా? ట్వంటీడేస్. ఇవాళ నిండుపున్నమి రోజు. సరదాగా ఇందిరాపార్కులో తిరిగి, బిర్లా మందిర్లో దేవుణ్ణి దర్శించి రిట్జ్‌లో డిన్నర్ చేద్దాం. నీహెల్త్‌కి కూడా చాలా మంచిది"

అతడి స్వరంలోని ఆప్యాయతా, ఆర్ద్రతలకి కదిలిపోయిందామె.

"తప్పకుండా నీకోసం నిరీక్షిస్తుంటాను"

"ఓహ్... థాంక్యూ" అంటూ ఫోన్లో ముద్దువిడిచాడు.

ఆ ముద్దొచ్చి తన బుగ్గల్ని తాకినట్టుగా సిగ్గుపడింది రాణి.

పూర్ రామ్! సరదాగా తిరిగి రావటానికి క్కూడా భార్యదగ్గర అప్పాయింట్‌మెంట్ తీసుకోవాల్సిరావడం....!

నిజానికి బిజీలైఫ్ తనకీ నచ్చటంలేదు. సరదాగా రామ్‌తో షికార్లు కొట్టాలనీవుంది. కానెప్పుడూ ఏవో కార్యక్రమాల్తో బిజీ అయిపోతోంది. వేటినీ తప్పించుకోడానికి వీల్లేని పరిస్థితైపోయింది!

పోనీ రామ్ అర్థంచేసుకుని తదనుగుణంగా ప్రోగ్రాంవేస్తాడా అంటే అదీలేదు. ఫారిన్లో వుండొచ్చినా ఆడది వంటింటి కుందేల్లా వుండిపోవాలని భావిస్తాడు. ఎప్పుడూ భార్యాభర్తలు ఎదురెదురుగా కూర్చోవాలట... బోర్ సెంటిమెంట్స్—చీప్ టేస్ట్స్!

క్లబ్‌లోని మిగతాసభ్యుల భర్తల్లా ఈయన కూడా తనకి ప్రోత్సాహమిస్తే ఎంతబావుణ్ణు. మరెంతో కీర్తిని చేజిక్కించుకునేది. ఎప్పుడేం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? ఆమధ్య ఒసభలో మంత్రిగారన్నట్టు తనలో రాజకీయనాయకుల లక్షణాలున్నాయి. కొందరు క్లబ్‌వాళ్ళన్నట్టు తనకి యమ్మెల్యేసీటూ, మంత్రిపదవీ రావొచ్చేమో!

తనకి పేరొస్తే ఆయనకొచ్చినట్టు కాదూ? తనగొప్పా, తనకీర్తీ ఆయన్దికాదూ? మరీమాత్రం కూడా ఆలోచించడేంమనిషి?

రాణి ఆలోచనాముద్ర నుండి తేరుకోకుండానే అయిదారుగురు మహిళలు బిలబిలమంటూ వచ్చారు.

"రేపు కస్తూర్బా పుట్టినరోజుకదా. కొన్ని కార్యక్రమాలు ఏర్పాటుచేస్తే బావుంటుందని వచ్చాం"

"ఏ కస్తూర్బా?"

చిత్రంగా చూశారామెని. "పూజ్యబాపూజీ అర్థాంగి. ఆవిడ సహాయ సానుభూతుల్లేకపోతే గాంధీగారంత దీక్షతో సంపూర్ణశక్తితో బ్రిటీమవారితో పోరాడేవారే కాదు" మిస్సెస్ శ్యామలాభార్గవ్ అంది కళ్ళజోడు సవరించుకుంటూ.

"అవునవును... మొన్నటి క్లబ్ సమావేశంలో చర్చించాల్సింది"

"అప్పుడు కస్తూర్బా బర్త్‌డే సంగతి మాకు గుర్తులేదు. లయనెస్ క్లబ్‌వాళ్ళు చాలా ఆర్భాటం చేస్తున్నారు. మనం తక్కువతింటే ఎలా? కాని మన క్లబ్‌కి ఫండ్స్ తక్కువగా వున్నాయి. డొనేషన్స్ సేకరించేందుకు టైమ్‌లేదు..." ప్రెసిడెంట్ ఆనందబాయి అంది మెల్లగా రాణిని ముగ్గులోకి లాగుతూ.

"ఆసంగతి నాకొదిలెయ్యండి...."

"నేన్చెప్పలేదూ— రాణిగారు నిజంగా మహరాణేఅని. ఆవిడచేతికి ఎముక లేదు. మీరు మంత్రి అయితీరాలి. మీవల్ల మహిళా సంఘాలకెంతో ఉపకారం జరుగుతుంది. ఫండ్స్‌ప్రాబ్లం సాల్వ్ అయిందిగనుక మిగతా ముఖ్యుల్ని కలిసి కార్యక్రమం నిర్ణయిద్దాం"

అర్జంటు పనిమీద వెళ్ళినట్టు రామ్‌కి చెప్పమని నౌకర్తోచెప్పి వాళ్ళతోబాటు వెళ్ళిపోయింది రాణి.

మరో అరగంటకి హుషారుగా వచ్చిన శ్రీరామ్ సంగతి వింటూనే ప్రాన్పడిపోయాడు. అసహనంతో ఆవేదనతో మండిపోయాడు. టీనీ లైనా తాగకుండా తిరిగి ఆసుపత్రికెళ్ళిపోయా

డు. కనీసం రోగుల సేవలోనైనా మనశ్శాంతిలభి స్తుందని!

ఆలస్యంగా వస్తానన్న డాక్టర్ వెంటనే తిరిగొచ్చేసరికి నర్స్ సోఫియా ఆశ్చర్యపోయింది. అతడి ముఖంలో తనక్కావల్సిన లక్షణాలు కన్పించగా తృప్తిగా నిట్టూర్చింది.

ఆసుపత్రిలో జేరినప్పట్నుంచీ ఆమె శ్రీరామ్‌కి దగ్గరవ్వాలనే ప్రయత్నిస్తోంది. కానతడు తన ఆకర్షణలో పడకపోయేసరికి విలవిల్లాడుతోంది. డబ్బున్న మగాడితోడు లేకపోతే తన అవసరాలూ, సుఖాలూ గడవ్వుమరి!

డాక్టర్ శ్రీరామ్ భార్య ప్రవర్తనకి అసంతృప్తితో వేగిపోతున్నాడని విన్నప్పట్నుంచీ సమయం కోసం వేయికళ్ళతో ఎదురు చూస్తోంది.

ఆసమయం ఇప్పుడొచ్చేసిందనుకుని సంబరపడింది. ఇటువంటి స్థితిలోనే మగాళ్ళు తేలిగ్గా బుట్టలోపడతారని స్వానుభవంద్వారా తెలుసామెకి!

"మే ఐ కమిన్ సార్" అంటూనే జవాబు కోసం ఎదురుచూడకుండా కన్సల్టింగ్ రూమ్‌లో కెళ్ళింది.

టేబుల్ మీద తల ఆన్చి నీరసంగా పడుకున్న శ్రీరామ్ సర్దుకుని కూర్చున్నాడు. "ఎనీ కంప్లయింట్స్...?"

ఆమె అందమైనది గాకపోయినా అందమైన ఒంపులూ హంగులూ వున్నాయనుకున్నాడు. ఆమెలో మత్తుజల్లే ఆకర్షణ వుందనుకున్నాడు ప్రథమంగా.

"మీరేదో టైర్డ్‌గా కన్పిస్తోంటేనూ...

"యస్... మనస్సు బావుండలేదు"

"అదేవిటి డాక్టర్... చక్కని భార్య, మంచి ప్రాక్టీసు, ఆస్తి పాస్తి అన్నీ వుండికూడా మీరిలా ఇదవటం..."

"అన్నీ వుండి అయిదోతనం లేనట్టుంది నా పరిస్థితి. మనశ్శాంతి కరువైపోయింది బొత్తిగా... ప్చ్!"

"భలేవారే. మనశ్శాంతి మనస్సుకి సంబంధించింది. మనస్సు వాతావరణాన్ని బట్టి ప్రతిస్పందిస్తుంది"

"ఆ వాతావరణమే నన్నీ డిప్రెషన్‌లోకి లాగుతోంది"

"అటువంటప్పుడు కావాల్సిన వాతావరణం సృష్టించుకోవడమే తగిన మందుడాక్టర్"

ఆమె నవ్వుతూ చొరవగా డాక్టర్ ఫ్రిజ్ తెరచి బీర్‌సీసా గ్లాసు బయటికి తీసి కొంచెం పోసి అతడి ముందు పెట్టింది.

అతడికిది అమెరికాలో అయిన అలవాటు. ఎవరూ చూడకుండా మధ్య మధ్యలో తాగుతూంటాడు. అలాంటిదీమెకెలా తెలిసింది? పైగా తన మనస్సు తెలిసినట్టు ప్రవర్తిస్తోంది!

అతడు మౌనంగా సిప్‌చేస్తోంటే అంది సోఫియా-

"మీరిలా అశాంతితో ఆరోగ్యం పాడుచేసుకోకూడదు. మీవల్ల ఎందరెందరో రోగులు ఆరోగ్యవంతులై వెళ్తున్నారు. మీరెంతో సుఖంగా వుండాలని దీవిస్తూ వెళ్తున్నారు. వారి దీవెనలు వృధాకాకూడదు. మీరెంతో ఆనందంగా ఆరోగ్యంగా వుండాలి. మీవల్ల ఎందరో పూర్ణారోగ్యులై మీపేరు చెప్పుకుని వాళ్ళిళ్ళల్లో దీపాలు పెట్టుకోవాలి. వాళ్ళపిల్లలకి మీ గొప్పపేరు పెట్టుకోవాలి. అందుకోసమైనా మీరు అనవసరవిషయాలకి అతిగా విలువిచ్చి మీ విలువైనకాలాన్ని అమూల్యమైన ఆరోగ్యాన్ని పాడుచేసుకోకూడదని నా కోరిక... నా విజ్ఞప్తి డాక్టర్"

ఆమె మాటలు సూటిగా అతడి గుండెల్లో ఎక్కడతగలాలో అక్కడ తగిలాయి. ఆమె అభిమానానికి చలించిపోయాడు. ఆమె తన గురించి పడుతున్న తపనకి ముగ్ధుడైపోయాడు.

ప్రశంసాపూర్వకంగా చూస్తూ "పాయింటుని పట్టుకోగలిగావ్" అన్నాడు.

"పాయింటునేకాదు డాక్టర్. నాడిని కూడా పట్టుకోగలను. ఎవరినాడి ఎలా కొట్టుకుంటుందో కూడా చెప్పగలను" అని మనస్సులో అనుకుంది- "మనస్సు బాగోనప్పుడు షికారుకెళ్తే చికాకుల్ని మర్చిపోవచ్చు. ప్రశాంత ప్రకృతిని చూసి సేదదీరవచ్చు"

"యస్యెస్ - యూ ఆర్ కరెక్ట్..."

"మీకభ్యంతరం లేకపోతే ఇందిరాపార్కుకె

ళదాం. నా డ్యూటీ కూడా అయిపోయింది''

ఆమె వంకోసారి సాభిప్రాయంగా చూసి "నాటెటాల్- థాంక్యూ సిస్టర్" అన్నాడు శ్రీరామ్మలేస్తూ.

"ప్లీజ్ డాక్టర్... నన్ను సోఫీ అని పిలవరూ?" గోముగా అడిగింది.

ఆమెవంక అర్థంగానట్లు చూసి "మిస్ సోఫీ" అన్నాడు.

అలా ఆమె వెంటవెళ్ళడం తప్పన్పించలేదతడికి.

అలా ఆమె వెంట ఇంకెంతదూరం వెళ్లిపోతానో అన్న ఆలోచనకూడా రాలేదతడికి!



"ప్రభాకర్‌గార్తో అర్జంటు పనుండి వచ్చానమ్మా"

బ్రీఫ్‌కేసుతో లోపలికొచ్చికూర్చుంటూ అన్నాడా ఆగంతకుడు.

ఈమధ్యెక్కువగా పార్టీలు ఇంటికే వస్తున్నారు. వాళ్ళతో ఇచ్చిపుచ్చుకోడాలన్నీ స్వప్నే చేస్తోంది. కాని ఇతడిమొఖం కొత్తగావుండటంతో తడబడుతూనే ఆహ్వానించింది.

"మామావగారికి ఒంట్లో బాగోలేదండీ. చూడటానికి వూరెల్లారు"

"ఆఫీసులో లీవు సంగతి కూడా చెప్పేరు. నాదేమో అర్జంటుపని. ఆయనొస్తే గాని నాకాగితాలు కదలవు. నా బిల్సు పాసవ్వవు..."

"మరెలాగండీ. లీవు పెంచుతానని వుత్తరం కూడారాశారు"

"అయితే నిలువునా అన్యాయమైపోతాను. రానుపోను చార్జీలన్నీ పెట్టుకుంటాను వెంటనే పిలిపించండి. నా పనిచేసి పెట్టివెళ్ళిపోమనండి. ఆయనకి నేను పాతకాపునేలెండి..." అంటూ బ్రీఫ్‌కేస్‌లోంచి నాలుగు నోట్లకట్టలు టీపాయ్ మీదపెట్టేడు.

ఆమె అనుమానం మరింతగా దృఢపడిపోయింది.

తనేమీ అడక్కుండా బేరమాడకుండా తనంతట తను అంత డబ్బిస్తున్నాడంటే... సందేహం లేదు. యాంటీ కరప్షన్ డిపార్ట్‌మెంట్‌వారి మనిషే. బ్రీఫ్‌కేసులో టేప్ రికార్డర్ కూడా వుండివుంటుంది...

తమని ట్రాప్‌చెయ్యడానికి...

గజగజావణికిపోయింది స్వప్న.

అతడు వెళ్ళబోతోంటే కంగారుగా అంది- "టెలిగ్రాం ఇచ్చినా ఆయనిప్పుడు రాలేరండి. ఆయన మీరనుకుంటున్నటువంటివారుకాదండి. దయచేసి డబ్బు తీసుకెళ్ళిపోండి"

చిన్నగా నవ్వేడతడు- "ముందే చెప్పేను మాది పాతపరిచయమని..."

"అయితే ఆయనొచ్చేక ఆఫీసులో కలుసుకోండి"

"కాని నా పని చాలా అర్జంటే. రేపుటెల్లుండ్లో ప్రభాకర్‌గారొచ్చి నా కాగితాలకి విముక్తి కలిగించకపోతే నా పని గోవిందే"

"అదేమో నాకు తెలీదు..."

నిస్సహాయంగా చూసి నోట్లకట్టలు తీసుకొంటోంటే ప్రభాకర్ వచ్చాడు సూట్‌కేసుతో.

"మీరా... దేవుళ్ళా వచ్చారనుకోండి" పరమానందపడిపోయాడు.

"కూర్చోండి సత్యానందంగారూ. మా ఫాదర్‌కి ఒంట్లో బాగోకపోతేనూ వెళ్ళేను. ఇప్పుడు బాగానే వుందిలెండి. ఏవిటి విశేషం?" బూట్లు విప్పుకుంటూ అన్నాడు.

"నా కాగితాలు మీ టేబుల్లో చిక్కడిపోయాయి. అమ్మాయిగారు నన్నపార్థం చేసుకున్నారు" నవ్వేడు.

కాఫీ తెచ్చిచ్చిందిద్దరికీ స్వప్న.

"రోజులు బాగాలేవు కదండీ" అని నవ్వి "స్వప్నా... వీరు సత్యానందంగారు. మనక్కావల్సినవారు" అని పరిచయం చేశాడు.

తన పని గురించి చెప్పి నోట్లకట్టలిచ్చేసి వెళ్ళిపోయాడాయన.

"సిఐడీ ఏమో అనుకుని హడలిచచ్చాననుకోండి" స్వప్న అంది.

"గుళ్ళుమింగేవాళ్ళని వదిలేసి లింగాలు మింగేవాళ్ల వెంటెందుకుపడతారే. వీళ్లంతా మొదట మా ఆఫీసర్‌కి దక్షిణ సమర్పించుకున్నాకే మనదగ్గరికొస్తారు. అంటే మనం రెండో కృష్ణుడన్నమాట"

"అదిసరేగానండి- ఇక నుంచి డబ్బుగాకుండా సరుకులిమ్మందాం"

"అమ్మగారి ఆజ్ఞ! కాని ఈ సత్యానందాన్ని నొప్పించకూడదుసుమా. పాడి ఆవు. రాజకీయాల మనిషీనూ. ఆమధ్య యమ్మేకి కడదామనిచూశాను చూడు- అప్పుడీయనే సీటిప్పిస్తానని ప్రామిస్‌చేశాడు. ఘనం వేరే యావలోపడి చదువుని అటకెక్కించేశాం" నవ్వేడు.

"పోన్లెద్దురూ... యమ్మే చదివేస్తే వుద్యోగం తేలిగ్గా వచ్చిచస్తుందా ఏమిటీ? ఏ లెక్చరర్ జాబో వచ్చినా జీతం మహావస్తే పదిహేనొందలొస్తుందేమో- అంతేకదా! అవునుగాని- మావగారికెలా వుందండీ"

"మామూలు నుస్తీయే- రెండు వేలిచ్చేసరికి ఎగిరిగంతేశారంతా. నిన్నూ నన్నూ ఒకటే పొగట్టమనుకో"

"వెయ్యి రూపాయలు చాలంటే విన్లేదు మీరు. అదుంటే ఫ్రిజ్ కొనేసుకుందుం"

"పోన్లేవేయ్- ఎంతైనా తల్లిదండ్రులు కదా. ఏదో నీదయవల్ల మన సంపాదన బాగానే వుంది. పెద్దవాళ్ళు సంతోషిస్తే వాళ్ళదీవెనలే మనల్ని చల్లగా కాపాడతాయ్"

"నిజమేనండీ. ఇక నుంచి మనం నిష్ఠగా శనివారాలు చేద్దాం. ఏడుకొండలవాడు మనల్ని చల్లగా చూస్తాడు!"

★ ★ ★

రాణి మగపిల్లాణ్ణి ప్రసవించి మూడు నెలలుకావొస్తోంది.

బారసాల అట్టహాసంగా చేసేవరకూ ఇంట్లో వుంది రాణి. ఆ తర్వాత పిల్లాణ్ణి ఆయాకి అప్పగించి తన క్లబ్బుగొడవల్లో పడిపోయింది.

ఆమె పద్ధతి నచ్చటంలేదు శ్రీరామ్‌కి. పిల్లాడు పుట్టేక ఆమె మారుతుందని ఆశిస్తూవచ్చాడిన్నాళ్ళు. ఆ ఆశ అడియాసఅయ్యేసరికి తను బిడ్డకోసం కొంత సమయం కేటాయించి సర్దుకుపో నిశ్చయించుకున్నాడు.

అవాళ హడావిడిగా తండ్రికి యస్టీడీ చేస్తోంటే- "అంకుల్ కోసమారాణీ" అనడిగాడు.

"ఊఁ... అర్జంటుగా పదివేలు కావాలి"

"మాటిమాటికీ ఆయన్నడిగితే బావుంటుందా రాణీ"

"మీరివ్వలేనప్పుడు డాడీని అడగటంలో తప్పేముంది?"

కాశ్మీర్ చూట్టానికి వెళ్తున్నామనీ పదివేలు పంపమనీ తండ్రికి చెప్పి రిసీవర్ పెట్టేసింది.

"కాశ్మీర్ వెళ్తున్నావా? నాతో మాట మాత్రమైనా చెప్పకుండా..."

"అన్నిటికీ మీ పర్మిషన్ తీసుకోవాలా? క్లబ్ వాళ్ళమంతా వెళ్తున్నాం"

"బాబుకి మూడో నెలన్నా వెళ్ళలేదు ఇప్పుడు ప్రయాణమంటే..."

"వాడినెవరు తీసుకెళ్తున్నారు! ఆయా దగ్గరే వుంటాడు"

"నీ పద్ధతిదారుణంగా వుంటోంది రాణీ. నీకు నువ్వే తెలుసుకుంటావని చూస్తోంటే రోజురోజుకీ మితిమీరిపోతున్నావ్. దిసీజ్ అన్‌పార్డనబుల్. నెలల పసివాడికి తల్లి అవసరం ఎంత వుండేదీ తెలిసి కూడా అలా బిహేవ్ చెయ్యటం రాక్షసం. ఆఖరికి పశుపక్ష్యాదులు కూడా ఇంతలా ప్రవర్తించవు. వాణ్ణి పూర్తిగా ఆయా దయాదాక్షిణ్యాల మీద వదిలేస్తే వాళ్ళెలా చూస్తారో వీళ్ళెలా తయారవుతారో కొంచెం ఆలోచించడం మంచిది"

"హియర్ హియర్" చప్పట్లు కొట్టింది.

అతడి ముఖం ఎర్రబడింది.

"మీరింతవరకూ డాక్టరే అనుకున్నాను చక్కని స్పీకర్ కూడానే. ఆయాల చేతుల్లో పెరిగితే చెడిపోతారా? మేం పెరిగింది ఆయాల చేతుల్లో కాదూ! మీలా పిల్లల్ని ఎత్తుకుని మోయాల్సిన కర్మమాకులేదు. కో అంటే కోటిమంది ఆయాలూ నౌకర్లూ వస్తారు..."





"చాల్లే సిగ్గులేని కబుర్లు చెబుతున్నావ్. బిడ్డకి పాలివ్వనంటే సహించాను. ఇప్పుడొచ్చి లేసి కాశ్మీర్ వెళ్తానంటే సహించను. నువ్వెళ్ళటానికి వీల్లేదు" అసహనంగా అరిచాడు.

"రిజర్వేషన్ చేయించేసుకున్నాం. ఊరికే ఆవేశపడటం మీ ఆరోగ్యానికి మంచిదికాదు. మన స్థానం మరచి ఎగరటం అసలు మంచిదికాదు"

తాపీగా వెళ్ళిపోయింది- అతడి గుండెల మీంచి నడచి!

శిలలా నిలబడిపోయాడు- అవమానాగ్నితో నిలువునా దహించుకుపోతూ. ధనగర్వంతో భర్తని ఈనువ్పుల్లలా తీసిపారేస్తోంది!

కన్నీళ్ళు పొంగి వస్తోంటే ఎవరూ చూడకుండా తుడిచేసుకుని కారుని సమీపించాడు.

గమ్యరహితంగా తిరుగుతోంటే సోఫియా గుర్తొచ్చింది.

ఈ ఆవేదన చల్లారాలంటే ఒక తీయని మూర్తి ప్రేమగా లాలించి ఓదార్చాలి. అది ఆమె దగ్గరే సాధ్యమనుకున్నాడు. మనస్సు వికలమైనప్పుడల్లా ఆమెతో షికారుకో పిక్నిక్కో హెూటల్‌కో బార్‌కో వెళ్తూనే వున్నాడుగాని ఆ

పరిచయమెప్పుడూ హద్దులు దాటలేదు.

కారుదిగి సోఫియా పోర్టల్లోకెళుతోంటే శ్రీరామ్‌ని చూసింది అరుణ. అతణ్ణెక్కడో చూసినట్టు లీలగా గుర్తొచ్చింది. సోఫియానడిగి వివరాలు తెలుసుకోవాలనుకుని ఇంట్లోకెళ్ళిపోయింది.

డాక్టర్ని చూసి అపరిమితానందంతో వూగిపోయింది సోఫియా.

ఆరునెలలుగా మంచి చేసుకుంటూ వాలు చూపులు విసుర్తూ దొంగ సానుభూతి ప్రదర్శిస్తూ ఓపిగ్గా షికార్లకి తోడెళ్తూ గేలం వేస్తోంటే ఇన్నాళ్ళకి చేపచిక్కిందని మురిసిపోతూ ఆహ్వానించింది.

"ఏవిటో - దారి తప్పి వచ్చినట్టున్నారు"

"నర్సువికదా మందువేస్తావని"

"బాధేమిటో చెబితే తప్పకుండా వేస్తాను" నవ్విందామె.

ఆ నవ్వు సమ్మోహనంగా అన్పించిందతడికి.

"మనస్సు బావోలేదు సోఫీ. రోజురోజుకీ రాణి ప్రవర్తన వికృతంగా మారిపోతోందనుకో. నెలలబాబుని వదిలేసి కాశ్మీర్ ట్రిప్‌కెళ్తుందిట. నేనేమైనా అంటే నా మాట లెక్కలేనట్టు మాట్లాడుతుంది. అయామ్ వెక్సింగ్ విత్ హెర్"

"ఇంట్లో సుఖశాంతులు లేకపోతే బయట వెదుక్కోవాలిగాని వెక్స్ అయితే ఎలాగండి?" మర్మగర్భితంగా అంది.

"అంటే?"

"వయస్సులో వున్న డాక్టర్‌గారికి నేను విడమర్చిచెప్పాలా. పైగా విదేశాల్లో వుండి వచ్చారాయె!"

ఆమె భావం అర్థమవ్వగా కించిత్తు విస్మయంగా చూశాడు. ఇన్నాళ్ళూ ఆమెనో నర్సుగా అర్థంచేసుకోగల చక్కని వ్యక్తిగా చూశాడు. కాని ఆమెలో తను గుర్తించని కొత్త వ్యక్తి కన్పించింది!

"మనస్సుకి నచ్చినవాళ్ళతో మనస్ఫూర్తిగా గడిపి ఆనందాన్ని జుర్రుకోవడమే. స్నానం చేసి ఇప్పుడే వస్తాను - ఫైవ్ మినిట్స్ ప్లీజ్" చిలిపిగా నవ్వివెళ్ళిపోయింది.

ఆ గది నానుకుని వున్న బాత్‌రూమ్‌లో ఆమె స్నానం చేస్తోన్న చప్పుడు విన్పిస్తూ అతడి నిగ్రహాన్ని సవాలు చేస్తోంది.

పదినిమిషాలకి వచ్చి "ఇటు చూడకండి" అంటూనే అసలే చిన్నదైన ఆ గదిలో ఓ పక్కన నిలబడి బట్టలు కట్టుకోసాగింది సోఫియా.

చూడొద్దన్నదాన్ని చూట్టానికే మనస్సెక్కువ తొందరచేస్తుంది. మనస్సుగోల భరించలేకచూశాడు.

ఏ మహాశిల్పో తన అనురాగమూర్తి ప్రతిమని అతిశ్రద్ధగా చెక్కినట్టుగా వున్న ఆమెని చూసేసరికి అతడి నిగ్రహం పూర్తిగా సడలిపోయింది. నరాలు బుసలుకొట్టాయి.

మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళి వెనకనుంచామెని కావలించుకున్నాడు శ్రీరామ్.

బెట్టు చేస్తూనే లొంగిపోయి అతడికెన్నో మధురానుభూతుల్ని మిగిల్చింది!

★ ★ ★

కాలేజీ గ్రౌండ్‌లో క్రికెట్ ప్రాక్టీసు చెయ్యడమయ్యాక కబుర్లు చెప్పుకుంటూ బయటికొచ్చారు స్వామీ, అతడి మిత్రుడు యాదగిరీనూ.

చౌరాస్తాలో ఓ కుర్రాడేవో పుస్తకాలమ్ముతోంటే పిలిచి ఓ పుస్తకం కొన్నాడు యాదగిరి.

"అదేం పుస్తకం గిరీ"

"రేస్ 'బుక్‌లే. చాయ్ తాగుదాంరా స్వామీ"

కాకా హోటల్లోకెళ్ళి కూర్చున్నారు. కేక్స్‌కి ఆర్డరిచ్చి రేస్ బుక్‌లో మునిగిపోయాడు యాదగిరి. అందులో అంత ఆకర్షిస్తోన్న విషయం ఏముందోనని ఆశ్చర్యపడ్డాడు స్వామి.

"అందులో ఏముంటుంది గిరీ"

"రేస్ బుక్‌లో ఏముంటుందో తెలీదూ? గుఱ్ఱపుడెక్కల చప్పుడు!" నవ్వేశాడు గట్టిగా.

"జోక్కాదు... నిజంగానే తెలీదురా"

"చంపావ్ ఫో. బీసీకాలంలో ఉండాల్సినవాడివి. మలక్‌పేటలో హార్సరేసెస్ జరుగుతున్నా

యనైనా తెలుసా?''

తలాడించాడు.

''అందులో పాల్గొంటున్న గుర్రాల జాతకా లూ చరిత్రలూ పుట్టుపూర్వోత్తరాలూ బిరుదుల్తో నహా అన్ని వివరాలూ ఇందులో ఉంటాయి. ఇవి స్టడీ చేసి ఏ గుర్రం గెలవడానికెక్కువ అవకాశం ఉందో అంచనావేసుకుని దానిమీద కాయొచ్చు''

''అయితే నువ్వురేసెస్ కెళ్తూంటావా?''

''డబ్బుంటే తప్పకుండా వెళ్తాను. చూ స్తూండు భాయ్-ఎప్పుడో జాక్‌పాట్ కొట్టేస్తాను''

''అది మంచి అలవాటుకాదు గిరీ. కష్టపడి సంపాదించుకున్నదాన్లో ఉన్న తృప్తి ఇంకెందు లోనూ ఉండదు''

''ఇవాళరేపు కష్టపడితే ఏమొస్తాయోయ్ పై నల్తప్ప! ఈ ఏడాదిలో మన చేతికి డిగ్రీ వస్తుంది. ఆ తర్వాత రోడ్లంట తిరగాల్సిందే మనం. కష్టపడి పనిచేస్తాం ఉద్యోగమివ్వ మంటే ఏనాకొడుకూ ఇవ్వడు. పైనలో పైర వీయో కావాలి ఫో అంటాడు''

''పాయింటే. కాని ఈ రేస్‌లూ లాటరీలూ బ్రాకెట్లూ ఇవన్నీ నిర్వహించేది లాభాలకోస మని మర్చిపోకు. లక్షమందిని కొట్టి పదిమంది కి ఇంత ఇచ్చి మిగతాది జేబులో వేసుకుంటా రు. ఎందరో అమాయకుల్ని ప్రలోభపెట్టి ఫకీ రుల్ని చేస్తోన్న ఈ జూదాలని ప్రభుత్వం నిషేధిస్తే తప్ప మనకి మోక్షం ఉండదు'' ఆవేశంగా అన్నాడు.

''నువ్వు భలేవాడివి స్వామీ. రేసులకొచ్చేది సామాన్యులు కాదు. పెద్దపెద్ద ధనికులూ ఆఫీ సర్లూ బిజినెస్ మాగ్నెట్సూనూ. ఇది హైసొసైటీ వారి వినోదమూ జూదమూనూ, అక్కడక్కడా నాలాటి కోన్‌కిస్కాగాళ్ళుంటారనుకో. అసలు మేం కాసేదెంతలే...''

''ఎంతైనాసరే. అటువంటి దురలవాటుకి స్వస్తి చెప్పు గిరీ. మీవాళ్ళెంతో కష్టపడి చెమటో డ్చి రూపాయి రూపాయి చొప్పున పోగేసి నువ్వే దో చదివి వాళ్లనేదో తవ్వి తలకెత్తుతావని ఆశించి పంపుతోంటే నువ్విలా దుబారాచె య్యడం బాగోలేదు''

గట్టిగా నవ్వేశాడతను. హొటల్లోనివాళ్ళం తా తమవంకే చూస్తూండటం చూసి ''ముందు కేక్స్ తీసుకో భాయ్'' అన్నాడు.

''నువ్వు చెప్పింది కరక్టే. నేను రేసెస్‌కి వెళ్తున్నది కూడా మావాళ్ళకోసమే అంటే నమ్ము తావా? వాళ్ళనుద్ధరించడానికే వెళ్తున్నాను. నాకు వెంటనే ఉద్యోగం వస్తుందన్న ఆశలేదు. ఈ రేసెస్ పుణ్యమా అని పాతికో యాభయ్యో వేలొస్తే మా దరిద్రం తీరిపోతుందని ఆశ... ఆరాటం!''

''ఏవిటీ... అన్ని వేలే!''

''వేలు ఏమిటి భాయ్- జాక్‌పాట్ తగిల్తే లేక్స్-లక్షలొస్తాయ్. అయిదూ పదివేలకి ముఖం వాచి ఎక్కడెక్కణ్ణుంచో పెద్దపెద్దవా ళ్ళు పరుగెత్తుకొస్తున్నారనుకుంటున్నావా? ను వ్వు నిజంగా పిచ్చోడివే. ఓసారి నాతోరా. అంతా నీకే తెలుస్తుంది. రేసెస్ అంటే లక్షలతో జూదం-అశ్వమేధయాగం!''

టీ తాగుతూ యాదగిరి చెప్పినదాన్ని గు రించే ఆలోచిస్తున్నాడు స్వామి.

★ ★ ★

రెండున్నర సంవత్సరాల కిందట స్వప్నా వాళ్ళిల్లు చూసిన వాళ్ళిప్పుడు మళ్ళీ చూస్తే వారికి తప్పకుండా అల్లావుద్దీన్ అద్భుత దీపం కథ గుర్తొచ్చి తీరుతుంది.

డబుల్‌కాట్ బెడ్-దానిమీద ఫోంబెడ్, గాడ్రేజ్ బీరువా, కలర్ టివీ, టూఇన్‌వన్, డైనింగ్ టేబుల్, సోఫాసెట్, సీలింగ్ ఫాన్స్, డ్రెసింగ్ టేబుల్, స్టీలు పాత్రలు-గేస్ స్టౌ, స్కూటర్...

ఇక గుమ్మాలకీ కిటికీలకీ ఉన్న తెరల గురించీ గోడలకి వేలాడుతోన్న పెయింటింగ్స్ గురించీ షోకేస్‌లోని బొమ్మలగురించీ చెప్పనే అక్కర్లేదు.

స్వప్న ఖరీదైన చీరల్తోబాటు నెక్లెస్, నల్లపూ సల లాకెట్ కొనుక్కొంది. ప్రభాకర్ కూడా ఖరీదైన దుస్తులే ధరిస్తున్నాడు.

ఇవన్నీ చూసినవాళ్ళకి వీళ్ళకింక దేనికీ లోటు లేదనిపించొచ్చు. కాని స్వప్న లిస్టులో ఇంకా చాలా ఐటమ్సు ఉన్నాయి.

ఇదివరకటి పోర్షన్‌కన్నా ఇప్పుడున్న పోర్షన్

పెద్దదే అయినా ఇంకా పెద్ద పోర్షన్లోకి-వీలైతే మేడలోని చక్కని పోర్షన్లోకి మారాలి. వీసీపీ, ఫ్రిజ్, వాషింగ్ మెషిన్, ఎయిర్‌కూలర్ వగైరాలు కొనాలి. చిన్న ఫ్లాట్ కొనాలి...!

ఇంకో ఏడాదిలో ఇవన్నీ కొనెయ్యాలని స్వప్న పథకం. నిజానికీ నడమంత్రపు సిరికి ముఖ్య కారణం ఆమే అని చెప్పాలి. అతడు కేవలం పార్టీలకి విజిటింగ్ కార్డు ఇచ్చి ఇంటికి పిలిస్తే స్వప్నే వాళ్ళతో అన్నీ మాట్లాడి సెటిల్‌చేసేది. ఆ పనివల్ల వారికెంత లాభమొస్తుందో లెక్క వేసి మరీ 'రేటు' చెప్పేదేమో వాళ్ళామె తెలివి తేటలకి మోకరిల్లక తప్పేదికాదు.

ఏమైతేనేం వాళ్ళు పట్టిందల్లా బంగారమవుతోంది.

స్వప్న గాలిలో తప్ప నేలమీద నడవటం ఎప్పుడో మానేసింది. ఇప్పుడామెకి రాజశేఖర్ గుర్తురావటమేలేదనలు!

కాని ప్రభాకర్ ఆమెలా సంతోషించలేకపోతున్నాడు. మొదట్లో భార్య సంతోషాన్ని చూసి తనూ సంతోషించినమాట వాస్తవమే. అయినా రానురాను అతల్లో ఏవో భయాలు ఊపిరిపోసుకుని పెరుగుతున్నాయి. రాక్షసి బొగ్గులా రగుల్తూ లోలోన కాల్చేస్తున్నాయి.

ఎర్ర టోపీని చూస్తే భయం. ఆఫీసరు పిలిస్తే భయం. ఇంటికి జీపొస్తే భయం. కొత్త కస్టమరొస్తే భయం. ఇన్ని భయాల్తో వేగలేక ఇల్లూ ఆఫీసూ తప్ప బయటికెళ్ళటం మానేశాడు. ఎవరైనా తనవంకే చూసినా నవ్వినా అదంతా తను లంచాలు తీసుకుంటున్నాడనే అనుకుని కలవరపడ్తూ నలుగుర్తో కలవటం తగ్గించేశాడు.

అయినా పూర్తిగా రాజీపడలేక అప్పుడప్పుడూ విస్కీ తాగుతున్నాడు. స్వప్న అడ్డు చెప్పలేదెన్నడూ. అదో స్టేటస్ సింబల్‌గా భావిస్తుందామె!

"ఇవాళ సరదాగా బార్‌కెళదామండీ. అమధ్య ఓ పార్టీ మిమ్మల్ని తీసుకెళ్ళాడూ- ఆ బార్‌కెళదాం" స్వప్న అడిగింది ప్రభాకర్ని.

"నువ్వొస్తావా?"

"ఆడవాళ్ళు రాకూడదా?"

"రాకూడదని కాదుగాని ఎక్కువమంది రారు"

"ఎక్కడో మన్లాటి పైతరగతివాళ్ళు తప్ప లిక్కు లిక్కు ఉద్యోగుల భార్యలెలా రాగలరండి. బార్‌కెళ్ళాలని నాకెప్పట్నుంచో కోర్గ్గా ఉంది"

"ఇంకేం... ఛలో"

స్కూటర్‌మీద రయ్‌మని ఎగిరెళ్ళారు బార్‌కి.

లోపలి వాతావరణాన్నీ రంగురంగుల బల్బుల చక్కని కాంతినీ స్టేజిమీద వాయిస్తోన్న పాశ్చాత్యసంగీతాన్నీ విని చూసి మైమరచిపోయింది స్వప్న. కొన్ని క్షణాలవరకూ ఇదే స్వర్గం కాబోలనుకుంది కూడానూ.

ఓ టేబుల్ చుట్టూ కూర్చున్న మహిళల్లో ఒకరిమీద పడింది స్వప్న దృష్టి.

ఆమె కళ్ళు మెరిశాయ్

"హాయ్ రాణీ" అంటూ లేచి వెళ్ళింది వాళ్ళదగ్గరికి.

రాణి స్వప్ననీ ఆమె దుస్తుల్నీ నగల్నీ చూసి ఔరా అని ముక్కున వేలేసుకుంది.

"మాట్లాడవేం రాణీ... ఏంజేస్తున్నావ్- ఎలా ఉన్నావ్? అన్నట్టు నువ్వు మావార్ని చూడలేదు కదూ" అని ప్రభాకర్ని పిలిచి పరిచయం చేసింది ఒకర్నొకరికి.

టై కట్టుకుని ఆఫీసర్లా వున్న ప్రభాకర్ వంకే నిలువు గుడ్లేసుకుని చూస్తుండటం చూసి "నీకు తెలీదు కదూ. లాస్ట్ ఇయర్ మావారికి ప్రమోషన్ వచ్చింది" అంది.

ముక్తసరిగా మాట్లాడి మిగతావార్ని పరిచయంచేసింది.

"మీరు కూడా మా క్లబ్బులో చేరాలి. రాణిగారిలాటి, మీలాటి యంగ్‌బ్లడ్ ముందుకొచ్చినపుడే మనం మరిన్ని కార్యక్రమాలు చేబట్టగలం. అన్నట్టు మీరెక్కడుంటున్నారు? " ఒకావిడ ప్రశ్నించింది.

"అమీర్‌పేటలో. మాకా హౌస్ కన్వీనియంట్‌గా లేదు. చక్కని హౌస్ వుంటే చెప్పండి. ఒన్ థౌజండ్ రెంట్ పేచేస్తాం..."

స్వప్న మాటలకి రాణి గొంతెండిపోయింది. ఏ నడమంత్రపుసిరో వచ్చివుంటుంది. లేక

పోతే సైపిస్టు పెళ్ళాం ఇంతిదిగా ప్రవర్తిస్తూ బార్‌కి రావడం....!

"మీరు షాంపేన్ తీసుకుంటారా, సాఫ్ట్ డ్రింకా?"

"షాంపేనే.. ఐ లైక్ ద డ్రింక్. మావారు ఆర్డర్ చేసి వుంటార్లెండి. సీ యూ" హంసలా నడుస్తూ తన టేబుల్ దగ్గరికొచ్చేసింది.

తనెన్నడూ షాంపేన్ ముఖం చూడకపోయినా అందంగా అబద్ధమాడినందుకెంతో మురిసిపోయింది. రాణికి ఫోజుకొట్టే అవకాశం చిక్కినందుకు బ్రహ్మానందపడింది.

"నాకు విస్కీ నీకు కోకోలా చెప్పేను"

"నాకు షాంపెన్ చెప్పండి.."

"నువ్వు..."

"ష్...వాళ్ళు వింటారు"

వెయిటర్‌రాగానే ఆర్డరిచ్చాడు.

కేబరే డాన్స్ మొదలవడంతో అంతా కేవలం కళ్ళకి పనిచెప్పి చూడసాగారు.

స్వప్నలాతనూ రామ్‌తో కలిసి వచ్చి వుంటే ఎంతో బావుణ్ణనుకుంది తొలిసారిగా రాణి!



గుర్రప్పందాలలో యాదగిరికి నలభై వేలు వచ్చాయన్న వార్త కాలేజీలో ఓ పెద్ద సంచలనాన్ని సృష్టించింది.

స్వామికావార్త చిన్న సైజు షాక్‌లా తగిలింది.

క్లాసులో కూర్చుని పాఠాలు వింటున్నాడన్న మాటేగాని అతడి దృష్టి లెక్చరర్ మీద లేదు. అతడి మెదడులో గుర్రాలు పరుగులుతీస్తున్నాయి.

కాలేజీని మధ్యలోనే వదిలేసి యాదగిరి రూమ్‌కెళ్ళాడు.

అతడి రూంలో ఆనందోత్సాహాలు చిందులేస్తున్నాయి. యాదగిరీ అతడి స్నేహితులు ఏదేదో వాగుతూ బ్రాందీ విస్కీ తాగుతూ చికెన్ జాయింట్లు కొరుక్కుంటున్నారు. వాళ్ళతోబాటు ముగ్గురాడపిల్లలు కూడా వున్నారు?

వాళ్ళు రమ్మని పిలుస్తున్నా విన్పించుకోకుండా వెనుదిరిగి వచ్చేశాడు.

గుర్రప్పందాలలో ఇంత మహాత్మ్యం వుందా? నిన్నటివరకూ జేబులో పాతిక రూపాయలు కూడా లేని గిరి ఇవాళ నలభై వేల రూపాయలకధిపతి? ఒకటీ రెండు కాదు నలభై వేలు - నాలుగు వందల వందలు?

నోటి తడారిపోతోంది.

హార్స్ రేసెస్‌లో కోటీశ్వరులైన వాళ్ళున్నారన్న గిరి మాటలు చెవుల్లో మార్మోగసాగాయి.

పోనీ ఒక్కసారి....ఒకే ఒక్కసారి తనూ వెళ్తే....?!

ఛా - అది జూదం. ఈజీ మనీకి ప్రలోభపడనని అరుణకి మాటిచ్చాడు కూడా. కాని.....అది మరీ చెడుది కాదు. అందుకే ప్రభుత్వం నిషేధించలేదు. జస్ట్ ఓసారి తన అదృష్టం పరీక్షించుకుంటే....అయిదారు లక్షలొస్తే.....ఓహ్-తమ బతుకులు అమాంతం మారిపోవూ?

ఆలోచనలు మెదడుని తినేస్తోంటే ఇంటికెళ్ళాడు.

పక్క పోర్షన్లోని సోఫియా అతణ్ణి చూసి యథాప్రకారం కన్నుగీటి నవ్వింది.

రోజూలా ముఖం చిట్లించలేదు. అసలు పట్టించుకోలేదు. అతడి దృష్టి ఎక్కడో వుంది మరి?

"త్వరగా వచ్చేశారేం?"

"క్లాసులు కేన్సిలయ్యాయిలే సోఫియాకి కొంచెం నట్టు లూజనుకుంటా. వెకిలిగా నవ్వుతూంటుంది.

"ఆవిడ కారక్టర్ మంచిది కాదు. ఆసుపత్రి డాక్టర్ని వల్లో వేసుకుంది. అతడెక్కువగానే వస్తూంటాడు"

"అలాటివాళ్ళు పొరుగున వుండటం

"పోనీలెద్దురూ. మన బంగారం మంచిదైతే చాలు" నవ్వింది.

ఆ రాత్రి స్వామికి నిద్రపట్టలేదు.

తన ఆలోచనల్ని అరుణెక్కడ పసిగడుతుందోనని భయపడుతూనే అదే విషయం గురించి తీవ్రంగా ఆలోచించసాగాడు?

★ ★ ★

"డాక్టర్ శ్రీరామ్‌గారున్నారా?"

వెనుదిరిగి స్వప్నని చూసిన సోఫియా ఆశ్చర్యబోయింది ఆమె అందచందాలు చూసి. ఆడవాళ్ళు అసూయపడేట్టున్న ఈమె పేషంట్లాలేదు. మరి...డాక్టర్‌గారీమె వలలో పడితే...

ముఖం ముటముట లాడిస్తూ కన్సల్టింగ్ రూమ్ చూపించింది.

"హలో... వాట్ ఎ సర్‌ప్రైజ్. రండి...చాన్నాళ్ళకి గుర్తొచ్చాం" ఆహ్వానించాడు శ్రీరామ్.

"ఎప్పటికప్పుడు ఏవో పనులూ ప్రయాణాలూ తగిలిరాలేకపోయాం- సారీ"

"ఇట్సాల్ రైట్, ఎవరి లోకాలు వారివి ఎవరి ఝుంఝూటాలు వారివి. పైగా కొత్త జీవి కూడా ఇంట్లో ప్రవేశించివుంటుంది..."

"అదేం లేదండి..." అందంగా సిగ్గుపడింది.

"ఈజిట్? ఇఫ్ ఐ యామ్ కరెక్ట్ మీ పెళ్ళై మూడు సంవత్సరాలు దాటిందనుకుంటాను"

అతడి మాటలు చురుగ్గా తగిలేసరికి నేల చూపులు చూసింది. "అప్పుడే పిల్లా పీచూ ఎందుకనీ....." చిన్న అబద్ధం ఆడేసింది.

"ఐసీ... ఏమైనా మీరు తెలివైనవారు. వయస్సు ముచ్చట్లు తీర్చుకోవాలంటే పిల్లల కోసం తొందరపడకూడదు"

చప్పున ఉదాసీనంగా మారిపోయాడతడు. మరేం గుర్తుకొచ్చిందో.

"మనం ఎన్నెన్నో అనుకుంటాం. మరెన్నెన్నో ఆశిస్తాం. కాని కడకి అనుకున్నదొకటీ, అయ్యేదొకటీ అవుతుంది. స్వర్గానికి నిచ్చెన్లు దు"

అన్నం ఉడికిందో లేదో చెప్పడానికి రెండు మెతుకులు పట్టిచూస్తే చాలు. దాంపత్యంగురించి తెలుసుకోవాలంటే వారితో రెండు మాటలు మాట్లాడితే చాలు.

అతడిగురించంతా అర్థమైపోయింది స్వప్నకి. వాళ్ళకన్నా తామెన్నో రెట్లు తృప్తిగా సుఖంగావున్నామనుకుని గర్వపడింది కూడా.

"మీరు గొప్పవారు. రాణి తెలివైంది. మరి మీరెందుకిలా పెసిమిస్ట్‌గా మాట్లాడుతున్నారో అర్థం కావట్లేదు"

శుష్కమందహాసం చేశాడు శ్రీరామ్.

"ప్రతి మనిషిలోనూ రెండు విరుద్ధప్రకృతులుంటాయి. ఒకటిపైకి కన్పిస్తుంది మరోటి కన్పించదు. నేను గొప్పవాణ్ణంటున్నారు. కాని నేను అతి సామాన్యుణ్ణి. సామాన్యుడికుండేపాటి నిగ్రహమూ ఓర్పుకూడా నాకులేవు. ఎందుకిలా జరుగుతోందంటే నేను జవాబివ్వలేను. అందులో నా తప్పు వుండొచ్చు; రాణి తప్పు వుండొచ్చు; మూడో మనిషి తప్పు ఉండొచ్చు"

అర్థమయ్యీ అర్థమవనట్లున్నాయి అతడి మాటలు స్వప్నకి!

"రాణిని నేనో ప్రేమదేవతగా ఆరాధించాను. పూజించాను. కాని ఆమె కోరికలు వేరు. మనస్తత్వంవేరు. ఎంతసేపూ షికార్లూ, క్లబ్బులూ, టూర్లూ తప్ప ఇంట్లోవాళ్ళు పట్టరు. అహంకారం, కీర్తి కాంక్ష, ధన ప్రదర్శనా కుతూహలం— ఆమెలో జాస్తి. ఈ గొడవకేంగాని— మీకు తెలుసా... ఉయార్ బ్లెస్‌డ్ విత్ మేల్ చైల్డ్..."

'రాణి చెప్పలేదే..."

"తను బిడ్డ తల్లినని మర్చిపోయిన మనిషి ఎందుకు చెబుతుందిలెండి. బాబుని చూద్దురుగాని రండి... ఇది లంచ్ టైమ్ లెండి"

అతడి కారెక్కి కూర్చుంది స్వప్న.

ఇదివరకట్లా అతడి ముందు ముడుచుకుపోవడంలేదామె. సమానహోదా వారితో మెలగుతున్నట్టు ఫీలవుతోందామె. మధ్య మధ్య నెక్లెస్ సవరించుకుంటూ హేండ్‌బేగ్ తెరచి అందులోని అద్దంలోకి చూస్తూ వాచీ అద్దాన్ని తుడుచుకుంటూ రకరకాల మేనరిజమ్స్ ప్రద

ర్నిస్తోంది కూడా!

దారిపొడవునా శ్రీరామ్ తమ బాబు చేష్టల గురించే ఉప్పొంగి చెబుతోంటే తమకీ అలాటి ఓ బాబువుంటే బావుణ్ణనుకుంది మొదటిసారిగా. బిడ్డలుపుడితే అందం పాడవుతుందని ఆమె అభిప్రాయం.

కారు దిగి కబుర్లు చెప్పుకుంటూవస్తోన్న రామ్‌నీ స్వప్ననీ చూసి నుదురు చిట్లించింది రాణి. వాళ్ళిద్దరూ అంత చనువుగా ఎప్పట్నుంచుంటున్నారు?

"హలో రాణీ— ఎవర్ని తీసుకొచ్చానో చూడు"

అప్పుడే ఆమెని చూసినట్లు చూసి ముఖానికి నవ్వుపులుముకుని ఆహ్వానించింది రాణి.

"ఏంజేస్తున్నావే రాణీ. నువ్వూ డాక్టరుగారూ ఓసారి మా ఇంటికి రాకూడదూ" నిష్ఠూరంగా అంది స్వప్న.

"ఖాళీ వుండటంలేదే. మీరెక్కడుంటున్నారు. అమీర్‌పేటలోనా?"

"ఊహూ... మలక్‌పేటలో" అంటూ ప్రభాకర్ విజిటింగ్ కార్డు అందిచ్చింది.

ఆమె డాబూ దర్పంచూస్తోంటే వింటోంటే రాణికి మతిపోతోంది. ఆమె భాగ్యం వెనుక రామ్ హస్తం లేదుకదా అని అనుమానించకుండా ఉండలేకపోయింది. రామ్ ఎవర్తోనో హొటల్స్‌లో సినిమాల్లో చూసినట్టు కొందరన్నారు. క్లబ్బులోకూడా అనుకోవడం విన్నది. కానెంతో ప్రిన్సిపుల్డ్‌గావుండే రామ్ అలా దిగజారతాడంటే నమ్మలేకుండావుంది. ఇప్పుడీ వన్నెల విసనకర్రతో ఆయన క్లోజ్‌గా తిరుగుతూండటం చూస్తోంటే అదంతా నిజమేమో అన్పిస్తోంది. అతడిద్వారా డబ్బులాక్కుని షోకులు పోతున్నారేమోననుకుని స్నేహితురాల్ని అనుమానించింది రాణి.

శ్రీరామ్ బాబుని తీసుకొచ్చాడు. ఎర్రగా బుర్రగా వున్నవాణ్ణి చూసి మురిసిపోయి ముద్దుపెట్టుకుంది స్వప్న.

"పేరేమిటి?"

"రాజానంద్... మా మావగారిపేరూ. మా నాన్నగారి పేరూ కలిసొచ్చేట్టు పెట్టాం"

"బావుంది. ఫారెన్ వెళ్ళొచ్చినా మన సెంటిమెంట్స్ మర్చిపోలేదు"

"నేవెళ్ళింది పైచదువులగ్గాని మన ఆచారాల్ని మర్చిపోడానిక్కాదుకదా"

"నా ఉద్దేశం అదికాదండీ..."

"ఐకెన్ గెస్. చంద్రుడిమీద తొలి అడుగు పెట్టిన ఆర్మ్‌స్ట్రాంగ్ అదంతా దేవుడి దయే అన్నాడు. అంచేత సెంటిమెంట్స్ అయినా అభిప్రాయాలైనా వారి వారి మనస్తత్వాన్నిబట్టీ, అవగాహననుబట్టీ వుంటాయి"

"డాక్టర్‌గారు లెక్చరర్ అయ్యుంటే బాగుండేది"

రాణికి వాళ్ళ సంభాషణ విసుగ్గావుంది. ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది.

"ఏవిటే రాణీ మాట్లాడవ్. ఇదివరకు వసపిట్టలా వాగేదానివికదా. డాక్టర్‌గారు నీ వాగుడుకేదైనా మందువేశారేమిటీ"

ఆమె మాటలూ నవ్వూ కంపరం కలిగించాయామెకి.

శ్రీరామ్ డ్రెస్‌చేంజ్ చేసుకోడానికి లోపలికెళ్ళాక అంది "ఆమధ్య కాశ్మీర్ టూర్ వెళ్ళావుటకదా. ఎలావుందే కాశ్మీర్? ఈ మేలో మేం వెళ్దామనుకుంటున్నాం"

"నేను కాశ్మీర్ వెళ్ళినట్టు నీకెవరు చెప్పేరు?"

"డాక్టరుగారే"

"ఇంకేం చెప్పేరు?"

అర్థంకానట్లు చూసిందామె మొహంలోకి స్వప్న.

"ఆయన నీకెలా పరిచయమయ్యారసలు? నేన్నీకెప్పుడూ పరిచయంచేసినట్లు గుర్తులేదే" గుండెల్లో తొలిచేస్తోన్న అనుమానాన్ని బయటపెట్టేసింది రాణి.

"ఓ... అదా నీసందేహం. మీ నర్సింగ్ హోం ఓపెనింగ్ రోజున నీకిద్దామని చిన్న ప్రెజంటేషన్ తెచ్చాన్లే తీరా అది నీకిచ్చేలోగానే నువ్వెళ్ళిపోయావ్. నన్ను నేను పరిచయం చేసుకుని డాక్టరుగారికిచ్చాను. కన్సల్టింగ్ రూంలోని చందనపు రాధాకృష్ణుల బొమ్మలేదూ అది నేనిచ్చిందే"

"ఆహా"

అప్పట్లో ఆయన స్వప్నేదో ప్రెజంట్ చేసిందంటే ఏవిటో అనుకుందిగాని దాని వెనుక ఇంతకథ వుందన్నమాట. పైగా రామ్ దాన్ని ప్రత్యేక స్థానంలో వుంచాడంటే దానివెనుక స్వప్న నెరజాణతనం తెలీడంలేదూ?

మరికొన్ని నిమిషాలు దొర్లినా ఆమె మాట్లాడకపోయేసరికి రవీంద్రభారతిలోని ఏదో ప్రోగ్రాంకెళ్ళాలంటూ వెళ్ళిపోయింది స్వప్న.

"అరె... అప్పుడే నీ ఫ్రెండ్ వెళ్ళిపోయిందా. కాస్సేపు వుండమనకపోయావా సరదాగా మాట్లాడుకుందుం" ఫ్రెషప్అయి వచ్చిన శ్రీరామ్ అన్నాడు.

"ఆసుపత్రిలోనూ కార్లోనూ మాట్లాడుకున్నది చాల్లేదా?"

"అదేంమాట రాణీ. ఇంటికొస్తే మాట్లాడటం మర్యాద. కూల్‌డ్రింక్ ఇప్పించావా అదీ లేదా?"

"దాని మొఖానికి డ్రింకు కూడానూ!"

"ఇంటికొచ్చిన ఫ్రండ్‌కి టీ నీళ్ళైనా ఇవ్వకుండా పంపించేశావా? ఛా... నీకసలు మేనర్స్ తెలుసా?"

"మీకు తెలిసినట్లు నాకుతెలీవులెండి. ఆమె నాకు ఫ్రండో మీకు ఫ్రండో గ్రహించలేనంత మూర్ఖురాల్ని కాదులెండి" విసవిసా తన గదిలోకెళ్ళిపోయింది రాణి.

నిశ్చేష్టుడయ్యాడు శ్రీరామ్.

★ ★ ★

ప్రభాకర్‌కీ అతడి ఆఫీసరుకీ వ్యతిరేకంగా కొన్ని అర్జీలు ప్రభుత్వానికీ ఉన్నతాధికార్లకీ వెళ్ళినట్టు తెలిసి బెంబేలుపడిపోయాడు ప్రభాకర్. కాళ్ళూచేతులూ ఆడనట్టూ ఊపిరందనట్టూ అన్పించి విలవిల్లాడాడు.

ఈమధ్య ప్రభాకర్లోని మెతకదనాన్ని కనిపెట్టి చేరదీశాడు ఆఫీసరు. ఇద్దరూ కలిసి మూడో కంటికి తెలీకుండా చాలా చేశారు. మూడు పువ్వులూ ఆరుకాయలుగా వెలుగుతోంది వారి పైపాటు.

తమ బంధం భాగ్యం చూసి ఆఫీసులోని కొందరు కుళ్ళుపడటం ప్రభాకరం గమనించకపోలేదు. ఆఫీసరు అండవుండగా తనకేం ఫర్లేదని పట్టించుకోలేదు.

కానిప్పుడు రిపోర్టుల సంగతి తెలిసేసరికి గట్టునవడ్డ చేపలా కొట్టుకున్నాడు.

ఆఫీసవ్వగానే ఆఫీసరింటికి పరుగెత్తాడు. 'మహాప్రభో— మీరే రక్షించాలి' అని వేడుకున్నంత పనిచేశాడు.

ఆయనకీ ఆందోళనగానే ఉంది. దాన్ని కప్పిపుచ్చుకుంటూ హామీ ఇచ్చారు. ఇద్దరూ చెరో కొంత వేసుకుని హెడ్డాఫీసులోని కొందరికి లంచాలు పెట్టారు. కొన్ని కాగితాల్ని మిస్ చేయించారు. కొన్ని ఓవర్‌లుక్ చేయించారు. ఇంకేమీ ఫరవాలేదనుకుని హాయిగా నిట్టూర్చారు. ఖర్చుపెట్టింది వడ్డీతో రాబట్టడానికి మరింత విజృంభించారు.

అయితే కొన్ని రిపోర్టులు అవినీతి నిరోధకశాఖకి వెళ్ళిన సంగతి వారికి తెలీదు.

"ఇకనుంచి మనం జాగ్రత్తగా ఉండాలి స్వప్నా. సామాన్లవీ మీవాళ్ళు మావాళ్ళు పెట్టారని అందరికీ చెప్పాలి. ఇంటికెళ్ళి వాళ్ళక్కూడా చెబుదాం. స్కూటర్ని కొన్నాళ్ళపాటు మాబావగారి దగ్గరుంచుదాం" ప్రభాకర్ అన్నాడు.

"మీరనవసరంగా భయపడకండి. పట్టుకోవడమంటూ జరిగితే మీ ఆఫీసర్ని పట్టుకుంటారుగాని మిమ్మల్ని కాదు. అతడిది ముప్పావలావాటా అయితే మీది పావలాయేకదా"

"అలా అని అలక్ష్యం పనికిరాదు. మనం హంగులమీదెక్కువగా పెట్టకుండా వుండాల్సింది. పొలమో షేర్లో కొనివుంటే ఇంత బహిరంగంగా కన్పించేదికాదు"

"ఇప్పుడొచ్చిన నష్టమేమీలేదుగాని మా ఇంటికీ మీ ఇంటికీ వెళ్ళి అన్నీ సర్దుకునొద్దాం- పదిపదిహేనురోజులు లీవుపెట్టెయ్యండి"

"అవునేవ్... కొన్నాళ్ళు దూరంగా ఉండటం కూడా మంచిదే"

లీవుపెట్టి ప్రయాణమయ్యారు స్వప్నా- ప్రభాకరూ.

సికిందరాబాద్ స్టేషన్లోకెళ్ళబోతోంటే వాళ్ళకి అరుణ కన్పించింది.

"హాయ్ అరుణా! ఏవిటిక్కడున్నావ్?"

"నువ్వా స్వప్నా— ఎన్నాళ్ళకెన్నాళ్ళకి కన్పించావు. బావున్నావా? ఆయన బావగార నుకుంటాను"

"బావగారే" అంటూ పరిచయంచేసింది. "ఏవిటే...ఇక్కడున్నావ్. ఏదైనా ఇంటర్వ్యూకొచ్చావా?"

"మూడేళ్ళనుంచి ఇక్కడే ఉద్యోగం చేస్తున్నాను. నీ ఎడ్రస్సు తెలీక కల్సుకోలేకపోయాను. రాణీ పార్వతీ శోభా ఏం చేస్తున్నారే? ఏమైనా లెటర్స్ రాస్తున్నారా?"

"మిగిలినవాళ్ళ సంగతి తెలీదుగాని రాణి ఇక్కడే అశోక్‌నగర్లో ఉంటోంది. రాణీ నర్సింగ్ హెూమ్ వాళ్ళదే"

"ఆ డాక్టరు రాణి భర్తా?"

"అంత ఆశ్చర్యపోతున్నావేం? ఫారన్లో చదివాడూ అతడే"

"మా ఇంటి పక్కనో నర్సు ఉందిలే. ఆమె కూడా ఆ ఆసుపత్రిలోనే పనిచేస్తోంది"

"అలాగా... రాణి భర్త డాక్టర్ శ్రీరామ్ చాలా మంచివాడే. రాణికింకా తలబిరుసు పోలేదు. పాపం ఆయన్ని రాచిరంపానపెడ్తోంది. మరి నీ సంగతేమిటే...ఎవరో ప్రెస్సుపనివాణ్ణి చేసుకున్నావని ఆమధ్య ఇంటికెళ్ళినప్పుడు మా అమ్మ చెప్పింది. అంత చదివినదానివి అంత కర్మేంపట్టిందే"

"మట్టిలోనే మాణిక్యాలుంటాయ్"

వింతగా చూసింది "మాణిక్యమో మసిబొగ్గో. నువ్వు చేసిన పని మరీ చీప్‌గా వుంది. అతడిక్కడే వుంటున్నాడా? ఇంకా ప్రెస్సులోనే చేస్తున్నాడా?"

తేలిగ్గా నవ్వేస్తూ అంది అరుణ - "డిగ్రీ ఫైనల్ చదువుతున్నారు"

"ఏమిటీ?! చదువుకుంటున్నాడా ఆ మానవుడు? నువ్వు వుద్యోగం చేసి సంపాదిస్తోంటే టింగురంగా అంటూ కాలేజీకెళ్తున్నాడా సిగ్గు సిగ్గు" బుగ్గలు నొక్కుకుంది.

"ఇందులో సిగ్గేమిటే. నేనే చదివిస్తున్నాను. చదువుకీ విజ్ఞానానికీ వయస్సు పెళ్లీ అడ్డంకికావు కదా"

"బావుంది. రాణి నిన్ను కామ్రేడ్ అని ఎందుకేడిపించేదో ఇప్పుడర్థమవుతోంది. అంతా ఒకరకంగా ఆలోచిస్తే నువ్వింకోరకంగా ఆలోచిస్తావు. ఇంతకీ ఏం వుద్యోగం చేస్తున్నావే మిటి?"

"ఓ ప్రైవేటు కంపెనీలో పి.ఎ.గా"

"పి.ఎ.గా చేస్తూ అలాటివాణ్నెలాకట్టుకున్నావే బాబూ! ఇంచక్కా మే మేనేజర్ని మంచి చేసుకుని మూడు ముళ్లూ వేయించుకోక"

"ఇది నీ అభిమానరచయిత్రి నవల కాదోయ్ వాస్తవప్రపంచం. పైగా మా మేనేజర్ ముసలాయన" నవ్వింది అరుణ.

"ఏమో బాబూ... నీ పద్ధతి నాకు నచ్చదు. అప్పుడప్పుడు వస్తుండవే" అంటూ విజిటింగ్ కార్డు ఇచ్చింది.

వాళ్లకి వీడ్కోలు చెప్పి 'అప్పటికీ ఇప్పటికీ స్వప్నేం మారలేదు' అనుకుంటూ సిటీ బస్సెక్కింది అరుణ.

లకడీకాపూల్‌లో దిగి ఇంటికి వెళ్లింది.

గదిలో మంచం మీద బోర్లాపడుకుని వున్నాడు స్వామి. అతడు పడుకున్న తీరు ఆమెకేదో అనుమానం కలిగించింది. నుదుటిమీద చెయ్యేసి చూసింది.

అతడి కళ్లనుంచి కారుతోన్న కన్నీటిని చూసి నిరుత్తరాలయింది.

"అదేవిటండీ... ఆ కన్నీళ్ళేవిటి? ఏం జరిగిందసలు?" గాభరాపడింది.

"ఏమీ కాలేదులే కంగారుపడకు. కుక్కతోకకీ మనిషి బుద్ధికీ చాలా దగ్గరి సంబంధం వుంది అరుణా"

"ఉంటే? ఇప్పుడేమయింది?"

"శిక్షపడింది" అంటూ కుడి చెయ్యి ముందుకి చాపాడు.

అరచెయ్యి మీద ఇంటూ మార్కులు కాలిన బొబ్బలు!

"అయ్యో - ఇలా ఎలా కాలిందీ?"

"కాలలేదు కాల్చుకున్నాను"

"మీరు కాల్చుకున్నారా?" గబుక్కున కన్నీళ్లు జలజలారాలిపడ్డాయ్ అతడి చేతుల మీద.

[illegible]
కన్నీళ్లు కాదు. తుడిచేసుకో అరుణా! నేను బతికుండగా కళ్లనీళ్లు పెట్టుకోనివ్వనని ఇదివరకే చెప్పేను'' అంటూ ఆమె కన్నీళ్లు తుడిచాడు.

"మీ చెయ్యి కాలితే..."

"చేతులు కాలటంతోనే ఆగిపోయినందుకు సంతోషించాలి"

"ఏం జరిగిందో చెప్పండి" వెళ్లి బర్నాల్ తెస్తూ అంది.

"ఏమీ రాయొద్దు. ఈ మాత్రం బాధ భరించాల్సిందే"

"ఈ శిక్ష చాలుగాని చేసిన తప్పేమిటో చెప్పండి" బర్నాల్ రాస్తూ అడిగింది.

"నా ఫ్రెండ్ యాదగిరి హార్స్ రేసెస్‌కి వెళ్తాడని తెలిసి మందలించాను. అయినా వాడు విన్లేదు. కితంవారం వాడికందులో నలభై వేలొచ్చాయి. వాడి అదృష్టం చూసేసరికి నా కళ్ళకి బైర్లుక్రమ్మాయి. బుర్రలో గుర్రాలు పరుగెత్తాయి. నువ్వు పెట్టెలో దాచిన డబ్బు దొంగతనం చేసి రేసెస్‌కి వెళ్లేను. లక్షలు సంపాదించి అందర్లా అమాంతం గొప్పవాళ్లయిపోవాలనుకున్నాను. అది తప్పనీ వ్యసనమనీ ఓవక్క మధనపడుతూనే బలహీనుడ్నై వెళ్లేను. పట్టుకెళ్ళిందంతా ఊడ్చిపెట్టుకుపోయింది. వివేకం నశించి వాచీని అయినకాడికి అమ్మేసి కసిగా మళ్లీ పందెంకాశాను. ఘోరంగా ఓడిపోయాను. చూశావా అరుణా... నేనెంతగా పతనమయ్యానో. నన్నో మనిషిగా ఉన్నతుడిగా తీర్చిదిద్దాలని నువ్వు అహోరాత్రాలు తపిస్తోంటే నేను దొంగగా జూదరిగా దిగజారిపోయాను" ఏడ్చేశాడు.

"ఏమండీ!"

"నువ్వు నన్ను అందంగా చెక్కేవుగాని ఒకటి మర్చిపోయావు అరుణా. ఆ మర్చిపోయిన వాతల్ని నాచేతిమీద నేనే చెక్కుకున్నాను. ఇంకెప్పుడూ ఇలా పతనమవ్వకుండా ఆత్యాశకి లొంగకుండా ఇది అనుక్షణం నన్ను హెచ్చరిస్తూంటుంది. నేను చేసింది క్షమించరాని కార్యమని తెలును. అయినా అడుగుతున్నాను - ఈ ఒక్కసారికీ క్షమించగలవా అరుణా?"

[illegible]
చేసింది"

"నువ్వు నాకు కొనిచ్చిన వాచీని అంటే నామీద నీకున్న నమ్మకాన్ని అమ్మేసిన దౌర్భాగ్యుణ్ణి!"

"ఛా... ఆడపిల్లలా పిరికివారిలా ఏడవ్వొద్దు. అయిదారు వందలు పోయాయి - అంతే కదా. అవి పోకుండా రెండు మూడు వేలు వచ్చివుంటే ఆ డబ్బుతోబాటు ఇంకెంత పోగొట్టుకునేవారో ఆలోచించండి. ప్రతి మనిషీ కొన్ని కొన్ని బలహీనక్షణాల్లో కొన్ని కొన్ని తప్పులు చేస్తూంటాడు. అది తెలుసుకుని తప్పులు దిద్దుకున్నవాడే మనిషీ మహాత్ముడూ అవుతాడు. సిగ్గువిడిచి చేసిన తప్పు విప్పి చెప్పేరు. బాధపడ్డారు. తప్పని గ్రహించి లెంపలేసుకున్నారు. అది చాలదన్నట్లు శిక్షకూడా విధించుకున్నారు. అగ్నిపునీతులయ్యారు. ఇక ఆ దుష్టఘటన మర్చిపోండి"

"నీదెంత విశాల హృదయం. నీ ప్రేమకీ పూజకీ నేను అర్హుణ్ణేనా?"

"అలాటి పిచ్చి ఆలోచనలకి స్వస్తి చెప్పి దృష్టి చదువుమీద కేంద్రీకరించండి. పరీక్షలకింక నెలరోజులే టైముంది. ఆమధ్య అప్లయి చేసిన యూనియన్ సర్వీస్ కమిషన్ పరీక్షలు మే నెలలో వుంటాయిట. కబుర్లు కాదు... ఫస్టున పాసవ్వాలి"

"అమ్మగారి ఆశీర్వాదముంటే అయ్యగారిట్టే పాసైపోతారు"

"ఆ శుభఘడియ కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తున్నాను"

"అన్నట్లు ఒక దుర్వార్త అరుణా..."

కలవరంగా చూసిందామె

"యాదగిరి చనిపోయాడు!"

"మైగాడ్! ఎలా చనిపోయాడు?"

"గుర్రప్పందాలలో డబ్బువచ్చినప్పట్నుంచీ స్నేహితులకి పార్టీలిస్తూ ఎడతెరిపి లేకుండా తాగుతూనే వున్నాడు. మరీ డోసు ఎక్కువై మరణించాడో లేక డబ్బు కాజెయ్యడానికెవరైనా మత్తు కలిపి హత్యచేశారో తెలీదు. పోలీసులు

చూస్తున్నట్టు. ఇంతక్రితం అలాగే వాడిరూముకెళ్ళి చూసొచ్చాను''

''పూర్ ఫెలో!''

''వాడు పూర్‌ఫెలో కాదు అరుణా... వాడు అదృష్టవంతుడే. హాయిగా చనిపోయాడు. కాని వాణ్ణే నమ్ముకుని వాడేదో వుద్ధరిస్తాడని వేయికళ్లతో ఎదురు చూస్తోన్న వాడి తల్లితండ్రుల్నీ చెల్లెల్నీ తమ్ముళ్లనీ తలచుకొంటొంటే గుండెలు బద్దలవుతున్నాయి అరుణా! ఇక వాళ్లీ వార్తనెలా తట్టుకోగలరో ఎంతగా తల్లడిల్లుతారో తలచుకుంటేనే గుండెలు బరువెక్కుతున్నాయి''

''అవును... అతడికథ తెలిసిన వ్యసనపరులంతా తమ గురించిగాక తమమీద ఆధారపడినవారి గురించొక్కసారి ఆలోచిస్తే ఎంత బావుణ్ణు!''

★ ★ ★

కూతురూ అల్లుడూ తమకి కొత్తబట్టలు తెచ్చినందుకెంతో పొంగిపోయారు విశ్వనాథం దంపతులు. అల్లుణ్ణి వేనోళ్ల పొగట్టమేగాక కూతురి అదృష్టానికి మురిసిపోయారు కూడా.

కాని ఆ సంతోషం ఆట్టేసేపు నిలవలేదు.

తమ ఇంటి గురించీ హోదాగురించీ సామాన్లగురించీ ఖర్చుల గురించీ స్వప్న అదే పనిగా వర్ణించి చెప్పింది ఇంటిల్లిపాదికీ.

శాంతమ్మకేదో భయంగా అన్పించి ''అల్లుడిగారికి మళ్ళీ ప్రమోషనొచ్చిందా?'' అనడిగింది.

''లేదమ్మా... పెళ్లైన కొత్తలో రావడమే''

''మరీ మూడేళ్లలో అంతసామానూ, బంగారం ఎలా కొన్నారే?''

''అక్కడే వుంది మీ అల్లుడి గొప్పతనం'' అంటూ అసలు సంగతి దాటవేసింది స్వప్న.

ఆవిడ కంగారుపడిపోయి తన అనుమానాల్ని భర్తముందు కక్కేసింది.

నాకూ అనుమానంగానే వుంది. మెల్లగా కనుక్కుంటానుండు'' విశ్వనాథం అన్నారు.

''సందేహం లేదు. లంచాలు తీసుకుంటున్నట్టున్నారు. అల్లుణ్ణి మందలించండి. అసలే రోజులు బాగలేవు. చనకమా గవ్వలు చెప్పడమే పనాయె'' కళ్లద్దుకుందావిడ.

స్వప్నలో వచ్చిన మార్పు చూడగానే గ్రహించేశారు విశ్వనాథం. అల్లుడి దగ్గర ఎలా కదవటమో, అతడు నొచ్చుకోకుండా ఎలా హెచ్చరించడమో తెలీక సతమతమవుతున్నారాయన. భార్యమాటలు విన్నాక ఆలస్యం అమృతం విషం అనుకునో నిశ్చయానికొచ్చేశారు.

పిచ్చాపాటీ మాట్లాడుతూ ప్రభాకర్ని పార్కుకి తీసుకెళ్లారు విశ్వనాథం.

''ఈమధ్య స్కూటరూ అదీ ఇదీ కొన్నారట... అమ్మాయి చెప్పింది. మీ నాన్నగారేమైనా డబ్బిచ్చారా?''

''అబ్బే... లేదండీ'' ఇబ్బందిగా కదిలాడు.

''పై రాబడేమైనా...''

''కొంచెంగా.. మా ఆఫీసరు బలవంతంమీద అప్పుడప్పుడూ... నేనుగా ఎవర్నీ అడగటం లేదండి'' తను నిమిత్తమాత్రుడిన న్నట్లన్నాడు.

''ఆఫీసర్లతో వ్యవహారం కత్తిమీద సాములాటిది. ఎటుతిరిగి ఏమొచ్చినా మొదటిదెబ్బ మనకే తగుల్తుంది. మనల్ని ఇరికించి వాళ్ళు తప్పుకోగలరు. ఇలాటి వ్యవహారాలకి ఎంత దూరంగా వుంటే అంతమంచిది. ఎంతో భవిష్యత్తున్నవాడివి. చిన్న చిన్న ప్రలోభాలకి లొంగిపోవడం మంచిదికాదు''

''అలాగేనండి- ఇక వాటి జోలికి పోను''

''వీలైతే సీటు మారిపో''

''మారిపోతానండి. మా ఫర్నిచర్ కొంత ఇక్కడికి పంపిస్తాం. ఎవరైనా వచ్చి ఎంక్వైరీ చేస్తే బెడ్డూ బీరువాలాటివి మీరు కొనిచ్చినట్టు చెప్పండి''

''ఎంక్వయిరీయా? ఏమైనా గొడవగా వుందా?'' గాభరాగా అన్నారు.

''గొడవ కాదనుకోండి. మా గురించి కొన్ని రిపోర్టులు వెళ్లేయని తెలిసింది. మేనేజ్ చేసేశామనుకోండి. అయినా...''

వ్యవహారం తను వూహిస్తున్నదానికన్నా దూరమెళ్ళిందని గ్రహించేశారాయన.

''తెలివైనవాడివి. నువ్వీ విషయాల్లో ఎలా

చిక్కుకున్నావో తెలీడంలేదు. నిన్నందుకెవ రైనా ప్రోత్సహించారో లేక నీకే అందులో తప్పు లేదన్పించిందోగాని నువ్వు చాలా పెద్ద తప్పిదం చేశావయ్యా. సరేలే... అయిపో యిందాని గురించెన్ని అనుకుంటే ఏం లాభంలే. దేవుడేం చెయ్యబోతున్నాడో, ఎలా ఒడ్డుకి చేర్చనున్నాడో"

గాఢంగా నిట్టూర్చారు విశ్వనాథం.

చాలా తప్పుచేశానన్పించసాగింది ప్రభాకర్ కి.

ఆఖరికి అత్తవారి ముందుకూడా తలొంచుకో వాల్సివచ్చింది. రేపేమైనా జరక్కూడనిది జరి గితే బంధువుల్లో, స్నేహితుల్లో ఎంత అప్రతిష్ఠ! ఎంత అవమానం!

మథనపడ సాగాడతడు.

★ ★ ★

ఫోన్ మోగగా రిసీవరెత్తి "హలో" అంది రాణి.

"నేను అరుణని మాట్లాడుతున్నాను రాణీ..."

"ఏ అరుణ?"

"కామ్రేడ్ అరుణని"

"ఓ... నువ్వా ఎక్కణ్ణుంచి ఫోన్ చేస్తు న్నావ్?"

"మా ఆఫీసునుంచి. నీతో ఓ ముఖ్యవి షయం మాట్లాడాలి. నీ పక్కనెవరూ లేరుగా?"

"లేరుగాని ఏవిటంత విశేషం?"

"నువ్వేమీ అనుకోనంటే..."

"అనుకునే విషయమా?"

"ఊఁ..."

"అనుకోన్లే చెప్పు"

"నీవరకూ వచ్చిందో లేదోగాని మీవారికి మీ ఆసుపత్రిలో పనిచేసే నర్సు సోఫియాతో సంబంధం వుంది. కళ్లారాచూసిన సంగతి చెబుతున్నాను. నువ్వెందుకాయన్ని దారిలోకి తెచ్చుకోలేకపోతున్నావో తెలియదు. డాక్టర్గా రు తనని రెండో పెళ్లిచేసుకోబోతున్నట్లు ప్ర చారం చేస్తోంది నర్సు. మిమ్మల్ని బ్లాక్మె యిల్ చెయ్యొచ్చు..."

"నీకెలా తెలుసు?"

"సోఫియా మా ఇంటిపక్కనే వుంటోంది. అర్థంలేని అభిమానానికి పోకుండా వ్యవహారం చక్కదిద్దుకుంటావని చెబుతున్నాను"

"ఐనో ఇట్. ఒకరి సలహా సానుభూతీ నాకన వసరం" విసురుగా రిసీవర్ పెట్టేసింది రాణి.

ఆమె మనస్సూ శరీరమూ ఆగ్రహంతో అవ మానంతో భగ్గున మండుతున్నాయి.

రామ్కీ- సోఫియాకీ సంబంధం వున్నట్టు క్లబ్బులో చెప్పుకోవడం తనూ వింది. అందుకు తనే కారణమన్నట్లు తనని విమర్శిస్తూ చెప్పు కొంటోంటే [illegible]సింది కూడా. త[illegible] తింటూ [illegible] పేర్లుపెడుతున్న విశ్వా[illegible] లు!

వాళ్ల నవ్వులే భరించలేకపోతోంటే పుండు మీద కారంపడినట్టు అరుణ సానుభూతి ఒకటి.

వీటంతటికీ మూలకారణం రామ్.

అతణ్ని తన కోపాగ్నితో భస్మంచేసెయ్యాల నుకొంటోంటే వచ్చాడతడు.

"అలా వున్నావేం రాణీ?" శ్రీరామ్ అడిగా డు.

"మీరు రెండో పెళ్లిచేసుకుంటున్నారని తెలిసి కుళ్లికుళ్లి ఏడుస్తాననుకున్నారా?"

"డోంటాక్ రబ్బిష్"

"అరవకండి ఊరికే. మీకేం లోటుచేశామని ఆ నర్సుతో సంబంధంపెట్టుకోవాలి? మిమ్మల్ని విదేశాలకి పంపి చదివించి నన్నిచ్చి పెళ్లిచేసి ఆసుపత్రి కట్టించిచ్చి కారుతోసహా అన్నీ ఇచ్చి నెత్తిమీద పెట్టుకుని పూజిస్తున్నందుకు కృత జ్ఞత ప్రదర్శించడంపోయి కృతఘ్నుల్లా ప్రవర్తి స్తారా? మీరు మనిషేనా? ఒకబిడ్డ తండ్రి అయివుండి కూడా సిగ్గులేకుండా ఒక నర్సు వెంట పరుగెడతారా? ఛీఛీ- మనిషై పుట్టి నందుకు ఒక బుద్ధీ ఒక కృతజ్ఞతా ఒక బాధ్యతా వుండాలి"

"కృతజ్ఞత వుండాలి. కాని దానికో హద్దుంది... ఆ హద్దు దాటితే?"

"ఎవరు దాటారు?"

"నువ్వు... నువ్వు... నువ్వు... మూడుసార్లు కాదు- ముప్పయిసార్లంటాను. నిన్నెంతగా ప్రే

మించానో ఎంతగా ఆరాధించానో నీకోసం ఏంచెయ్యడానికైనా ఎందుకు సిద్ధపడ్డానో నీకు తెలీదూ? కానీ నువ్వేం చేశావు... పెళ్లయ్యాక ఒకరోజైనా ఒక అర్ధాంగిలా, ఒక తల్లిలా, ఒక ఇల్లాలిలా ప్రవర్తించావా- లేదు... లేదు. నీకు క్లబ్బులూ, కబుర్లూ, పెద్ద స్నేహాలూ, పార్టీలూ ముఖ్యం. భర్తతో బిడ్డతో సరదాగా గడపటానికి క్షణం కూడా తీరికలేనంత బిజీస్టార్‌వి. నేను గనుక నువ్వింకా మారతావు మారతావని ఇన్నాళ్లు నిరీక్షించాను. నువ్వు మారవని తెలిశాక నేను మారాను. నేనేకాదు- నీలాంటిదాన్ని కట్టుకున్న ఎవరైనానరే అలాగే మారతారు. నిన్నటి వరకూ నిర్లక్ష్యంగా ప్రవర్తించి అన్నిటినీ త్రోసిరాజనేసి ఇవాళ అయ్యో అంతాపోయిందే అని విచారిస్తే ప్రయోజనం లేదు. నువ్వు సరిగ్గా వుండివుంటే మన దాంపత్యం, మన సంసారం వీధినపడేదికాదు. నలుగురి నోళ్లలో నలిగేదీ కాదు''

''దీనికంతటికీ కారణం నేనేనంటారు. మీ కిందులో ఏమాత్రం భాగం లేదంటారు... అంతేనా మీరనేది?''

''ఇందులో నా బాధ్యత లేదని దబాయించడం లేదు. కాని నీ నిర్లక్ష్యమే, నీ అహంకారమే, నీ ప్రవర్తనే నన్నిలా మార్చాయంటున్నాను; నా ప్రవర్తనకి ముమ్మాటికీ నువ్వే కారణమంటున్నాను. ఇంట్లో అన్నం దొరికితే ఎవరూ ముష్టికోసం పరుగెత్తరు. ఇల్లాలు సరిగా వుంటే ఏ మగాడూ పరాయి ఆడదాని పెదవుల కోసం పాకులాడాడు. మగాడి విజయానికే కాదు- వినాశనానిక్కూడా కారణం ఆడదే'' ఉద్రేకంతో ఊగిపోతున్నాడు శ్రీరామ్.

''అనండి... ఇష్టమొచ్చినట్లు తిట్టండి. అన్నిటికీ నేనే కారణమని అంతా నన్నే అనండి- నన్ను పీక్కుతినెయ్యండి'' ముఖాన్ని అరచేత్తో కప్పుకుని ఏడ్వసాగింది.

తను తొందరపడ్డానని బాధపడ్డాడు. రాణి మనస్సు తన మాటలకెంతగా గాయపడిందోనని నొచ్చుకుంటూ ప్రేమగా పిలిచాడు.

''పొండి... వెళ్ళిపొండి. నాకు మీ ముఖం చూపించొద్దు. మీ ప్రియురాలి దగ్గరికి పొండి. దాంతోబాటు ఏ ఏట్లోనో దూకండి... పొండి'' ఏడుస్తూ అరుస్తూ సోఫాలోని తలగడలు అతని మీదకి విసిరేసి, అక్కడి సామాన్లు చెల్లాచెదురు చేసేసి తన గదిలోకి పరిగెత్తి బావురుమని కూలబడిపోయింది రాణి.

★ ★ ★

స్వప్నావాళ్లు వచ్చారని తెలిసీ అలివేణి ఆమె భర్త వచ్చారు.

తాము దోసిళ్లతో జుర్రుకుంటున్న ఆనందం గురించి వాళ్లకు కూడా చెప్పేసింది స్వప్న. తమ అదృష్టం చూసి వాళ్ళు కుళ్ళిపోతారనుకుంది. కాని వాళ్లు జడపదార్థాల్లా వుండిపోవడం చూసి ఉడుక్కుంది, విసుక్కుంది.

ఉన్నది తక్కువే అయినా సంపాదన తక్కువే అయినా నిండుకుండలా వున్నారు వాళ్ళు. వాళ్ళమాటతో నవ్వులూ ఎంతో ఆత్మతృప్తితో స్వచ్ఛతతో ధీమాతో నిండి వుండటం చూసి వులిక్కిపడిందామె.

తామెప్పుడూ కొన్న సరుకుల గురించీ కొనబోయే వాటి గురించీ పార్టీల గురించీ లంచాల గురించీ సిఐడీల గురించీ తప్ప ఇంకోదానిగురించి మాట్లాడుకునెరగరు. ఎన్నికొన్నా తమ దాహం తీరటంలేదు. ఎంత జాగ్రత్తగా వున్నా దుస్వప్నాలు వెన్నాడటం మానలేదు.

ఎన్నాళ్ళిలా?

తప్పుదారిన నడుస్తున్నారా? అగాథాల్లోకి జారిపోబోతున్నారా?

ఛా... అదేంకాదు.

భవిష్యత్తు కోసం చక్కని పునాదులు వేసుకుంటున్నారు. కలల్ని పండించుకుంటున్నారు. వాళ్ళకలాటి అవకాశాల్లేవు గనుక మడిగట్టుకుని కూర్చుని కడుపునిండిన కబుర్లు చెబుతున్నారు!

అక్కాబావల గొడవ వదిలేసి రాజశేఖర్ గురించి వివరాలు సేకరించింది స్వప్న.

అతడి భార్య గయ్యాళి అనీ, లక్షరూపాయల కట్నం తెచ్చి నెత్తిమీద కూర్చుని స్వారీ చేస్తోందనీ విని సంబరపడిపోయింది. అతడి దౌర్భాగ్యాన్ని కళ్ళారా చూడాలని రతీదేవిలా అలంకరించుకుని అతడింటికెళ్ళింది.

అతడి భార్యని చూసి ఖంగుతింది స్వప్న

తాటకిలా వుంటుందనుకుందిగాని బాగానే వుంటుందనుకోలేదు. మొహం కొంచెం కరుగ్గా వుందిగాని మరే వంకరా లేదు.

"మాస్టారు... లేరాండీ?"

"వస్తారు కూర్చో"

స్వప్న నఖశిఖపర్యంతం పరిశీలనగా చూసి అందామె "స్టూడెంటువేనా లేక ఇంకేమైనా..."

"అబ్బెబ్బే... మాస్టారు తండ్రిలాటివారు"

"ఇద్దరూ అలా అనుకుంటే ఫర్లేదు. గుర్రంలా వున్నానుకదా గంతేద్దామనొస్తే కాళ్ళిరగ్గొట్టేస్తాను"

బెదరిపోయింది స్వప్న.

"నీలాటి చాలామందికి బుద్ధి చెప్పి ఈయన ముక్కుకి తాడేసి దార్లోకి లాక్కొచ్చేసరికి తాతలు దిగొచ్చారు. ఇప్పుడు నువ్వెన్ని వేషాలేసినా గీటుదాటర్లే. మొగుడి మీద పెళ్లానికా మాత్రం పట్టులేకపోతే మగాళ్ళు బరితెగించిపోతారు"

"మీరేదో అనుకుంటున్నట్టున్నారు. నేనలాటిదాన్ని కాదండి"

"నువ్వెలాటిదానివో నీ వేషమే చెబుతోంది"

గతుక్కుమంది. ఎరక్కపోయి అలంకరించుకొచ్చాననుకుంది.

"మాస్టారు రావటానికి టైమువడుతుందనుకుంటాను. వనుంది - వస్తానండి"

"మళ్ళీ రావద్దు"

వెర్రిగా నవ్వి వచ్చేస్తోంటే చేతిలో కాయగూరలు నంచితో ఎదురయ్యాడు రాజశేఖర్.

ఒకప్పుడు మైనూర్ శాండిల్ నబ్బులా నిగనిగలాడుతూ హుషారుగా కన్నెపిల్లలు కలవరపడేలా మన్మథుడి తమ్ముడిలా వుండేవాడు!

ఇప్పుడు వండి ఎండిన నిమ్మకాయలా చవటగుండుతో కాయగూరల నంచీ పట్టుకుని ఇహ్హీహ్హీ అని నవ్వుతున్నాడు!

ఒకప్పుడు పులిలా మీసం తిప్పిన మనిషీరోజున భార్యముందు వెన్నెముకలేని నంగిమనిషి! ఒకనాటి అపరకృష్ణుడీనాడు శ్రీరాముడు!

ఎంత మార్పు... మెట మార్ఫసిస్!

కారణం? ఒక ఆడది!

మామూలు ఆడదా? కాదు... గుర్రానికి తగ్గరౌతు! రౌతుని బట్టి గుర్రం నడవక తప్పదు!

"అక్కడే నిలబడి పోయారేం. మాజీ ప్రేయసి కంటబడేనరికి రాసలీలలు గుర్తొచ్చాయా?"

ఇంకోక్షణం అక్కడుంటే ఆవిడ చీపురుకట్ట అందుకుంటుందని భయమేసి పరుగులాంటి నడకతో రోడ్డెక్కేసింది స్వప్న.

అలివేణి ఆమె భర్త రాజమండ్రి వెళ్ళిపోడానికి ప్రయాణమయ్యారు. వెళ్ళేముందామె చెల్లెల్ని గదిలోకి తీసుకెళ్ళి "నీ కడుపింకా పండలేదేమే. ఏమైనా మందులు వాడుతున్నారా?" అనడిగింది.

"లేదక్కా"

"ఓసారి డాక్టర్‌కి చూపించుకోండి. అప్పరే గాని - లేనిపోని గొప్పలకి పోకండి. అప్పులెప్పుడూ తిప్పలుతెచ్చిపెడతాయి. ఉన్నదాంతోనే సర్దుకుపోవడం అలవాటు చేసుకోవాలి"

"సర్దుకోవాల్సిన అగత్యం లేదులే. అప్పులు చెయ్యాల్సిన ఖర్మా పట్టలేదు. ఆయన సంపాదనే మాకుచాలు"

"అడ్డదార్లు తొక్కిసంపాదించింది అట్టే కాలం నిలవదు జాగ్రత్త. కాకిలా కలకాలం బతికేకన్నా కోయిల్లా కొంతకాలం బతికితేనే మంచిది. మరిదిగార్తో కూడా చెప్పు"

మూతి ముడిచింది స్వప్న.

శలవు పూర్తవగానే హైదరాబాద్ వచ్చేశారు స్వప్నాప్రభాకర్‌లు.

"మన బాగుచూసి మా అక్కకీ అమ్మకీ అందరికీ కన్నుకుట్టేసిందండి. అడ్డదార్లు తొక్కేస్తున్నారో అని ఏడ్చిపోయారంతా" స్వప్న అంది.

"మీ నాన్న కూడా అన్నారు. ఆయనన్నట్టు సీటు మారిపోతాను స్వప్నా. జరక్కూడనిది జరిగితే అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకోవాలి"

"మీరేదో ధైర్యస్తులనుకున్నాను. ఇలా నీరుకారిపోతారనుకోలేదు. లంచాలని ముద్దుగా బహుమానాలంటున్నరోజుల్లో నన్నుముట్టుకోకు నామాల కాకీ అన్నట్టు వుంటాననేవాళ్ళని మి

మ్మల్నె చూశాను''

"అదికాదు స్వప్నా..."

"మీ ఆఫీసరేమంటారో అడిగి చూడండి"

ఆఫీసులో అడుగుపెడుతోంటే ఎంతో భయంగా సంకోచంగా అన్పించింది ప్రభాకర్ కి. తను లీవులో వుండగా ఏమైనా ఎంక్వైరీ జరిగి తనకి పూస్టింగ్ ఆర్డర్ ఇస్తే... అని వూహించుకుని ఇదైపోతున్నాడు.

కొలీగ్స్ ఎవ్వళ్లూ మాట్లాడేసరికి 'హమ్మయ్య' అనుకున్నాడు. ఆఫీసరుగదిలో కెళ్ళి విష్ చేశాడు.

"చాన్నాళ్ళు లీవుపెట్టేవే - నీకోసం చాలా మంది కలవరిస్తున్నారయ్యా. త్వరగా ఫైళ్ళ దుమ్ము దులువు"

"అలాగేసార్" సీటు మార్చమని అడగాల నుకున్న కోరిక అణగిపోయింది ఆఫీసరు నవ్వు చూడగానే.

సీట్లోకెళ్ళి కూర్చున్నాడో లేదో నలుగురు పార్టీలు చుట్టేశారు ప్రభాకర్ని



బరువు జేబుల్తో వచ్చిన భర్తని చూసి ఆనందంగా అంది స్వప్న "నాకు తెలును సిరి వస్తోంటే మోకాలొడ్డరని..."

★ ★ ★

నర్సింగ్‌హోంకి వెళ్ళింది రాణి. రామ్, సోఫియా ఇద్దరూ లేకపోయేసరికి అగ్గిమీది గుగ్గిలంలా మండింది.

ఆమె ఇంటి చిరునామా తీసుకుని బయల్దే రింది - తాడోపేడో తేల్చుకోవాలని నిశ్చయించు కుని.

సోఫియా ఇంటిముందు తమకారు వుండ టంతో తేలిగ్గానే నర్సుఇల్లు గుర్తువట్టేసింది రాణి.

ఆదివారం కావడంతో ఇంట్లోనే వున్న అరుణ రాణిని చూసి అవాక్కయింది. గబ గబా ముందుకెళ్ళి ఆమెని తమ పోర్షన్లోకి

తీసుకొచ్చింది.

"కోపాలొద్దు... శాంతంగా ఆలోచించు రాణీ! నీకు అభిమానం జాస్తిఅని తెలుసు. కాని పరిస్థితి అర్థంచేసుకోకుండా తొందరపడటం మంచిదికాదు" అనునయంగా చెప్పింది.

"ఇదివరకే తొందర పడాల్సింది. చాలా ఆలస్యం చేశాను"

"అందుకే మరింత జాగ్రత్త అవసరం. వేడెక్కిన గ్లాసురెండు నీటి బిందువులు పడితే చాలు ఫట్‌మని వగిలిపోతుంది"

"కబుర్లు వినదల్చుకోలేదు. ఆయనో నేనో తేల్చిపారెయ్యాలి. మీ ఆయనేడా?"

"లేరు... ఇంజర్వ్యూకెళ్ళారు"

"చుట్టుపక్కల వాళ్లనెవర్నైనా పిలుస్తావా?"

"ఎందుకు?"

"తలుపులు బద్దలుగొట్టించి వాళ్లని బయటికి లాగుతాను. పదిమంది ముందు వాళ్ల రంకుతనం బట్టబయలు చేస్తాను. అంతా ముఖంమీదే ఉమ్మేసేలా చేస్తాను"

"దానివల్ల ప్రయోజనం?"

"వాళ్ళాఅవమానం భరించలేక చావాలి" కసిగా అంది.

"చాలా పొరబడుతున్నావు. బురదమీద రాయివేస్తే ఖరాబయ్యేది మన ముఖమే. సోఫియా ఎంతకైనా తెగించేరకం. దెబ్బతిన్న మగాడి ప్రవర్తన కూడా అనూహ్యంగా వుంటుంది. పైగా ఈమధ్య డాక్టరుగారెక్కువగా డ్రింక్ చేసి వస్తున్నారు"

"మా ఇద్దరి మధ్యా మాటల్లేవు. ఆ మధ్య ఘర్షణపడ్డాం"

"అరెరె... అందుకే డ్రింక్ మొదలుపెట్టేరన్నమాట. ముందు నువ్వు రాజీ పడాల్సింది రాణీ"

"పడను... ఆయన రాజీకోసం ప్రయత్నించారుగాని నేను సాగనివ్వలేదు. ఆయనంటే చెప్పలేనంత అసహ్యంగావుంది నాకు"

"ఒక స్నేహితురాలిగా నీ మంచికోరి చెబుతున్నాను. ఇప్పుడిక్కడేం గొడవచెయ్యొద్దు. ఇప్పుడుగాకపోయినా ఇంకాస్సేపటికైనా డాక్టర్ గారు ఇంటికి రావాల్సిందేకదా. అప్పుడు అడగాల్సిన నాలుగూ ముఖాన అడిగేస్తే మంచిది. నలుగుర్లో తప్పుఒప్పుకోడానికి మగాళ్లకి అహం అడ్డొస్తుంది. నాలుగ్గోడలమధ్య అయితే అలాటివి వుండవు. మీ ఇద్దరి అపోహలూ తొలగి మళ్ళీ సఖ్యత ఏర్పడటానికెంతో అవకాశముంది. లేకపోతే మీ నాన్నగార్ని పిలు. అన్నీ ఆయన సెటిల్ చేస్తారు. జీవితాంతం వుండాల్సిన వివాహబంధాన్ని అనవసర కోపతాపాలతో విచ్ఛిన్నం చేసుకోకు..."

అది నిజమే అన్పించింది రాణికి. రామ్‌ని బయటికి పిలిచి నానాగొడవచేస్తే వాళ్ళు మౌనంగా అన్నీ భరించరుకదా. వాళ్ళూ తనని ఆడిపోస్తారు. ఫలితంగా ఇద్దరూ వీధినబడతారు!

ఊహూ- అలా జరక్కూడదు. అలాగని రామ్‌కి మంచిమాటలు చెప్పి ప్రయోజనంలేదు. అతడి కృతఘ్నతకి తగిన గుణపాఠం నేర్పాలి!

ఆమె మెదళ్ళో ఓ మెరుపు మెరిసింది.

"ఆయనకెలా బుద్ధిచెప్పాలో, నలుగురిచేతా ఛీ అన్పించడమెలాగో నాకు తెలుసు..."

అరుణ పిలుస్తున్నా విన్పించుకోకుండా విసురుగా వెళ్ళి టాక్సీ ఎక్కి "పోనియ్" అంది రాణి.

ఆవేశం తప్ప ఆలోచనలేనిరాణి ఏంజేస్తుందో ఏ ఘోరానికి తలపడుతుందోనని వణకిపోసాగింది అరుణ.

శ్రీరామ్ సోఫియా ఇంట్లోంచి వచ్చి వెళ్లబోతోంటే తనింట్లోకి పిలిచింది.

సోఫియా ముఖం ముడుచుకుంది. కారణం బోధపడకపోయినా లోపలికొచ్చాడు శ్రీరామ్.

"నేను రాణి స్నేహితురాల్ని..."

పక్కన బాంబుపడినట్టు మళ్ళీ తుళ్ళిపడ్డాడతడు.

"ఇంత క్రితమే రాణి ఇక్కడికొచ్చి వెళ్ళింది"

"మైగాడ్" తల పట్టుకుని కూలబడిపోయాడు.

మహాప్రళయం రానున్నదని అర్థమైపోయిందతడికి!

"మీరు మగమహారాజు కావొచ్చు. కాని మీరు చదువుకున్నవారు. అన్నీ తెలిసిన వారు. మీరిలా అడ్డదార్లు తొక్కికట్టుకున్న ఆడదానికి కన్నీటి అభిషేకం చెయ్యడం న్యాయమే నంటారా? అది సంస్కారమంటారా?"

ఆమె మాటలు సూటిగాశూలాల్లా వచ్చి గుండెలకి తగిలేసరికి వెంటనే మాట్లాడలేకపోయాడు.

"మీరు నాణేనికి రెండో పక్కకూడా చూస్తే బావుంటుంది. రాణి గురించి మీకెంత తెలుసో గాని ఆమెకి టెంపర్ ఎక్కువ. అభిజాత్యం ఎక్కువ. అహంకారం ఎక్కువ. మొగుడు ఇల్లూ, సంసారం, సంతానంతప్ప మిగతావన్నీ కావాలామెకి. అలాటి ఆడదానితో ఏమగాడు గుట్టుగా కాపురం చెయ్యగలడు చెప్పండి? మీకు తెలీదు ఆమెనెంతగా ప్రేమించానో. ఐ వర్షిప్డ్ లైక్ ఎనీథింగ్..." అతడి కంఠం రుద్ధమయ్యింది.

"అంత ప్రేమవున్నా ఆమెని దారిలోకి తేగల ఓర్పూ సహనం లేకపోయాయన్న మాట"

"ఓర్పుకి కూడా ఓ హద్దు వుంది"

"హద్దువుంటే అది ఓర్పేకాదు. గత రెండు మూడు నెలలుగా రాణిలో వచ్చిన మార్పునీ ఆమె అంతఃఘర్షణనీ మీరే మాత్రం గుర్తించి చేయూత నిచ్చినా తేలిగ్గా మారేది. కానామె దగ్గరవుదామనుకున్నప్పుడు మీరు దూరంగా జరిగారు. మీ ప్రవర్తనతో ఆమె గుండెల్ని ముక్కలు చేసేశారు"

"అయామ్ సో సారీ. ఇలా అవుతుందని ఆమె ఇంత సీరియస్‌గా తీసుకుంటుందనీ అనుకోలేదు"

"సారీలు చెబుతూ కూర్చునేంత వ్యవధిలేదు. రోషంతో వెళ్ళింది రాణి. ఆత్మాభిమానానికి అఘాతం తగిలితే సహించగల మనస్తత్వంకాదు రాణిది. ప్లీజ్... త్వరగా వెళ్లండి"

అతడికి ముచ్చెమటలు పోయసాగాయి. "నన్ను చూసిమరీ రెచ్చిపోతుందేమో. దయచేసి మీర్రాకూడదూ?"

అయిదునిమిషాల్లో కారు డాక్టరు గారింటి ముందాగింది. ఇద్దరూ లోపలికి పరుగెత్తారు.

రాణి తన బెడ్‌మీద స్పృహలేకుండా పడి వుంది. ఆమెపక్కన గార్డినల్ టాబ్లెట్స్ సీసా ఖాళీగా వుంది. ఆమె చేతిలో- "నా చావుకి కారణం నా భర్తే. అతణ్ణి చిత్రవధ చేసి చంపండి" అని రాసివున్న చీటీ కూడా వుంది!

చీటీని అతడు చూడకుండా తీసి దాచేసింది అరుణ.

రాణి పల్స్‌చూసి గాభరాపడ్డాడు శ్రీరామ్. వెంటనే అంబులెన్స్ కోసం ఫోన్‌చేశాడు. కాని అంబులెన్స్ వచ్చేవరకూ నిరీక్షించలేక ఆమె సాయంతో రాణిని కార్లో ఆసుపత్రికి తీసుకెళ్లాడు.

సుమారు రెండు గంటలపాటు అవిశ్రాంతిగా డాక్టర్ శ్రీరామ్ ట్రీట్ చేశాక రాణికి స్పృహవచ్చింది.

"నన్ను చచ్చిపోనివ్వండి- నేను బతకను" అరిచింది పిచ్చిగా.

"రాణీ- ప్లీజ్... అలా అనకు. నిన్ను చనిపోనివ్వను. నా ప్రాణాలిచ్చి అయినా బతికించుకుంటాను. నన్ను క్షమించురాణీ. ఐలవ్యూ రాణీ ఐలివ్‌ఫర్యూ. నువ్వు లేకపోతే పిచ్చివాణ్ణైపోతాను..." ఆమె చెయ్యి పట్టుకుని ఏడ్చేశాడు శ్రీరామ్.

అతడి కళ్లల్లో కన్పించిన అనురాగానికి కరిగిపోయిందామె. "చచ్చి ఏం సాధిద్దామని రాణీ ఇంత ఘోరానికి తలపడ్డావు. నీకు స్పృహ లేకపోతేనే మీ బాబు గోలపెట్టాడే ఇక నువ్వు లేకపోతే ఆ పసివాడు భరించగలడా? నీ రక్తం పంచుకుని పుట్టిన వాడికి తల్లి ప్రేమలేకుండా చేస్తావా?"

అరుణ మాటలకి ఆత్రంగా కలయజూసింది.

ఆయా బాబుని ఆమె దగ్గరకి తీసుకొచ్చింది.

వాణ్నిగుండెలకి హత్తుకుని ముద్దుల వర్షం కురిపించింది.

ఆమె కళ్ల నుండి కన్నీళ్ళు ధారలుగా కారిపోతున్నాయి.

"అహంకారంతో మగవాణ్ని తూలనాడి సంసారపు గూడును చెదరగొట్టుకోకూడదు. ప్రతిస్త్రీ అనురాగంతో భర్తనీ పిల్లల్నీ

బంధించాలి. ఒకరు తప్పుచేస్తే ఒకరు తీర్చిదిద్దాలి. ఒకరి గొప్పతనానికి ఒకరు పునాది వెయ్యాలి. ఎక్కువ తక్కువలగురించి వాదనలకి పోకుండా ఇద్దరూ సమానమని ఇద్దరూ సంసారరథపు రెండు చక్రాలనుకోవాలి. ఇద్దరూ సహకరిస్తేనే కథారథం తిన్నగా నడిచేది. అవగాహన అనురాగం కలబోసుకుంటే ప్రతి కథా ఓ ప్రణయకావ్యమౌతుంది. ప్రతి ఇల్లూ ఓ బుల్లి స్వర్గమవుతుంది''

అరుణ మాటలకి కదలిపోయింది రాణి. ''థాంక్యూ... నీమేలు మర్చిపోను'' అంది.

''రాణీ- ఇంకెప్పుడూ ఇలాటిపని చెయ్యకు. నిన్నింకెప్పుడూ నొప్పించనురాణీ- మన బాబు మీద ఒట్టేసి చెబుతున్నాను'' అంటున్న భర్త కళ్ళల్లోకి ఆరాధనగా చూడసాగింది.

ఆ కళ్ళల్లో ఆమెకి... ఐ లైక్యూ, ఐ లవ్యూ ఐలివ్ ఫర్యూ,అంటోన్న భావరూపం కన్పించసాగింది.

భార్యాభర్తల్ని ఏకాంతానికి వదిలి బయటికి వచ్చింది అరుణ. సోఫియా కన్పించగానే పిలిచి హెచ్చరింపుగా అంది. ''నువ్వింకా ఇక్కడే వున్నావా. నువ్వు డాక్టర్‌గారికి మందుపెట్టి వలలో వేసుకున్నావనీ, నీ కారణంగానే రాణి ఆత్మహత్య ప్రయత్నానికి తలపడిందనీ పోలీసురిపోర్టు ఇవ్వబోతున్నారు. డబ్బున్న వాళ్ళు ఏమైనా చెయ్యగలరుగానీ త్వరగా ఈ వూరొదిలేసి ఎక్కడికైనా పారిపో''

పరిస్థితంతా గమనిస్తూనే వుంది గనుక వెంటనే తలూపి డాక్టర్‌గారి ద్వారా తనకి దక్కిన సొమ్ముతో పలాయనం చిత్తగించింది సోఫియా.

★ ★ ★

''మైడియర్ బెటర్ హాఫ్'' అంటూ హడావిడిగా వచ్చాడు స్వామి.

ఆనందానికి ప్రతిరూపంలో వున్నాడతడు. అతడి చేతిలో ప్లాస్టిక్ బుట్టవుంది. అందులో కొత్త చీర పూలూ పళ్ళూ స్వీట్స్ వున్నాయి.

''ఏవిటండీ'' అంటూ లోపల్నుంచొచ్చిందల్లా అతణ్ణి చూసి ''నాకు శుభవార్త తెచ్చేరుకదూ!'' అంది సంబరంగా.

''ముందు మేం చెప్పినట్లు చెయ్యవలసిందిగా ఆజ్ఞవేస్తున్నాం'' ఠీవిగా అన్నాడు.

''బాంచెన్ దొర కాల్మొక్త''

''ష్- స్వతంత్రం వచ్చి చాలా కాలమయింది మేడమ్. అన్నిరకాల బానిసత్వానికీ కాలం చెల్లింది''

''యస్సర్''

''దట్స్‌గుడ్... ముందీ చీరకట్టుకురండి''

''ఇప్పుడెందుక్కొన్నారు అనవసరంగా....''

''ఏక్‌ఘంటే కా సుల్తాన్‌ని. చెప్పినట్లు వినాల్సిందే''

అరుణ చీరకట్టుకుని రాగా కుర్చీలో కూర్చోబెట్టాడు.

''అంతా తమ అభిమానాన్నీ భక్తినీ ఆరాధననీ రకరకాలపద్ధతులద్వారా తెలియజేస్తుంటారు. ఇది నా పద్ధతి. నా పిచ్చి'' అంటూ ఆమె నుదుట బొట్టుపెట్టి తలలో పూలు తురిమాడు. ఆమె ఓ చేతిలో స్వీటూ మరో చేతిలో పండూ వుంచాడు.

''తతంగం బాగుంది. అమ్మవార్లా కూర్చోనా?'' నవ్వుతూ అంది.

ఆమె మాటలు పట్టించుకోకుండా పూలదండని ఆమె మెడలోవేసి అమాంతం ఆమెకి పాదాభివందనం చేశాడు స్వామి.

''అయ్యామో- ఇదేమిటి సిగ్గు—లేవండి''

''ఇది నా భక్తీ కృతజ్ఞతానూ''

''ఇదంతా దేనికో చెప్పకుండానే...''

''దేవి తపస్సు ఫలించింది. భక్తుడి కోరిక సిద్ధించింది. అందుకే ఈ పూజ - అందుకో నా హృదయదేవతా''

''నాకర్థమయ్యే భాషలో చెప్పండి''

''ఐపియస్‌కి సెలక్టయ్యానోచ్'' ఆమెనెత్తేసి గిరగిరా తిప్పేశాడు.

అతడి మెడచుట్టూ చేతులు చుట్టి మీదకి లాక్కుని ముద్దుపెట్టుకుంది. అతడి పట్టునుంచి తప్పించుకుని పూలదండని అతడి మెడలో వేసి స్వీటు నోట్లో కుక్కింది.

అతడు వెంటనే అదే దండని ఆమె మెడలో కూడావేసి తన నోట్లోని స్వీట్‌ని నోటితోనే ఆమె నోటికందిచ్చాడు.

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం— బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.

నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.

అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది.

పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



CLARION/B/GS/50/173/TL

అదో అందమైన అద్భుతమైన గుండెల్ని వూగించేటటువంటి అపురూప ఆరాధనా ప్రదర్శిత అనురాగచిత్రం— కాదు దృశ్యం!

★ ★ ★

ట్రైనింగ్ పూర్తైన వెంటనే స్వామిని హైదరాబాదులో పోలీసాఫీసరుగా పోస్టు చెయ్యడంతో అతడూ అరుణా కూడా ఎంతో సంబరపడ్డారు.

వాళ్ల ఆనందానికి హద్దులూ ఎల్లలూ లేకుండా పోయాయని చెప్పాలి.

"ఈ విజయం ఈ ఉన్నతీ అన్నీ నీవే అరుణా. నువ్వే గనుక నన్ను వెలికి తీయకుండా వుండివుంటే నేనింకా ఆ ప్రెస్సులోనే గుడిగుడి కుంచం ఆడుకుంటూ బ్రాకెట్టు చుట్టూ దీపపు పురుగులా తిరుగుతూ అనామకుడిగా నిక్కష్టంగా బతుకు నీడుస్తుండే వాణ్ణి" అంటూ ఇంకా ఏదేదో అనబోతోంటే ఆపైన అననివ్వకుండా అతడి పెదాల్ని తన పెదాలతో కప్పేసింది అరుణ.

అవాళ ప్రభుత్వంవారిచ్చిన క్వార్టర్స్‌కి మారిపోయారిద్దరూ.

ఇద్దరూ చుట్టుపక్కలవాళ్లందరి దగ్గరికీ వెళ్లి శలవుతీసుకున్నారు. వాళ్లతో మాట్లాడగల అర్హత తమకు లేనట్టుగా బిక్కుబిక్కుమని చూస్తూనే వారంతా నిండుమనస్సుతో ఆశీర్వదించి వీడ్కోలు చెప్పేరు.

వార్త తెలిసి రాణీ శ్రీరామ్, స్వప్నా ప్రభాకర్‌లు వచ్చి భార్యాభర్తలిద్దర్నీ అభినందనలతో ముంచెత్తారు.

"భర్తని భార్య తీర్చిదిద్దగలదనీ, గొప్పవాణ్ని చెయ్యగలదనీ స్వప్నపెళ్ళి చూపుల్నాడు అరుణ అంటే ఆమెతో తర్కం వేసుకున్నాను. ఇవాళ ప్రత్యక్షంగా చూశాక అరుణ ముందు చూపునీ సాహసాన్నీ దీక్షనీ పట్టుదలనీ ఆత్మవిశ్వాసాన్నీ ప్రత్యేకంగా అభినందించకుండా వుండలేకపోతున్నాను" అంది రాణి మనస్ఫూర్తిగా.

"రాణి భర్త గొప్ప డాక్టరు. అరుణభర్త పోలీసాఫీసరు. తన భర్త బోడి యూడీసీ!" అనుకుంటూ లోలోపల కుళ్ళిపోతూనే పైకి నవ్వుతూంది. "అవునవును... ఇదంతా మా అరుణ గొప్పేగాని బావగారి గొప్పేం లేదు"

శ్రీరామ్ అరుణ తెలివితేటల్ని ప్రశంసిస్తే ప్రభాకర్ ఆదంపతుల అదృష్టాన్ని మెచ్చుకున్నాడు.

వారి అభినందనలకి జవాబుగా - "ఆయన కృషికీ పట్టుదలకీ నేను బాసటగా నిలిచాను. దీపం కొడిగడుతోంటే ఒత్తిని ఎగదోసి కొంచెం నూనె పోశానంతే. ఆమాత్రానికి నన్నేదో ఆకాశానికెత్తేసి ఆయన ప్రతిభని తక్కువగా అంచనా వెయ్యడం సరికాదు" అంది అరుణ తొణక్కుండా.

"ఐడియల్ ఇండియన్ ఉమన్" కాంప్లిమెంటిచ్చాడు శ్రీరామ్.

ఆ పూట ఆ మూడు జంటలూ అరుణ ఇంటనే నవ్వుతూ జోక్స్ కట్‌చేసుకుంటూ విందారగించారు.

ఒకటో తారీఖున జీతం తెచ్చి అరుణ చేతిలోపెట్టాడు స్వామి.

"మీదగ్గర వుంచకపోయారా"

"ఉంచొచ్చు. కాని అరుణా— అందరూ ఖర్చుపెట్టగలరు. కాని సవ్యంగా అవసరాన్నిబట్టి ఖర్చుపెట్టడం అనేది ఓ ఆర్ట్. అందులో ప్రవీణురాలివి నువ్వు. ఇదివరకట్లానే ఇప్పుడూ నువ్వే మనింటికి మేనేజర్‌వి"

"ఇక్కడ మేనేజర్నీ అక్కడ పి.ఏ. నీనా? ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేస్తాను. ఓ నిరుద్యోగికి వుద్యోగమైనా దొరుకుతుంది"

"నువ్వేం చేసినా నాకిష్టమే. నిన్ను నెత్తిమీద పెట్టుకుని పూజించడమే నావని"

"సరిపోయింది. ఇంక పోలీసుద్యోగం ఏం చేస్తారు" అని నవ్వి—

"ఇకనుంచి మీ డ్యూటీ టైమునిబట్టి అన్నీ అమరుస్తుండాలికదా. పైగా యువరాజావారు విచ్చేస్తున్నారాయె" అంది.

సిగ్గుతో వాలిపోతున్న ఆమె కళ్లనీ, ఎర్రగులాబీల్లా రూపుదాలుస్తోన్న ఆమె బుగ్గల్నీ చూసేసరికతడికంతా అర్థమైపోయింది.

ఆమెని సుతారంగా కౌగిలిలోకి తీసుకుంటూ "అమ్మదొంగా- ఇన్నాళ్ళూ నాకు చెప్పలేదేం? ఇంకా ఎన్ని నెలలు ఓపిక పట్టాలి?" అనడిగాడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతూ.

అయిదు వేళ్ళు చూపించింది.

"అబ్బో... ఇంకా అయిదు నెలలు ఓపిక పట్టాలా. అంతవరకూ ఆగలేను బాబూ"

"మీ అబ్బాయితో చెబుతాన్లెండి" మురి పెంగా అంది.

"నాకు అబ్బాయొద్దు అమ్మాయి కావాలి"

"ఊహూ నాకు బుల్లి స్వామి కావాలి"

"ఊహూ... నాకు బుల్లి అరుణ కావాలి. ఈ అరుణ ఈ స్వామిని తీర్చిదిద్దినట్టే బుల్లి అరుణ కూడా తన భర్తనీ పిల్లల్నీ అయినవాళ్ళంతా గర్వించేలా తీర్చిదిద్దుతుందని" ఆమెని హృదయానికత్తుకుంటూ అన్నాడు.

అరుణ అతడి విశాలవక్షానికి బల్లిలా అంటుకుపోయింది.

★ ★ ★

అరుణ ఇంటికి సుడిగాలిలా వచ్చింది స్వప్న.

ఆమె వాలకాన్నీ ఉబ్బిన కళ్ళనీ, ఎండిన కన్నీటి చారికలనీ చూసి అదిరిపడ్డారు స్వామి దంపతులు.

"ఏవయింది స్వప్నా?"

ఆమె మాటలకి భోరున ఏడ్చేసింది. ఆమె చేతులు పట్టుకుని - "నువ్వే మా ఆయన్ని రక్షించాలే. మీరే మమ్మల్ని కాపాడాలి" అంటూ బావురుమంది.

"ఊరుకో. ముందేం జరిగిందో వివరంగా చెప్పు. న్యాయాన్ని ఎలాగైనాసరే రక్షించి తీరతారాయన"

"ఆయన్ని... పోలీసులు పట్టుకుపోయారు"

"ఎందుకు?"

"లంచం తీసుకుంటున్నారని..." మొహాన్ని చేతుల్తో కప్పుకుని ఏడ్చేసింది.

"నిజంగా లంచం తీసుకుంటున్నారా?"

సూటిగా వచ్చిన అరుణ ప్రశ్నకి నిరుత్తరాలై అవునన్నట్లు తలాడించింది.

"నేరస్తుల్ని పోలీసులు అరెస్టుచెయ్యడంలో తప్పేముంది. వాళ్ళున్నదే అందుక్కదా. ఎవరి డ్యూటీనివారు సక్రమంగా నిర్వర్తించాలితప్ప అందులో మరొకరు జోక్యం చేసుకోకూడదు స్వప్నా"

"అంతేనంటావా మీ ఆయన్తో చెప్పి ఆయన్ని రక్షించలేవా?"

"మనవాళ్ళన్చెప్పి నేరస్తుల్ని దయచూపించమనడమూ నేరమే అవుతుంది"

"కడుపు నిండినదానివి. ఆకల్తో మాడుతున్నవారిగోల నీకేం తెలుస్తుందిలే. ఏదో స్నేహితురాలివీ, పోలీసాఫీసరు భార్యవీ అని వచ్చేను. తప్పకుండా ఆదుకుంటావని కొండంత ఆశతో వస్తే ఎదురునీతులు చెబుతున్నావా - బావుంది అరుణా... చాలా బావుంది!"

"స్వప్నగారూ- ఆవేశపడకండి. జరిగిందేమిటో వివరంగా చెప్పండి. ప్రభాకర్‌గారు నిర్దోషి అయితే ఆయన్ని కాచే పూచీ నాది" అన్నాడు స్వామి కల్పించుకుంటూ.

"సత్యానందమనే బిజినెస్‌మేన్‌కీ మావారికీ ఇచ్చిపుచ్చుకునే లావాదేవీలున్నాయి. ఈమధ్యే మేం రేటుపెంచి కొంచెం ఎక్కువ ఇమ్మన్నాం. ఆయన ఇవ్వనన్నాడు. మావారాయన పని చెయ్యకపోయేసరికి కక్షకట్టి ఏసీబీవారిని తీసుకొచ్చారు. అదేమీ తెలీని మావారు ఆయన రాజీమాటలు నమ్మేసి డబ్బు తీసేసుకున్నారు. ఇంతలో ఏసీబీ వాళ్ళొచ్చి డబ్బు స్వాధీనం చేసుకున్నారు..."

"ఐసీ... రెడ్‌హేండెడ్‌గా పట్టుబడ్డారన్నమాట!"

"ఇదివరకట్నుంచీ లంచాలు తీసుకుంటున్నమాట నిజమేననుకోండి. కానీసారి మాకోసం తీసుకోలేదండి. వాళ్ళాఫీసర్ కోసం తీసుకున్నారు. ఆయన ఈయన ద్వారా లంచాలు తీసుకుని మాకు తృణమోపణమోపడేస్తూంటారు. అంతకంటే మావారే పాపమూ ఎరగరండి. ఆయన్ని మీరెలాగైనా రక్షించి పుణ్యం కట్టుకోండి"

"సరే... నేనంతా కనుక్కుంటానుగాని మీరేమీ గాబరాపడొద్దు. నాకు తెలిసిన లాయరు ద్వారా ముందు ప్రభాకర్‌గార్ని బెయిల్‌మీద తీసుకొస్తాను" అని వెళ్ళిన స్వామి మరో మూడుగంటలకి ప్రభాకర్తో వచ్చాడు.

భర్తని చూసేంతో పొంగిపోయింది. స్వామిని

దేవుడంటూ పొగిడేసింది స్వప్న.

"మీకు సంగతి చెప్పక తప్పదు గనుక చెబుతున్నాను. కేసు బుక్‌చేశారు. మన నిర్దోషిత్వాన్ని కోర్టులో ఋజువుచేసుకోవాల్సి వుంటుంది. కాని ప్రభాకర్‌గారికి వ్యతిరేకంగా చాలా ఋజువులూ సాక్ష్యాలూ వున్నట్టు తెలిసింది. మీ ఆస్తిపాస్తుల వివరాల నిమిత్తం మీ ఇంటిమీదా, మీ ముఖ్య బంధువులఇళ్ళమీదా దాడిచెయ్యొచ్చు. రెడ్‌హేండెడ్‌గా దొరికారు. గనుక శిక్ష తప్పకపోవచ్చు. కాదంటే ఇందులో వారి ఆఫీసరుకి పెద్దభాగం వుందంటున్నారు గనుక అది ఋజువు చెయ్యగలిగితే శిక్ష తగ్గే అవకాశం వుంది"

స్వామి మాటలకి అందరి గుండెలూ బరువెక్కాయ్.

ఎవరి మొహంలోకీ చూళ్ళేక తలొంచుక్కూర్చున్నాడు ప్రభాకర్.

అతడికి భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పిస్తోంది! ★ ★ ★

ప్రభాకర్ని వుద్యోగంలోంచి సస్పెండ్ చేశారు. అతడింట్లోని సామాన్నంతా కస్టడీలోకి తీసుకున్నారు.

అతడి తండ్రీ మామగారూ వరుగునొచ్చారు. స్వామి శ్రీరామ్‌ల సలహా సహకారాలతో పేరున్న లాయర్ని నియమించారుగాని అంతగా ఫలితం లేకపోయింది.

ప్రభాకర్‌వాళ్ళ ఆఫీసరు మొదట్నుంచీ జాగ్రత్తలో వుండటంవల్ల తప్పించుకోగలిగాడు. దాంతో కేసు ప్రభాకర్ చుట్టూ బిగిసింది.

దానికితోడు లంచం తీసుకున్నట్లు కోర్టులో అంగీకరించాడు ప్రభాకర్!

అలా ఒప్పుకోవద్దన్నాడు అతడి లాయరు. ఆఫీసరుకిమ్మని ఏదో కవరిచ్చారనీ అదాయన కిచ్చేలోగా యాంటీ కరప్షన్ అధికారులొచ్చి పట్టుకున్నారనీ చెప్పమన్నాడు. కానతడు విన్పించుకోలేదు. స్వప్న బతిమాలినా ప్రయోజనం లేకపోయింది.

"నా అంతరాత్మప్రబోధానికి భిన్నంగా ఇన్నాళ్ళూ ప్రవర్తించి ఆఖరికిలా పీకలమీదకి తెచ్చుకున్నాను. కనీసం ఇప్పుడైనా నిజాయితీగా ప్రవర్తించకపోతే నా అంతరాత్మ నన్ను క్షమించదు. నాకు జీవితాంతం మనశ్శాంతి వుండదు" అన్నాడతడు.

ఏమైతేనేం అతడికి నాలుగేళ్ళు జైలుశిక్ష విధించింది న్యాయస్థానం!

తీర్పు విని మూర్ఛబోయింది స్వప్న.

తేరుకున్నాక కన్నీరు మున్నీరుగా విలపించింది.

ప్రభాకర్ని పోలీసులు వేన్‌వైపు తీసుకెళ్తోంటే స్వామీ అరుణా శ్రీరామ్ రాణీ విశ్వనాథం అంతా అతడికి కన్నీటితో వీడ్కోలు చెప్పేరు.

"నేను నేరం చేశానని నాకు తెలుసు. ఇప్పుడు కోర్టు నా నేరాన్ని నలుగురికీ చాటి నాకూ, నాలాంటివారికీ కనువిప్పు కలిగేలా చేసింది. ప్రభుత్వాన్నీ అంతరాత్మనీ కూడా వంచిస్తూ నేను చేసిన నేరానికిది చాలా చిన్నశిక్ష. నేరస్తుడు శిక్ష అనుభవిస్తోంటే జాలిపడకూడదు" అన్చెప్పి వెళ్ళిపోయాడు ప్రభాకర్ పోలీసులు వెంట.

"ఏమండీ... నన్నొదిలేసి వెళ్ళిపోతున్నారా! దీనికంతటికీ కారణం నేనండీ. చేజేతులా మిమ్మల్ని లంచగొండిలా దిగజార్చింది నేనేనండీ. నేను చేసిన నేరానికి మీరు శిక్ష అనుభవించడం అన్యాయమండీ. అయ్యో... వెళ్ళిపోతున్నారా! నేనేం చెయ్యనండీ - నలుగురికీ నా ముఖం ఎలా చూపించను?! మీరు నీతీ నిజాయితీ అంటున్నా వినకుండా మిమ్మల్నీ మీ వుద్యోగాన్నీ ఎత్తిపొడిచాను. కలల్లో బతుకుతూ వాస్తవంతో రాజీపడలేకపోయాను. ఊహల వూయల్లో వూరేగేనుగాని పట్టు తప్పితే అక్కణ్ణుంచి అగాథాల్లో పడతానని గ్రహించలేకపోయి ఎవరెవర్నోచూసి వాతలు పెట్టుకున్నాను. మీరు లంచంతీసుకుంటే చక్రం తిప్పుతానని ముందుకొచ్చానప్ప మిమ్మల్ని మందలించలేకపోయాను. అదే చేసివుంటే ఇవాళిలా జరిగేది కాదు... కాదు...

స్వప్న హృదయవిదారకంగా హోరున భోరున గుండెలు పగిలేలా ఏడుస్తోంటే ఆమెని ఓదార్చగలశక్తి ఒక్కరికీ లేకపోయింది!

★

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

B/112

కూపన్

'సెప్టెంబర్ 'చతుర' నవల : ఆమె చెక్కిన శిల్పం

సమీక్షకుని పేరు : ............................................

చిరునామా : ............................................

............................................

............................................

............................................




## పారిశ్రామికగూఢచారులు

**గూ**ఢచారులనగానే సి.ఐ.ఎ, కె.జి.బిలాంటివి గుర్తుకు వస్తాయి. ప్రభుత్వాలేకాక, వివిధ వ్యాపారసంస్థలు కూడా గూఢచారులని నియమిస్తాయి. విదేశాల్లో ముఖ్యంగా కెనడా, అమెరికాల్లో 'ఇండస్ట్రియల్ స్పయింగ్' అంటే పారిశ్రామిక గూఢచారత్వం అధికంగా ఉంటుంది.

వ్యాపార సంస్థల మధ్య పోటీ అధికంగా వుండే విదేశాల్లో ఇది కొత్తకాదు. ఓవ్యాపార సంస్థ తనకి పోటీ అయిన మరో వ్యాపారసంస్థ విజయానికి దారితీసే అధికసమాచారాల్ని రహస్యంగా సంపాదించేందుకు, దాన్ని తమ లాభానికి వుపయోగించేందుకు సదా కృషిచేస్తుంటుంది. ఇందునిమిత్తం ఎస్.బి.ఐ, సి.ఐ.ఎలాంటి గూఢచార సంస్థల్లో రిటైరయిన గూఢచారులని నియమిస్తుంటుంది.

పారిశ్రామిక గూఢచారులు పోటీ వ్యాపార సంస్థలనించి సమూనాలు, పథకాలు, ఆలోచనలని దొంగిలిస్తుంటారు. ఫ్యాషన్స్‌కి ప్రసిద్ధిగాంచిన పాంగ్, లండన్, మిలన్‌లలో జరిగే కొత్తఫేషన్ల ప్రదర్శనకి ఓవ్యాపారవేత్త తన గూఢచారులని 1983లో పంపి, సిగరెట్ లైటర్స్‌లో అమర్చిన కెమెరాలతో ఫొటోలు తీయించాడు. ఆఫొటోల్లోని అతివలు ధరించిన దుస్తులలాంటివి హాంకాంగ్, సియోల్‌లాంటి నగరాలలో చవకగా లభించే టైలర్స్‌తో కుట్టించి వాటిని శాన్‌ఫ్రాన్సిస్కో, మేట్రిడ్‌లాంటి చోట్ల ఆఫేషన్ పరేడ్ జరిగిన మూడు నాలుగు దేశాల్లో అమ్మకానికి పెట్టాడు. అవి చవక అవడమే కాకుండా, అచ్చంఫేషన్ పెరేడ్‌లోని దుస్తుల్లా కన్పిస్తాయి. ఈ విధంగా 1983లో ఆవ్యాపారస్తుడు మూడున్నర కోట్ల డాలర్లని సంపాదించాడు.

మరోసారి ఓ బ్రిటీషు ఇంజనీరింగ్ కంపెనీని టైప్‌రైటర్ చేసే వ్యక్తి సందర్శించి, ఆకంపెనీ డైరెక్టర్ సెక్రటరీ వుపయోగించే టైప్‌రిబ్బన్‌ని మార్చి సరికొత్తది అమర్చాడు. ఆ మార్చిన రిబ్బన్‌ని మర్నాడు దొంగిలిస్తే, దాన్ని వుపయోగించి టైప్‌చేసిన ఓ ముఖ్యమైన వుత్తరంలోని అక్షరాల్ని ఆరిబ్బన్‌నుంచి సంగ్రహించారు. టైప్‌రైటర్ రిపేర్‌చేసే వ్యక్తిగా వెళ్లింది ఆఇంజనీరింగ్ కంపెనీ పోటీదారుడి గూఢచారి అని ప్రత్యేకంగా చెప్పక్కరలేదు.

అమెరికాలోని జనరల్ మోటర్స్‌లాంటి ప్రతిపెద్ద కంపెనీకి పారిశ్రామిక గూఢచారి విభాగం విధిగా ఉంటోంది.

మరోట్రిక్‌ఉంది తమ పోటీదారుకంపెనీలో సమాచారం తెలిసిన ఉద్యోగస్తులెవరో కనుక్కొని, వారు ఏపేపరు చదువుతారో గ్రహించడం. ఆపేపర్లో వాళ్లకి ఆశపుట్టేలా వాళ్ల క్వాలిఫికేషన్స్, అనుభవంతో ఓ ప్రకటన 'ఉద్యోగస్థులు కావాలి' కాలమ్‌లో ప్రకటించడం సాధారణంగా దూరంగా ఉన్న పట్టణానికి వెళ్లి రావడానికి వుచితంగా విమానం ఖర్చులు, హొటల్ ఖర్చు ఇస్తామనడంతో వాళ్ళు ఆ ఉద్యోగానికి దరఖాస్తుపంపుతారు. 'ఇంటర్వ్యూ'లో ఆ ఉద్యోగిని అతను పనిచేసే కంపె



నీకి చెందిన సమాచారం మొత్తం అడిగి తెలుసుకొని 'నో' అని పంపేస్తుంటారు.

అలాగే ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునే డైరక్టర్ల మీటింగ్ జరిగే కాన్ఫరెన్స్ గదిలో ఫ్లవర్‌వేజ్‌లాంటి మామూలు ఆకారాల్లో వుండే మైక్రోఫోన్లని ఉంచడం, చచ్చినఈగ, చీమ ఆకారాల్లో ఉన్న శక్తిమంతమైన ట్రాన్స్‌మీటర్లని వుంచడంద్వారా కూడా పారిశ్రామిక గూఢచారులు పోటీదారుల కంపెనీవ్యవహారాలని సంపాదించగలుగుతున్నారు. అమెరికాలో ఓకంపెనీ ఇలాంటి మైక్రోఫోన్లని, ట్రాన్స్‌మీటర్లని 300 రకాల ఆకారాల్లో తయారుచేసి అమ్ముతోంది.

ఓబాంక్‌కి తాము అప్పులిచ్చే ఓ కంపెనీ ఆర్థికపరంగా బలహీనమయిందేమోనన్న అనుమానం కలగడంతో పారిశ్రామిక గూఢచారుల శరణుకోరింది. వారు ఆకంపెనీ డైరెక్టర్ 'టై'కి ట్రాన్స్‌మీటర్‌ని అమర్చారు. త్వరలోనే దానిద్వారా ఆ కంపెనీ చాలా నష్టాల్లో ఉందని, అయినా లాభాల్లో ఉన్నట్లుగా నాటకం ఆడుతున్నారని గ్రహించారు. బాంక్ ఆ రిపోర్టు చదివి ఆకంపెనీకి అప్పులివ్వడం ఆపేసింది. చైనా దేశం అమెరికా బ్రిటన్‌లాంటి దేశాల్లో తయారయే ప్రతికొత్త పరికరాన్ని తమ దేశానికి స్మగుల్‌చేసి, ఆపరికరాన్ని విప్పి, అది ఎలా తయారుచేశారో కనిపెట్టి అలాంటి వస్తువుల్నే ఆదేశంలో ప్రజలకోసం తయారుచేస్తుంటుంది. ఇందువల్ల కొత్త పరికరాల రీసర్చి కోసం విలువైన కాలాన్ని ధనాన్ని వృధాచేయ నవసరం లేదు.

ఇప్పుడిప్పుడే ఈ పారిశ్రామిక గూఢచారిత్వం మనదేశానికి కూడా పాకుతోంది.

## డైలీ బ్రెడ్

ఇది అంతరిక్షయుగం. పోనీ ... ఎలక్ట్రానిక్ యుగం. ప్రతిదీ తక్షణమే జరిగిపోవాలి- భోజనంతోసహా. అంటే వంటావార్పూ కూడా క్షణాల్లో జరగాల్సిందే!

ఆకలయినపుడు సాధారణంగా పళ్లమినహా అందరూ రెడీమేడ్‌గా అందుకోగలిగేది బ్రెడ్. తొలిరోజుల్లో కేవలం పథ్యానికిమాత్రం వాడే బ్రెడ్ ఇపుడు ''క్విక్ లంచ్ బ్రేక్''కి, 'రెడీ బ్రేక్‌ఫాస్ట్'కి ''లైట్ డయటింగ్''కీ ప్రత్యామ్నాయమై పోయింది. ఛీజ్‌తోనో, ఆమ్లెట్‌తోనో, టొమాటో ముక్కలతోనో మరీ ఇవేవీ లేకపోతే పాలు, టీలలో ముంచుకునో అయినా బ్రెడ్ తినవచ్చు. బ్రెడ్‌ని చక్కగా కట్‌చేసుకుని, స్లైసులని ఓరగా పళ్లెంలో పరుచుకుని, జామ్‌ని సుతారంగా స్టీలు చాకుతోతీసి, తాపీగా స్లైసులకి పట్టించి తినడం కొందరికి అదోసరదా – ఇంకొందరికి అదో దర్జా.

పాకింగ్‌లో ఉన్న బ్రెడ్ చూడముచ్చటగా ఉంటుంది. కానీ భారీ ఎత్తున తయారయే బ్రెడ్ ఫాక్టరీ పరిసరాలు, వర్కర్ల పరిశుభ్రత, తయారయే విధానం అంతముచ్చటగా ఉండదు. అందుకే కొందరికి బ్రెడ్ అంటే ఎలర్జీ. హొటళ్లలోని వంటగదిలో దోసెలపెనంమీద

నూనెరాయడానికి చిన్నసైజు చీపురువాడటం ఆనవాయితీ- ఇదీ అంతేమరి! కానీ, బేకరీల్లో బ్రెడ్‌కోసం ఏకాళ్లకిందనో కిలింపట్టి ఆయిల్ మడ్డి కారుతున్న రోలర్ల మధ్యనో పదునయే పిండిని తలుచుకుంటే వళ్లు గగుర్పొడిచి అసలు తినబుద్ధివేయదు.

పూర్వం ఈజిప్టులో పిండిని కాళ్లతో తొక్కి పులియబెట్టేవారు. పులియడంవల్ల రొట్టె తగినంతగా ఉబ్బి, తేలికైపోయి రుచిగా ఉంటుందిగనుక ఐగుప్తులకిది 'అనుదిన ఆహారమే' కాక తమ దేవతల సంప్రీతికై నైలు నదిలో చేసే నివేదనగా కూడా మారింది.

రెండోశతాబ్దానికల్లా గ్రీకులు దాదాపు 50 రకాల బ్రెడ్‌లు లాఘవంగా తయారుచేస్తుండేవారు. ఛీజ్‌తో తినడం ఆనాటికే ఉంది. బానిసలు, ఖైదీలు పిండిని కలిపి పదునుచేసి వండే బేకరీలు మాజిస్ట్రేటు పర్యవేక్షణలో ఉండేవి. మధ్యయుగంలో బ్రెడ్ క్వాలిటీతో విసిగిన జనం బేకర్లని దయ్యాల్లా చూసేవారు. టర్కీలో బ్రెడ్ ధరపెంచినా, నాణ్యం తగ్గినా కఠిన శిక్షలుండేవట.

యూరప్‌కి బ్రెడ్‌ను తెచ్చింది కొలంబసే. దాంతో అమెరికాలోనూ గోధుమ పంట వెలిసింది. పారిశ్రామిక విప్లవం రోలర్ మిల్లులను తెచ్చిందేకానీ, ధాన్యాలలోని మాంసకృత్తులను, విటమిన్లనీ మిల్లుపాలు చేసింది.

తడి – పొడి ధాన్యాలని పిండి చేసుకోడానికీ మాంసాన్ని ఖూరకనువుగా నలగ్గొట్టడానికీ చట్నీలు తయారుచేయడానికీ, పెరుగులాంటివి చిలకడానికీ ఎలక్ట్రానిక్ మిక్సర్లున్నాయి. మైక్రోప్రాసెసర్లు అమర్చబడ్డ కుక్కర్లు సామాన్యమైపోయాయి. ప్రతిదీ ఇంట్లోనే స్వంతంగా చేసుకుంటే బాగుండుననుకునే ఈ శతాబ్దపు ఆశయాలకు అనుగుణంగా "బిల్ట్ ఇన్ డిజిటల్ టైమర్"తో, నిద్రలేచేసరికి కావలసిన వేడివేడి బ్రెడ్ వడ్డించే "ఎలక్ట్రానిక్ ఆటోమాటిక్ బ్రెడ్ మేకింగ్" యంత్రాలూ వచ్చేశాయి. ఇడ్లీ కంటే ఇంకా సులభంగా చేసుకోగలిగే "బ్రెడ్ మేకర్"తో ఎంతోకాలం కలిసివస్తుంది. ఆ మాటకొస్తే యూరప్ దేశాలలో బీద, మధ్యతరగతి కుటుంబాలే బ్రెడ్‌ను ఎక్కువగా వాడతారు. రెండో ప్రపంచయుద్ధం తర్వాత బ్రెడ్ వినియోగం ఎక్కువ కావడంతో జపాన్ ఈ పరిశ్రమలో ఎంతో ముందంజ వేసింది. ప్రతి ఇల్లాలికీ బ్రెడ్ మేకర్ అతి త్వరలోనే అందవచ్చు. రైస్ కుక్కర్‌లాగే అలా కాస్తంత పిండి, తగిన నీరు, టొమాటోగట్రావేసి మిగతావనులు చూసుకునేలోపల బ్రెడ్ రడీ. కార్మికులకీ, ఆఫీసు ఉద్యోగులకీ, కాలం విలువ ఉన్న ఇతరులకీ ఈ సౌలభ్యం. ఇంట్లో ఉంటే వారి ఆహార విహారాలలో ఎన్నో మార్పులు చేర్పులు రావచ్చు. పిండికొద్దీ రొట్టె మరి!

బ్రెడ్ అత్యంత ప్రాచుర్యం పొందడానికి కారణం లేకపోలేదు. పాల ఎనర్జీ విలువ 12.7 శాతం అయితే బ్రెడ్‌కి ఇంకా మరో నాలుగు శాతం "శక్తి"నిచ్చే విలువ ఉంది.



## సర్వరోగాల 'జూ'

అమెరికాలోని జార్జియా రాష్ట్రంలోని అట్లాంటా సిటీలోని సిడిసి-సెంటర్ ఫర్‌ది డిసీజ్ కంట్రోల్-ప్రపంచంలోని అన్ని అనారోగ్యాలకి సంబంధించిన లైబ్రరీగా పేర్కొనవచ్చు. సాధారణ ఫ్లూ నుంచి లుకేమియాదాకా అన్ని రకాల రోగాల లక్షణాలు, వాటికి చికిత్స చేసే విధానం, ఆ రోగాలకి సంబంధించిన బాక్టీరియా ఈ సెంటర్‌లో భద్రపరచబడి ఉన్నాయి.

ఓ 'జూ'లో అన్ని రకాల జంతువుల్ని ఎలా చూడవచ్చో, ఓ లైబ్రరీలో అన్ని రకాల పుస్తకాల్ని ఎలా చదవవచ్చో అలాగే ఈ సెంటర్ లాబరేటరీలో ఇంతదాకా మానవుడికి వచ్చిన అనేక రకాల అనారోగ్యాలకి సంబంధించిన వైరస్‌ని, బాక్టీరియాని చూడచ్చు. ఎంతో భద్రంగా ఆ సూక్ష్మజీవుల్ని ప్రాణాలతో దాస్తున్నారక్కడ. అలా మొత్తం దాదాపు 1 లక్షా 70 వేల స్పెసిమన్స్ అక్కడ ఉన్నాయి. ఏ చికిత్సతో వాటిని నిర్మూలించవచ్చో కూడా కంప్యూటర్లలో భద్రపరిచారు. ప్రతి సంవత్సరం కనుగొనబడే కొత్తరోగం తాలూకు వైరస్ లేదా బాక్టీరియాని ఎంతో ఖర్చుతో శ్రమతో ప్రపంచం నలుమూలల్నించి ఈ లేబరేటరీ సంపాదిస్తుంది.

అలాగే ఇంకా రోగానికి చికిత్స కనుగొనబడని ఎయిడ్స్ లాంటి అనేక వైరస్ క్రిములు కూడా ఈ సెంటర్ లాబ్‌లో ఉన్నాయి. స్మాల్ పాక్స్‌లాంటి కొన్ని వైరస్‌లు ప్రపంచంలో లేకపోయినా వాటిని ఈ లేబరేటరీలో బతికిస్తూ కాపాడుతున్నారు.

వాటికి సంబంధించిన జాబితా లేదా కేటలగ్‌ని కంప్యూటర్లలో భద్రపరిచారు. ప్రతి రోగం లక్షణాలు, వాటిని కనుగొనడానికి జరిగిన పరిశోధనలు, అది ఏ మందులకి లొంగుతాయి, అవి ఎక్కువ ఏ ప్రాంతంలో వృద్ధి చెందుతున్నాయిలాంటి వివరాలన్నీ ఈడేటా స్టోరేజి కంప్యూటర్లలో ఉంటాయి.

4000 మంది పనిచేసే ఈ సెంటర్లలో సగంమంది సెంటర్‌లో, మిగతావారు అమెరికాలోని ఫీల్డ్ స్టేషన్‌లలో, విదేశాల్లో పనిచేస్తున్నారు. ఈ సెంటర్ అంతర్జాతీయ ఆరోగ్య సంస్థతో, విదేశీ ప్రభుత్వానికి ప్రబలే వ్యాధులని అరికట్టడంలో సహాయం చేస్తుంది.

ఈ సెంటరే ప్రపంచంలోని స్మాల్‌పాక్స్ అంతరించేలా చేసింది. మిగతా అనారోగ్యాలని కూడా అంతరించేలా చేయాలన్నది ఈ సెంటర్ ప్రధాన ధ్యేయం.





# అభిమాన నేరస్థుడు

అప్పటివరకూ చిల్లర దొంగతనాలతో కా వెళ్ళబుచ్చిన రోనాల్డ్ బిక్స్ జీవితం 1963~ కొత్త మలుపు తిరిగింది. ఓ పెద్దదొంగు ఠాతో చేతులు కలిపి స్కాట్‌లాండ్ ‹ను నుంచి లండన్‌కి రైల్లో రవాణా అ‹న్న నాలుగు మిలియన్‌డాలర్ల ధనాన్ని కొల్లొడ తను. పటిష్ఠమైన భద్రతాఏర్పాట్లమ‹ధికా రుల కళ్ళుగప్పి చేసిన ఆ దోపిడీ బిక్స్ నిర్వహించిన పాత్ర అపూర్వమైనది

అయితే సమర్థతకు మారుపేర‹ స్కాట్ లాండ్ పోలీసులు ఏడాది తిరిగే‹ బిక్స్‌తో సహా దొంగలందరినీ పట్టి బంధియ. రైలు దోపిడితోపాటు, పాతనేరాల్ని ‹చారించి బిక్స్‌కు ముప్పయిఏళ్ళ కఠిరాగారశిక్ష విధించింది కోర్టు. అలా రెం‹పాటు శిక్ష అనుభవించిన బిక్స్ అవకాశంచూసుకుని, జైలునుంచి తప్పించుకుని పోయాడు. ఆ పోవడం సరాసరి ఫ్రాన్స్‌కు ‹ తననెవరూ గుర్తించకుండా ముఖానికి ప్లిక్‌సర్జరీ చే యించుకున్నాడు. అనంత అక్కడినుంచి ఆస్ట్రేలియాకు వెళ్ళి భా‹బిడ్డలతో కులా సాగా కాలక్షేపం చేయనా‹ంచాడు.

గూఢచారులద్వారా ‹టాండ్ పోలీసు లు ఆ విషయం తెల్సు‹ని ‹తనికోసం వల సిద్ధంచేశారు. కాని చివరిక్షణంలో అది గ్ర హించిన బిక్స్ తెలివిగాతప్పించుకొని బ్రెజిల్ చేరుకున్నాడు. అక్క‹ రియోడిజనారో నగ రంలో తన వాటా‹మ్మునువిచ్చలవిడిగా ఖర్చుచేస్తూ, 1974 ‹రకూ ఘనంతోషాలలో తేలియాడాడు. ఆ సందర్భంలో అతనికెందరో మిత్రులు, అభిమానులు ఏర్పడ్డారు.

అయితే అంతలో ఓ పత్రికావిలేకరి అతని గుట్టు పసిగట్టి పత్రికలకెక్కించాడు. అతని ఆచూకి దొరకడంతో స్కాట్‌లాండ్ పోలీసులు మళ్ళీ రంగంలోకి దిగారు. కాని తమదేశాలమ ధ్య తీవ్ర విభేదాలకారణంగా బ్రెజిల్ ప్రభు త్వం బిక్స్‌ని అరెస్టుచేయడానికి అంగీకరించ లేదు. మళ్ళీ ఏడేళ్ళపాటు బిక్స్ చీకూచింతా లేకుండా బ్రెజిల్‌లో గడిపేశాడు. అతని అభి మానులసంఖ్యకూడా ఇబ్బడిముబ్బడిగా పెరిగి పోయింది.

ఇదిలాఉండగా అతన్ని స్కాట్‌లాండ్ పోలీ సులకు పట్టిస్తే బహుమతిరూపేణా బాగా ము డుతుందని ఓ కిడ్నాపర్ల ముఠా స్నేహం నటించి అతన్ని బుట్టలో వేసుకుంది. చివరికి 1981లో వీలుచూసుకుని ఆ ముఠా అతన్ని బంధించి పోలీసులకు పట్టించింది.

అయితే ఈ విషయం తెల్సి బ్రెజిల్‌లోని బిక్స్ అభిమానులు, మిత్రులు అతనితరవున ఓ లాయర్‌ని పెట్టి కేసు నడిపించారు. లాయర్ ప్రజ్ఞవల్ల బిక్స్ నేరం రుజువుకాలేదు. పైగా పరువునష్టంకింద పోలీసులే 30వేల డాలర్లు బిక్స్‌కి ముట్టజెప్పారు. తర్వాత తిరిగి బ్రెజిల్ చేరుకున్న బిక్స్‌కు మిత్రులు, అభిమా నులు ఘనస్వాగతం పలికారు. వారి మంచిత నానికి ముగ్ధుడైన బిక్స్ ఇకపై దొంగతనం చేయనంటూ అందరి ఎదుట ప్రమాణంచేసి చెప్పాడు. ★

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రత
భావంతులైన రచయితలకు నెలనెలా న
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాల
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకు
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతు

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర క, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 10పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదవస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తవకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదావస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసినవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమనవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతఃగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాల్లో ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# చతుర ఫీచర్



పొడవైన ఇనుప ఊచల్ని బుగ్గల్లోంచి గుచ్చుకోవడం, పండ్లు వ్రేలాడుతున్న మొనదేలిన కొక్కాల్ని ఒంటినిండా గుచ్చుకోవడం మలేషియా వీరభక్తులకి మామూలే! అక్కడి సుబ్రహ్మణ్యాలయ ఉత్సవాలలో ఈ దృశ్యాలు సర్వసాధారణం.



ఆస్ట్రేలియా వాసి ఆల్ఫ్‌శాలిబా ఇలాంటి ప్రదర్శనల్లో ఘనాపాటి. నోటికి దిగువ, ఈ వైపు నుంచి ఆవైపునకు ఓ ఇనుపచువ్వను దించి, దానికొనల కిరువైపులా బరువైన ఇటుకరాళ్లు కట్టిన గొలుసుల్ని తగిలించి సునాయాసంగా పైకి లేపుతాడు.



"ఈ కుక్కగారు నేలమీద నడవరు కాబోలు" అని మీరనుకుంటే ఖచ్చితంగా పప్పులో కాలేసినట్లే! ఎందుకంటే - ఇంగ్లండ్‌లోని బ్రిటిష్ రాయల్ ఎయిర్‌ఫోర్సెస్ జరిపే ఓ ప్రదర్శన కోసం గొప్పగా శిక్షణపొంది, బాగా అలసిపోవడంతో మేనేజర్‌గారే దీన్ని తన భుజాలకెక్కించుకొని శిబిరానికి చేరుస్తున్నారు.

గతంలో గ్లానులతో పీల్చేదల్లా ఇప్పుడు సీసాలకి సీసాలే మందు పట్టేస్తోందీ మేకగారు. ఫ్రెడ్డీ ట్రాట్ అనే ఆస్ట్రేలియా రైతుదగ్గరున్న ఈ మేషరాజం గత పదేళ్ళుగా రోజూ ఇదేతీరున బీరు తాగేటప్పుడు తన యజమానికి కంపెనీ ఇస్తోంది.





మూడు మీటర్ల పొడవున ఒళ్ళు జలదరించేలా కన్పిస్తున్న ఆ భయంకర సముద్రసర్పాన్ని గిలక్కాయిలా పట్టుకొని ఆడుకొంటున్న ఈ చిన్నారి పేరు ప్రూడంకన్. మెల్‌బోర్న్‌కి చెందిన ఈ పాపకి ఆ పెంపుడు పాముతో చిన్నతనం నుంచీ దోస్తీ ఉందట.

ఇటీవల ఆస్ట్రేలియాలో జరిగిన 'ఒకనాటి ఆవిరి యంత్రాలు- పొగబళ్లు' ప్రదర్శనలో ఈ చిన్నరైలులాంటి బండి కూడా చోటుచేసుకోవడం విశేషం. 80 కిలోగ్రాముల వరకు బరువు మోయగల ఈ వాహనంపై ఓ ఇంజనీరు కూర్చుని నడుపుతున్నాడు.





లయబద్ధంగా, వినసొంపుగా చెప్పులతో చప్పట్లు కొట్టే అంశంమీద ఓ కొత్త తరహా పోటీ ఇటీవల సిడ్నీలో జరిగింది. దేశవిదేశాలనుంచి సరికొత్త చెప్పులు తెప్పించుకుని మరీ ఈ పోటీలో అక్కడి యువతీయువకులు పాల్గొన్నారు.



కప్పలకోసం ప్రత్యేకంగా ఓ స్కూల్ని స్థాపించాడు కాలిఫోర్నియాకు చెందిన బిల్స్టీడ్. అక్కడ వాటికి వెయిట్ లిఫ్టింగ్ వంటి వ్యాయామాలు, క్రీడలు ఎన్నెన్నో నేర్పిస్తాడట ఆ పెద్దమనిషి.



ఎంచక్కా మానవులతో స్నేహసంబంధాలు కొనసాగించాలనే ఉబలాటంతో తరచూ తీరానికిచేరి, అక్కడ విహరించే ప్రజల్ని పలకరింపుగా చూస్తున్నాయి ఈ బుల్లి తిమింగలాలు. వశ్చిమఆస్ట్రేలియా నముద్రతీరంలో ఇవి నిర్భయంగా ఇలా మనుమల్ని కవ్వించి మరీ ఆటలాడుతాయి.



''ఒన్... టూ... త్రీ'' అంటూ ఆ ఇంజనీరుగారు శ్రద్ధగా నేర్పిస్తుంటే బుద్ధిగా ఎక్సర్‌సైజులు చేస్తూ బీచ్‌లోని జనాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తుతోందీ పెద్ద సీల్. పెర్త్‌నగర సమీపంలోని మెల్‌రోజ్‌బీచ్‌లో స్టాన్ అనే ఆ పెద్దమనిషికి ఓ రోజు ఇది కన్పించిందట. అప్పటినుంచి తెల్లారడం ఆలశ్యం అక్కడికి చేరి దానికి వ్యాయామం గట్రా ఎడాపెడా నేర్పేస్తున్నాడా మహానుభావుడు.



ఆసియాలోనే అతి పెద్దదిగా చెబుతున్న ఈ 52 అడుగుల కేక్‌ను బొంబాయిలో 98 గంటలపాటు శ్రమించి తయారుచేశారు కొందరు ఉత్సాహవంతులు. దీని తయారీలో 1425 గుడ్లు, 40 కిలోల కోకో, 130 కిలోల వంచదార ఖర్చయింది. దీన్ని అమ్మగా వచ్చిన మొత్తాన్ని పోలియో వ్యాధి నిర్మూలనకి వెచ్చిస్తామంటున్నారు తయారీదారులు.

# చతుర కథలు

## హలో... హలో... హలో...!

"హలో పోలీస్‌స్టేషనా అండీ..."

"కాదు ఫైర్‌స్టేషన్... ఎవరు మీరు..."

"అయ్యా. నేనొక పర్యాటకుడిని. సైకిల్‌మీద దేశయాత్ర చేస్తున్నాను. ఇక్కడ..."

"కొంపలేమన్నా అంటుకున్నాయా... ఎక్కడ ఎంత సేపయింది... త్వరగా..."

"అదేం కాదులెండి... ఫోన్ పెట్టేస్తున్నా..."

"మంచిది!"

"హలో పోలీస్ స్టేషన్... పోలీస్ స్టేషనేనా... హాలో... హాలో..."

"..........."

ఏమిటిది ఫోన్ రింగవుతున్నా ఎంతకీ తియ్యరేమిటి ఖర్మ. హాళవ్... హాళవ్... ఆఁ ఎత్తేరా హమ్మయ్య... హాలో... ఇక్కడ నాల్గో లెవెల్ క్రాసింగ్ దగ్గర అంటే..."

"మెయిల్ మూడు గంటలు... ఎక్స్‌ప్రెస్ ఏడుగంటలు లేటు..."

ఇంతకీ మీరెవరు సార్...

ఎంక్వయిరీస్- రైల్వే.

సారీ ఫోన్ పెట్టేస్తున్నా. వెధవది ఈ సారీ రాంగ్ నెంబరే...

ఆ... ఐడియా. ఈసారి ఫారెస్టువాళ్లకి ఫోన్ చేస్తా.

"హాలో... హాలో...

హాల్లో... హాళ్లవ్... హాల్...లోవ్."

"ఎవరయ్యా నువ్వు... ఏమిటా గావుకేక లు... బ్రతికేవున్నావా"

"లేదండీ... అహ కాదండీ బ్రతికేవున్నా... కానీ తమరు..."

"పోలీస్‌స్టేషన్..."

"రక్షించారు..."

"రక్షిస్తాం... ఎవరు మీరు... ఏమిటి విషయం."

"అయ్యా నొక పర్యాటకుడ్నండీ... నా పేరు సామాన్యుు... ఇక్కడ హాళవ్... ఫోన్ పెట్టెయ్యకండీ క్కడ మూడోనెంబర్ హైవే రోడ్ మీద నాల్గోబర్ లెవెల్‌క్రాసింగ్ దగ్గర ఓ ఏనుగు చచ్చిపోయిందండి. బహుశా పక్కను న్న అడవిలోం వచ్చేసినట్టుందండి.. మరేమో..."

"అవవయ్యా... ఏగు చచ్చింది. మని షేమో అని ఊర్కే ంలెర్థయిపోయాను పె ట్టెయ్... ఫోన్ పెట్టెయ్"

"సార్... నా మాట వినండి... మరో గంటలో ఆ ఏనుగును తొలగించకపోతే సమీపంలోని అడవిలోంచి ఏనుగులన్నీవచ్చి ఈ పరిసర గ్రామాలమీదపడి నానాభత్సం చేస్తా యండీ..."

"అయితే ఫారెస్టు వాళ్ల ఫోన్ చెయ్యక మాకు చేస్తావేం...?"

"అది కాద్సార్... ఇది ఈ చుట్టుపక్కల గ్రామాల శాంతిభద్రతల సమస్య సార్..."

"ఏమిటయ్యో... లా అండ్ ఆర్డర్ గుర్తుచేస్తు న్నావ్... సర్లే... ఇంతకీ ఆ ఏనుగూల్గో లెవెల్ క్రాసింగ్ దగ్గరేనా ఉంట..."

"ఎగ్జాక్ట్‌లీ సార్."

"సరే దాని తలకాయ ఎటువేపుంది..."

"లెవెల్ క్రాసింగ్‌కు తూర్పువైపు సార్..."

"తూర్పునా.... వెరీగుడ్. చూడు బ్బా... మా జూరిస్ డిక్షన్ ఆ గేట్‌తో సరి... ఏను తల పడమటివైపుంటే మాది. తూర్పునవుంటే అదోళకం గ్రామం పోలీస్‌స్టేషన్ పరిలోనికొ స్తుంది... తెల్సిందా...

'తెల్సిందండీ...' (చచ్చాంరా... భగ వంతుడా.... ఈ పబ్లిక్ ఫోన్‌కి ఇంకెన్ని రూపా యలు సమర్పించుకోవాలో...)

"హాలో... ఫారెస్టు డిపార్ట్‌మెంట్...



కాదయ్యా రెవెన్యూ...

వీళ్లూ కన్నొస్నాడే అనుకుంటా "చూడండీ... మూణ్ణంబరు... నాల్గో లెవెల్ క్రాసింగ్... దగ్గర ఏనుగు... అడవిలోంచి..."

"అడివా...సారీ... ఇది రెవిన్యూ డిపార్ట్ మెంట్..."

"తెల్సం.. ఫోన్ పెట్టెయ్యకండీ... తాశీల్దాగారున్నారా'

"లేరు. మంత్రిగారి పర్యటన ఏర్పాట్లో వున్నారు. ఫోన్ పెట్టెయ్యండి..."

"చిత్త...?"

"హ ఫారెస్టు డిపార్ట్‌మెంట్... ఫారెస్ట్..."

రాం నంబరు.

"హీవర్సార్..."

"మున్సిపల్ ఆఫీను."

"క్షించారు మహాప్రభో... ఇక్కడ మూడో నంబ రహదారిమీద ఏనుగొకటి చచ్చిందండీ... దాన్ని మీరు."

తియ్యం... ఏనుగే కాదు అక్కడ చెత్తకుప్పల్నొ తియ్యం... అదేం మా మున్సిపల్ గల్లీ అనుకున్నావయ్యా... హైవే... దానికీ మాకు

నంబంధంలేదు...! టక్...!

(విక్రమార్కుడా... నీవే నాకు ఆదర్శం...)

"హలవ్ ఫారెస్ట్ స్టేషనా... క్షమించండి ఫారెస్ట్ డిపార్ట్‌మెంటా..."

"మీరెవరూ..."

"తర్వాత చెప్తాను. ఇక్కడ ఏనుగొకటి చచ్చి పడుంది. అర్జంటు."

"ఫారెస్టోళ్లకి ఫోన్ చెయ్యండి."

"అయితే మీరు...?!"

"టెలిఫోన్ లైన్ స్టాఫ్... మొన్నటి వరదలకి కేబుల్సన్నీ జామయిపోయాయి... బాగుచేస్తున్నాం... డిస్టర్బ్ చెయ్యకండి..."

అర్థమైంది మీ ట్రబుల్!

(విక్రమార్కా... ఆఖరుసారి ఆశీర్వదించు)

"హలోవ్..."

"ఎస్ ప్లీజ్"

"హమ్మయ్యా... వెంటనే దొరికారు. థాంక్ గాడ్! ఫారెస్టు డిపార్ట్‌మెంటేనా సార్... కాదండీ పిచ్చానుపత్రి..."

??! × % + !!= × ???-0

"మాట్లాడరేం..."

"ఏయ్ ముందు బెడ్ ఖాళీచెయ్... అయ్ ఉయ్... ఐ... ఇదిగో వచ్చేస్తున్నా...!"

—వి.ప్ర

## పూర్ ఫెలో

సాయంకాలం టైము నాలుగున్నర.

నీట్‌గా తయారై సైకిలెక్కి జూనియర్ కాలేజ్‌వైపు వెళ్ళాడు రాంబాబు. తను రోజూ 'బీట్' కొట్టే అమ్మాయి కోసం.

వీధి మలుపు తిరిగే నరికి ఆ అమ్మాయి ఉన్నీసా కనిపించింది. రాంబాబు పెదవుల మీద నవ్వు నర్తించింది. పక్కనే ఉన్న కిళ్ళీ కొట్టుదగ్గర ఆగి, తెలుగు పేపర్లేవీ లేకపోవడంతో తమిళపేపరు చదవనారంభించాడు. ఒక లైను చదవడం... చూపు మరల్చి ఉన్నీసా వైపు చూడటం... యిలా ఆమె షాపు దాటివెళ్ళే వరకూ చదివి, వెళ్ళగానే వెంటబడ్డాడు. ఆమె నడక వేగం తగ్గిస్తే తనూ తగ్గించేడు. పెంచితే

తనూ పెంచేడు.

—దాదాపుగా నెలరోజులనుంచి యిదే పద్ధతి.

'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' రాంబాబుది. ఆమెను చూడగానే ఆమె అందానికి దాసుడై, అదేపనిగా ప్రేమించేస్తున్నాడు. కానీ ఆ విషయం ఉన్నీసాతో చెప్పడానికి భయపడుతున్నాడు - తన శరీరారోగ్యంమీద తనకున్న మక్కువతో.

... ఆ అమ్మాయి యిల్లు వచ్చింది. ఆమె లోపలికి వెళ్ళిపోయింది. బాధ్యత తీరిపోయిందని వెనుదిరిగాడు రాంబాబు. నిశ్చింతగా యింటికి చేరుకున్నాడు.

రోజూలాగానే ఆరోజు రాత్రికూడా ఆమె గురించి ఈస్ట్‌మన్ కలర్‌లో కలలుకన్నాడు.

★ ★ ★

మర్నాడు—

కాలేజీటైం అవగానే డ్యూటీ ఎక్కాడు రాంబాబు. ఉన్నీసా కనిపించింది మామూలు టైముకే.

సైకిల్ ఆపి చైన్ పెట్టుకుంటున్నట్టు నటించి, ఆమె తననిదాటి వెళ్ళగానే యధాప్రకారం వెంబడించాడు.

కొంతదూరం వేగంగా నడిచి, అప్పుడు ఆగి, వెనక్కి తిరిగింది ఉన్నీసా. అప్రయత్నంగా సైకిల్ బ్రేక్ వేసాడు రాంబాబు.

దగ్గరకు రమ్మన్నట్టు సైగచేసింది ఉన్నీసా. రాంబాబు గుండె ఒకక్షణం ఆగిపోయి, మరలా కొట్టుకోవడం ఆరంభించింది.

"నన్నే కాదో" అని అటూయిటూ చూసాడు. ఎవరూ లేరు. వస్తాదులు కూడా ఎక్కడా లేరని నిర్ధారించుకున్నాక. తననే అని దగ్గరగా వెళ్ళాడు -

"రేపు నా బర్త్ డే. మా యింట్లోనే. మీరు తప్పనిసరిగా రావాలి" ప్రాధేయపూర్వకంగా అంది ఉన్నీసా.

రాంబాబు మనసు ఆనందడోలికల్లో ఊగిపోయింది.

మర్నాడు—

ఉన్నీసా యింటికి వెళ్ళేడు రాంబాబు.

గిఫ్ట్ ఆమె చేతిలోపెట్టి - "మెనీ మెనీ హేపీ రిటర్న్స్ అఫ్ ది డే" అన్నాడు చిర్నవ్వు



నవ్వుతూ.

"థాంక్స్" అందామె.

లోపలికెళ్ళి రెండు పింగాణీప్లేట్లు తెచ్చింది. వాటిమీద మూతలున్నాయి. మొహమాటపడుతూ ఒక మూత తీసాడు. దాన్లో స్వీటూ, హాటూ ఉన్నాయి. రెండోప్లేటుమీద మూతతీసాడు. అందులో ఉన్నదాన్ని చూసి స్థాణువయ్యేడు.

దాన్లో ఉన్నదాన్ని తీసి రాంబాబుచేతికి కట్టింది ఉన్నీసా.— అది రాఖీ!

పాపం... రాంబాబు!!

—గోపరాజు రాధాకృష్ణ

## శ్రమదానం

వంట చేసుకుంటున్న సుజాత కాలింగ్ బెల్ వినపడేసరికి వెళ్లి తలుపుతీసింది.

ఎదురుగా ఒక అపరిచిత యువతి నిల్చుని ఉన్నది.

"ఎవరు కావాలండీ?" అనడిగింది సుజాత



ఆ అమ్మాయిని.

"నాపేరు నీరజండీ! నేను 'క్లీనో' వాషింగ్ పౌడర్ కంపెనీలో సేల్స్‌గర్ల్‌గా పనిచేస్తున్నాను. ఇప్పటికే చాలామంది మా వాషింగ్ పౌడర్ పాకెట్లు కొన్నారు. మీరూ ఓ రెండు పాకెట్లు తీసుకోండి మేడమ్!" అన్నదా అమ్మాయి.

సుజాతకు వళ్లుమండింది "మాకు ఏ వాషింగ్ పౌడర్ అవసరంలేదు" అని తలుపు మూయబోయింది విసుగ్గా.

"ప్లీజ్! అలా అనకండి మేడమ్! మా పౌడర్ నాణ్యతలో మీకే సందేహం అవసరం లేదు. కావాలంటే ఈ విషయం ఇప్పుడే నిరూపిస్తాను" అన్నది ఆ అమ్మాయి.

ఆ వెంటనే సుజాతకో ఆలోచన మెరుపులా తట్టింది.

"అలా అయితే నా వెంటరా!" అని బాత్‌రూమ్‌లోకి దారి తీసింది.

ఆమెననుసరించింది నీరజ.

బాత్‌రూమ్‌లో పడివున్న బట్టలగుట్టలోంచి ఓ చీరను తీసి నీరజకిచ్చింది "దీన్ని ఉతికి చూపించు" అన్నట్లుగా చూస్తూ.

నీరజ ఆ చీరను 'క్లీనో' పౌడర్‌తో ఉతికి చూపించింది.

సుజాత అసంతృప్తిగా మొహంపెట్టి ఓ లంగా తీసి చూపించింది "దాన్ని కూడా ఉతుకుచూద్దాం!" అన్నట్లు.

నీరజ ఓపిగ్గా దాన్నికూడా ఉతికింది.

కాని సుజాత ఆ తరువాత కూడా అసంతృప్తిగా చూడటం, పాపం ఆ సేల్స్‌గర్ల్ ఆమెను సంతృప్తిపరిచే ప్రయత్నంలో అక్కడున్న గుడ్డలన్నీ ఒక్కొటొక్కటిగా ఉతకటం కొద్దిసేపట్లో జరిగిపోయాయి.

ఈ తతంగమంతా ముగిసిన తరువాత సుజాత-"ఏమైనా మీ పౌడర్ నాకు నచ్చలేదు" అనేసింది.

ఈ మాట విన్న నీరజకు ఏడుపొచ్చినంతపనయింది. "ఇక నువ్వు వెళ్లొచ్చు" అన్నట్లున్న సుజాత చూపులకు బదులుగా ఏమీ అనలేక నీరసంగా బయటకు దారి తీసింది నీరజ.

తను చేసిన ఘనకార్యానికి లోలోపలే పొంగిపోతూ తిరిగి వంటప్రయత్నంలోపడింది సుజాత.

మళ్ళీ కాలింగ్‌బెల్ శబ్దం వినరావడంతో వెళ్లి తలుపుతీసింది. భర్త నిలబడివున్నాడు. భర్త లోపలికి వచ్చీరాగానే తను చేసిన ఘనకార్యం గురించి గర్వంగా చెప్పి ఆరేసిన బట్టలు చూపించింది.

సదరు భర్తగారు కూడా భార్య తెలివితేటలకు తెగ ముచ్చటపడుతూ-"మొత్తానికి క్షణం కూడా శ్రమపడకుండా గుడ్డలన్నీ ఉతికించావన్నమాట, అలా డిస్టర్బ్ చేసేవాళ్లకు ఇలాంటి శాస్తి చేయాల్సిందే" అంటూ బల్లవైపు చూసి-"ఇక్కడ ఉండాల్సిన టేప్‌రికార్డర్ ఏదీ?" అన్నాడు కంగారుగా.

ఇల్లంతా వెతికినా కనిపించని ఆ టేపురికార్డరును గురించి తలుచుకుంటూ ఏడుపు మొహాలతో ఒకరినొకరు చూసుకున్నారు ఆ దంపతులిద్దరూ!!

—పి.వి.యల్.యన్. ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

